ఓమ్.

వివేక సందర్భ రత్నావళి యను

# జీవేశ్వర సంయోగ రహస్యము.

శ్రీ మద్గారీపుత్ర వంశ పయః పారావార రాకాసుధా
కర్ణాయమాన శ్రీవిష్ణుగోత్రసంభూత ముత్యాల-
రామస్వామి యోగీంద్రుని పుత్రుండును, కుప్ప
మాంబాగర్భశుక్తి మౌక్తిక ప్రాయుండును
శ్రీలక్ష్మీ నృసింహస్వామి వర ప్రసాద
లబ్ధుండును, అధ్యాత్మ విద్యా
విశారదుండును,
శ్రీమాన్. దైవశిఖామణియను
దిగంబరేశ గురు ప్రియ శిష్యుండును
నెల్లూరు నిడిముసలిగ్రామ నివాసస్థుండునగు

## నారసింహ యోగీంద్రునిచే.

రచియింపఁబడి

కందుకూరి. గోవింద - సోమయాజి పుత్రుండగు
యజ్ఞశర్మగారిచే పరిష్కరింపఁబడినది.

చెన్నపురి: పాతచాకలపేట
శ్రీరాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలాధికారియగు
పమ్మి - త్యాగరాయ సెట్టిగారిచే
ముద్రించి ప్రకటింపఁబడియె.

**1915.**

 — [వెల. రూ. 1.

రా-శ్రీ. పృథివి- మునుస్వామిశెట్టిగారు. పాతచాకలపేట మద్రాసు

డిటో - పద్మి - [illegible]గరాయశెట్టిగారు. డిటో డిటో

డిటో - అమర్తలూరి - కోటిలింగంశెట్టిగారు. నిడిముసలి నెల్లూరు.

డిటో - గాదిరాజు [illegible]రాజుగారు. పాలకోడేరు భీమవరం క్రిష్ణా.

డిటో - కొత్తపల్లి - [illegible]గంగరాజుగారు. డిటో

డిటో - యీ- సీతారామరాజుగారు. డిటో

డిటో - యీ- రామచంద్రరాజుగారు. డిటో

డిటో - యీ- శ్రీరామరాజుగారు. డిటో

డిటో - యీ- రామరాజుగారు. డిటో

డిటో - యీ- వెంకటపతిరాజుగారు. డిటో

డిటో - కొత్తపల్లి - తిరుపతిరాజుగారు. డిటో

డిటో - యీ- బాపిరాజుగారు. డిటో

డిటో - యీ- సింగరాజుగారు. డిటో

డిటో - యీ- నారాయణరాజుగారు. డిటో

డిటో - యీ- రామరాజుగారు. డిటో

డిటో - యీ- లక్ష్మీపతిరాజుగారు. డిటో

డిటో - యీ- చిన్నతిరుపతిరాజుగారు. డిటో

డిటో - గాదిరాజు - సుబ్బరాజుగారు. డిటో

డిటో - గొట్టుముక్కల - వెంకట్రాజుగారు. డిటో

డిటో - యీ- సుబ్బరాజుగారు. డిటో

డిటో - యీ- సీతారామరాజుగారు. డిటో

డిటో - కొత్తపల్లి - వెంకటపతిరాజుగారు. డిటో

డిటో - యీ- సర్రాజుగారు. డిటో

పై నుదహరించిన సాత్వికప్రవర రాజయోగీంద్రులు అధ్యాత్మ ప్రత్యక్ష పరశివ చిదానంద ప్రసన్నచిత్త భరితాంతరంగులరై అష్టైశ్వర్య తేజో విభవాతిశయములతో నాయురారోగ్యులై జీవించుచు సదా మన్మయ బ్రహ్మానంద ప్రమనస్కులరై ప్రకాశించుచుండెదరు. ఇతి

ముత్యాల - నారసింహశాస్త్రి

శ్రీ ర స్తు.

విజ్ఞప్తి.—ఆర్యులారా?

శ్లో॥ ఆత్మానాత్మ వివేకేన పురస్సంసారి నిర్వృతిః ।
తద్విద్యానా జన్మకోట్యాపి బంధచ్ఛేదో నసిద్యతి॥

అనగా, ఆత్మానాత్మ వివేకములేనివారు కోటిజన్మము లెత్తినను మోక్షము జెందంజాలరు.

(సోమాత్మా బ్రహ్మ ఆత్మానారాయణః పరః) అను శ్రుతిరీతిగా (ఆత్మయే బ్రహ్మమని దెలిసి) ఆత్మానుభవము బొందనివారు వనవాసముజేసి తలక్రిందులుగా నిలిచి అన్నాహారములులేక (తపస్సు) జేసి యెంతెంత కష్టములు పడినను ముక్తిని జెందర జాలరు.

శ్లో॥ దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవ స్సనాతనః ।
త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోహం భావేన పూజయేత్॥

అనగా, నీదేహమే దేవాలయముగాను నిందువాసము జేయువాను ఆత్మయే పరబ్రహ్మముగాను దెలిసి యెవ్వడు బ్రహ్మైక్యానుభవము పొందుచుండునో వాడేపునర్జన్మములేనివాడై నిత్యముక్తిని బొందంగలడు. తక్కినవారు ఎంతకష్టపడినను ముక్తిపొందంజాలరు. జీవాత్మపరమాత్మయొక్క భావమును శ్రీగురూపదేశంబుచే ఈశ్వరునియందు భక్తిగలిగి ఈశ్వరారాధన గావించువారలకు దయాసముద్రుండగు పరమేశ్వరుని అనుగ్రహంబుచే తన నిజనివాసంబగు కైలాసంబునకు జేర్చుకొనుబుద్ధి గలుగం జేయుచుండునుగాన సగుణోపాసన జపపూజధ్యాన సత్కర్మాచరణంబులు సమస్తపాపంబులు దొలంగించి ప్రపంచ సుఖంబులయందు గోరికెలుడిగించి పరమార్థమునెరుంగి గోర్కెలు పుణాత్ములకు అద్వైతపరిపూర్ణ భావమునందు ఆనందమనోల్లాసము బుట్టించుచుండున్నని వసిష్టులు శ్రీరాములకు బోధించిన మోక్షమార్గము జన్మనివృత్తిపేక్షించు ముముక్షువులు సవికల్పక వృత్తివదలి నిర్వికల్పకసమాధిని నభ్యసింపవలయును (యం యం వాపి స్మరన్భావం త్యజత్యంతే

కళేబరమ్ తంతమేవేతి కౌంతేయ ) అనగా దేహమును విడుచునప్పుడు ఏభావము తలంచుచుండునో మరణానంతరము అదేభావమును పొందు నని భగవద్వాక్యముగలదు. అందు వలననే జ్ఞానసంపన్నుడైన (భరత రాజు) దేహావసానంబున జింకనుస్మరించి జింకజన్మమెత్తవలసెనని భాగవ తోక్తముగాన [విషయసంగమే జన్మమనుట] (త్రిణీవావరేతాగ్ సిపితా పుత్రఃపౌత్రః పితాపుత్రేణ పితృమాన్యోనియోనౌ నావేదవిన్నుతేతం బృహంతం ) రేతస్సు మూడురూపములైనవి తండ్రి కొడుకు మనుమడు ఇట్టి పితృపుత్ర పౌత్రులయందు తండ్రి కొడుకుచేత తండ్రిగలవాడగును (అనగా కొడుకే) తనకు తండ్రి యగును యిట్లు ప్రతిజన్మమందు రేతపరిమా ణములు గలుగుచుండును. వేదార్థమునెరుంగనివాడు ఈ గొప్ప విషయ మును తెలిసికొనజాలడని వేదాభిప్రాయము. ఈ జన్మమున తల్లియైనది పూర్వజన్మమున తనకు భార్యగానుండును. యీజన్మమున భార్యయైనది వుత్తరజన్మమున తల్లిగానుండును. తండ్రిఅంగమునుండి కుమారుని అంగ ములును పితృహృదయమునుండి పుత్రుడు పుట్టును. అట్టిపుత్రుడే ఉత్త రజన్మమున ( పుత్ అనియెడి నరకమునుండి ) తండ్రిని రక్షించువాడ గునని స్మృతినిర్ణయము. మృత్యువును తప్పించుకొనుటకు దేహాభిమాన ముగలవారికి సాధ్యముకాదు. బ్రహ్మాత్మైక్య జ్ఞానముగలవానికి మృత్యు వులేదు. (సర్వం విష్ణుమయం జగత్ ) అనిన్ని శివుని శరీరమే ప్రపంచమని చెప్పియున్నది. ( యత్రతత్ర మనోయాతి తత్రతత్ర పరంపదం ) మనసు దేనియందులయమైతే అదేపరమనిన్ని దేహాభిమానమువిడిచి నిర్గుణ బ్ర హ్మాద్వైత ప్రాప్తిపొందువారికే (విదేహముక్తి) దేహమును జ్ఞానాగ్నిచే త కాల్చుకొన్నవాని కేవిధమైన పిండదానతిలోదకాద్య పరక్రియలు అవ స్యములేదు. బ్రహ్మవేత్తకు చేయవలసినపని ఏమియులేదు (శుద్ధాద్వైత కేవల పరబ్రహ్మప్రాప్తిని) (జీవన్ముక్తిగానున్నా విదేహముక్తిగానున్నా) చెప్పంబడు (మోక్షమును) గురుమూలకముగా సాధించి సిద్ధిపొందిన వారికే మోక్షమను విదేహముక్తి కైవల్యముగలుగుచుండును.

నా ప్రియ సహోదరులారా? నాయందు మీరందరు అతిప్రీతితోడ నీగ్రంథమునజేర్చియుంచు తొమ్మిదిపద్ధతులునున్నా నవరత్నములుగానెంచి (బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి) అనురీతిగా బ్రహ్మమునెరిగినవాడు బ్రహ్మమే యగుచున్నాడనియును (అహంకారం నివర్త్య అహంబ్రహ్మేతి చింతయేత్) నేనునాదియను దురహంకారమువిడిచి అద్వైతులు జీవుడగు నేనే ఆత్మ స్వరూపుడగు బ్రహ్మమనియెరిగి బ్రహ్మైక్యము బొందుచున్నారనుట, సత్యమని వేదములుజెప్పుచుండుట, గురూక్తిచే నెఱిగి ఈ పావనమైన నీతత్త్వరహస్యమును సంపూర్ణచిత్తులరై చదివి వినినను, చదివించి వినినను, చదివి యితరులకు బోధించినను, సునాయాసముగా బ్రహ్మైక్యమును బొందంగలరనే తలంపుతో వాగ్మృదుమధుర రసోక్తులునిండించి భగవంతుని హృదయాంభోజమునందు తేజరిల్లగ స్మరింపుచు రచియించి సంపూర్ణమై నీ భూమండలంబున నాచంద్రతారార్కమై వెలయు నట్లుగా నీ (వివేక సందర్భ రత్నావళి యను, జీవేశ్వర సంయోగ రహస్య గ్రంథమును) జెప్పి ప్రకటింపఁబూనినాడ నిట్టియనుభవసారం బధిగమించి అసదృశానుభవమందెడి యుజ్వలంబున నంగుమీరనియ్యకొనువారలు నాశ్రమకు సార్థకంబుగా నుత్కృష్ట పరిపూర్ణ బ్రహ్మానంద సుఖమనుభవించెదరు గావుత.

విషయసూచిక.



విషయసూచిక సమాప్తము.

వేమన జ్ఞానమార్గపద్యములు. (౩౦౦౨) ఇందు నీతి, ఆచారము, ధర్మము, వేదాంతము మొదలగు పలువిషయముల గురించి వేమనగారిచే రచియింపఁబడి మేలయిన దళసరి కాగితములయందు పెద్ద అక్షరములలో ముద్రింపఁబడి సీమ కాలికోగల మేలైన బైండు చేసియున్నది. ౨ ౦ ౦

వేమనయోగివిరచిత వేదాంత సిద్ధాంతము. పద్యములును తాత్పర్యమును కలది, ఇందు ౫౦౦ పద్యములు కలవు, వేదాంతశాస్త్రమంతయు విస్తరముగా దెలియులాగున దేటతెనుఁగున వ్రాయఁబడియున్నది. ౦ ౧౪ ౦

వేమనపద్యములు. ఆయా జాతులయొక్కయు ఆయా విషయములయొక్కయు వివరణములు వెవ్వేరుగా దెలియునట్లు విభజింపఁబడియున్నది, (౧౮౦౦) పద్యములుండును. ౦ ౧౨ ౦

గురుశిష్యసంవాద వైద్యచింతామణి. ఇందు నవనాథ సిద్ధక్రియలు, ద్రవ్యశుద్ధి, రసయోగ కషాయంబులు తైల లేహ్యా ఘృత చూర్ణంబులు, నస్య ధూపిత భేషజ్య క్రమంబులు, మొదలగు సారతమాంశంబులు విపులంబుగ విశదీకరింపఁబడియున్నది. ఈ యొకగ్రంథము చేత సకల వైద్యవిషయము లెరుఁగగలరు. ౧ ౧౨ ౦

దశావతారచరిత్రము పద్యకావ్యము. ౧ ౦ ౦

శ్రీమద్రామానుజ చరిత్రము. ౧ ౦ ౦

అవధూతగీత. ఇది మూలమును దానికి సర్వైనటీకయు తాత్పర్యమును గల్గి అపరోక్షజ్ఞానమంతయు విస్తరముగా బోధించుచున్నది. ౧ ౦ ౦

ఆనందరామాయణము వచనకావ్యము. ఇందు రామాయణ కథయంతయు సమగ్రముగనున్నది. ౧ ౦ ౦

శ్రీసుదర్శన రామానుజదాసు కీర్తనలు. ౧ ౦ ౦

సుజ్ఞానతత్వ పూర్ణోదయంబను బ్రహ్మగీతా రహస్యము. ౦ ౮ ౦

నిర్గుణాత్మజ్ఞాన సంయోగ కందార్థరత్నావళి అనెడు, ఆచల ప్రబోధము. ౦ ౬

| | | | |
|---|---|---|---|
| సీతారామాంజనేయ సంవాదము. పద్యం తాత్పర్యము. | ౧ | ౪ | ౦ |
| జీవతత్త్వప్రబోధ కుసుమావళి. | ౦ | ౩ | ౦ |
| దేవాంగ పురాణము. శ్లో. తా. | ౦ | ౧౪ | ౦ |
| తత్త్వార్థముక్తాకలాపం వచనకావ్యము. | ౦ | ౨ | ౦ |
| వేమన నీతిపద్యములు (౨౭౭) గలది. | ౦ | ౨ | ౦ |
| కోడెల రామదాసుచరిత్రము. | ౦ | ౨ | ౦ |
| సందేహనివారణ ప్రకాశిక. | ౦ | ౨ | ౦ |
| శ్రీరాజయోగానంద తత్త్వములు. | ౦ | ౨ | ౦ |
| అర్థపంచకము. | ౦ | ౨ | ౦ |
| వేదాంతజ్ఞానబోధిని. | ౦ | ౫ | ౦ |
| ఆశ్చర్యకథాతరంగిణి. | ౦ | ౬ | ౦ |
| షడ్వింశతి తత్త్వకందార్థములు. | ౦ | ౧ | ౦ |
| శుద్ధనిర్గుణతత్త్వ కందార్థములు తాత్పర్యసహితము. | ౦ | ౧౨ | ౦ |
| భల్లాణరాజచరిత్ర వచనము. | ౦ | ౪ | ౦ |
| వినోదకథామంజరి. | ౦ | ౪ | ౦ |
| కైవల్యామృత యోగానుభవ ప్రకాశిక. | ౦ | ౫ | ౦ |
| వేదరహస్య సిద్ధాంత గురుబోధామృతము. | ౦ | ౬ | ౦ |
| శ్రీపరమేశ్వరశతకము. | ౦ | ౧ | ౦ |
| శ్రీవిల్లూరు పార్వతీశసీసశతకం చన్నకందశతకము. | ౦ | ౨ | ౦ |
| వేదాంతరత్నాకరము. శ్లో. తా. శంకరాచార్యవిరచితం. | ౦ | ౮ | ౦ |
| శ్రీలక్ష్మీస్తోత్రరత్నత్రయము, టీకాతాత్పర్యసహితము. | ౦ | ౧౨ | ౦ |
| అధ్యాత్మరామాయణము, టీకాతాత్పర్యసహితము. | ౮ | ౦ | ౦ |
| అమృతబిందోపనిషత్తు. శ్లో. తా. | ౦ | ౨ | ౦ |

ఇంకను అనేక సంస్కృతాంధ్ర గ్రంథములు దొరకును. వలయు వారు దిగువ విలాసమునకు వ్రాసికొనవలయును.

పమ్మి - త్యాగరాయసెట్టి.
శ్రీరాజరాజేశ్వరీ నికేతన ప్రెస్,
పాతచాకలపేట మద్రాసు.



ముత్యాల - నారసింహాయోగి.



ప్రకటన.

సకలమైన సంస్కృత, ఆంధ్ర గ్రంథములు వలయు వారలు ఈదిగువ కనబఱచియుండు పై విలాసదార్లకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.





ఓమ్.

శ్రీరామచంద్ర గురుపరబ్రహ్మణేనమః.

వివేకసందర్భ రత్నావళి

# జీవేశ్వర సంయోగ రహస్యము.

## ౧. సద్రూపచిద్రూప సందర్శనము.

### మంగళాచరణము.

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు గురుర్దేవ మహేశ్వరః।
గురుసాక్షా త్పరబ్రహ్మా తస్మై శ్రీ గురవేనమః॥

తా. బ్రహ్మావిష్ణు మహేశ్వర స్వరూపుఁడును, సాక్షా త్పరబ్రహ్మమునైన శ్రీగురుస్వామికి నేను నమస్కరింపుచున్నాను.

శ్లో॥ వందేహం సచ్చిదానందం భేదాతీతం సదాగురుం।
నిత్యం పూర్ణం నిరాకారం నిర్గుణం స్వాత్మసంస్థితమ్॥

తా. సచ్చిదానందస్వరూప శాశ్వతమైన శరీరము, స్వాత్మయందున్నట్టి పరమాత్మనుగూర్చి నమస్కరింపుచున్నాను.

ఇట్లు శాస్త్ర పురాణాగమములలో వ్రాయంబడియుండుటేగాక పెద్దలున్నూ వొప్పుకొని యున్నారుగదా.

### భగవన్మహిమ.

శ్లో॥ ఆదిసర్గే మహావిష్ణు స్స్వప్రకాశో జగన్మయః।
గుణభేద మధిష్ఠాయ మూర్తిత్రయ భవాత్మవాన్॥

తా. ఆదిసృష్టియందు స్వప్రకాశముగను, జగద్రూపముగనుండు (నారాయణుఁడు) సత్వరజస్తమములనెడి గుణభేదములచేత విష్ణుబ్రహ్మ రుద్రులైనారు.

## గురుశబ్దార్థము.

శ్లో॥ గురురేవ పరంబ్రహ్మ గురురేవ పరాగతిః।
గుశబ్ద స్త్వంధకారస్స్యాత్ రుశబ్దస్త న్నిరోధకః।
అంధకార నిరోధత్వా ద్గురురిత్యభిధీయతే॥

తా. గురువే పరబ్రహ్మము, గురువే సద్గతి, గు వర్ణము అంధ కారము, రు వర్ణము అంధకారం నిరోధించునది, అజ్ఞానాంధకారమును బోఁగొట్టుటవలన గురువని చెప్పంబడును.

శ్లో॥ గుకారశ్చ గుణాతీతో రుకారో రూపవర్జితః।
గుణాతీతమరూపంచ యత్తత్త్వం సగురుస్స్మృతః॥

తా. గు,అనుపక్షరము గుణాతీతమైన పరమాత్మ; రు, అనునక్షరము నామరూపవివర్జితము, అట్టి గుణాతీత నామరూపరహిత తత్త్వమే గురువని చెప్పంబడును.

విశేషార్థము.—గురువనెడి పరమాత్మ నామరూపసహిత శిష్యుని త్రిదహితముగా జేయును, అనగా జీవబ్రహ్మైక్యస్థితి నొసంగును. అట్టి (నివృత్తిజ్ఞానము) బోధించుటలో (జ్ఞానం వినా మోక్షోనసిధ్యతి) యనెడు న్యాయంబుగా దృఢజ్ఞానముగల్గిన మోక్షమనియు కలుగనియెడల మోక్షము గలుగదనియు బోధించును.

శ్లో॥ అజ్ఞాన కలుషం జీవం జ్ఞానాభ్యాసా ద్వినిర్మలం।
కృత్వాజ్ఞానం స్వయం నశ్యేత్ జలే కతకరేణువత్॥

తా. జీవుఁడు అజ్ఞానుడగును, జ్ఞానాభ్యాసమువల్ల నిర్మలుడగును, జ్ఞానము సిద్ధించిన అజ్ఞానమడంగును, బురదనీరుయిండుపగింజచే నిర్మలమగునట్లుగా శుద్ధుడగును.

వి.—అట్లే పరమగురుడు పూర్వజన్మ కర్మఫలములను నశీయింపజేసి తమవలెనే స్వయం ప్రకాశుడుగా జేయుచుండును. కాబట్టి మన కామక్రోధ లోభ మోహ మధమత్సరాది వృత్తుల జయించుటకు నిజగురుధ్యానమే సాధనముగా నియమించి తద్వారా ఈశ్వరునిగా తమ తమ స్వగురుమూర్తిని సర్వకాల సర్వావస్థలయందు మానసంబున నిల్పి పూజింపజేసి మోక్షార్హులుగమ్మని గురువులు బోధించుచుండిరి. అట్లా పరమశివుడు పార్వతీదేవికి యుపదేశించిన విధానం బెట్లనిన.

శ్లో॥ ఉపదేశ మయాదేవి గురుమార్గేణదర్శితః।
గురుభక్తి స్థదాధ్యానం సకలం తవకీర్తితః॥

తా. ఓపార్వతీ గురుస్వామివల్ల దృఢమైనబోధ భక్తిచేత సదా ధ్యానమును దర్శనమును నెఱుంగనగును.

శ్లో॥ దుర్లభం త్రిషులోకేషు తచ్ఛృణు ష్వనదామ్యహం।
గురుబ్రహ్మ వినానా స్సత్సత్యం సత్యం వరాననే॥

తా. ఓపార్వతీ మూడులోకములకు దుర్లభమైన రహస్యమును నీకొరకు చెప్పుచున్నాను, గురువనే బ్రహ్మముగాక వేరేమియు సత్యమైనదిలేదు ఇదేసత్యం ఇదేసత్యం.

శ్లో॥ గురుం పరాత్పరం ధ్యేయం నిత్యమానందకారకం।
హృదయాకాశమధ్యస్థం శుద్ధ స్ఫటికసన్నిభం।
స్ఫటిక ప్రతిమారూపం దృశ్యతే దర్పణేతథా॥

తా. బ్రహ్మరుద్రాద్యఖిల దేవతలును, ధ్యానముచేయుట కర్హమైనట్టి హృదయాకాశ మధ్యభాగమున పరిశుద్ధ స్ఫటిక మణికాంతితో చేయబడిన బొమ్మరూపు దర్పణమందు ప్రకాశించునట్లు నిర్మలమదిలో ధ్యానించతగ్గది.

శ్లో॥ తథాత్మానం చిదాకారం ఆనందం సోహమిత్యతః।
అంగుష్టమాత్రః పురుషై ర్ధ్యాయతే చిన్మయేయథ॥

తా. అంగుష్ట ప్రమాణమై ముముక్షువులచేత ధ్యానముచేయ బడు స్వరూపము, సోహంబనెడు ధ్యానమువల్ల చిదాత్మాకారమగు ఆనందమయకోశమున నాత్మైక్యమును బొందుదురు.

వి.—లోకంబున సద్గురువులు తమశిష్యుల హృదయగుహాయందు ఈశ్వర తేజస్సును చూపించి ఆయీశ్వర శక్తిని సదా ధ్యానించమని బోధించెదరు. వారివారిధ్యానమందు (యద్భావం తద్భవతి) అనెడి న్యాయంబుగా ఫలముబొందంగలరని ఏకనిష్టయందు ధ్యేయమూర్తిని ధ్యానించి తన్మయమందుచుండెడి జీవులు పునర్జన్మములనుబొందరనిన్ని, అపరిపూర్ణులు జన్మములకు వచ్చుచుండెదరనిన్ని, సగుణధ్యానమున దృఢమైనవారలు నిర్గుణ బ్రహ్మానందమందెదరని బోధించెదరు.

శ్లో॥ నకాష్టే విద్యతేదేవో నపాషాణమృణ్మయే ।
భావేతు విద్యతేదేవ స్తస్మాత్ భావేన భావ్యతే॥

తా. దేవుడు కట్టెయందును, జాతియందును, మంటెయందును లేదు. భావమునందు ( హృదయ గుహాయందు ) తెలియును. కాబట్టి మనస్సుచేతనే దేవుని భావించవలయును.

శ్లో॥ తీర్థేదానే తపోయజ్ఞో కాష్టే పాషాణకేసదా ।
శివం పశ్యంతి మూఢాత్మ శివోదేహే ప్రతిష్టితః॥

తా. తీర్థములయందును, దానములయందును, యజ్ఞములయందును, కట్టెలయందును, శిలలయందును, మూఢులు శివుని వెదకెదరు. (పరమాత్మ) తనదేహమందే యున్నాడు.

వి.—జ్ఞానియగువాడు పునర్జన్మముబడయకుండుటకు తనయొక్క హృదయమందే పూజించవలయును. భాహ్యాపూజ నిగ్రహించవలెను (ఆత్మస్వరూపము) నుపాసించతగినది ఎంతవరకు ఆత్మతత్వము నెఱుంగబడదో అంతవరకు అనేక కర్మలను మనస్సును శుద్ధిపరచుటకై దేహశుద్ధికై జప తప యజ్ఞములు తీర్థయాత్రలుచేయవలయును. తనవివేకము

చేతనే మనస్సును స్వాధీన పరచుకొనందగు, స్వాధీనమైన మనస్సుగల యోగీంద్రులు మనస్సును సేనకుడిగను మంత్రివలెను మండలాధిపతిగను మనస్సును స్వాధీనములో నుంచుకొందురు. అట్టి స్వాధీనమైన జ్ఞానులు మరణానంతరము స్థూలశరీరమునవలి సూక్ష్మ శరీరములతో భువర్లోకమున పరిపూర్ణ బ్రహ్మానంద సుఖమనుభవించుచుండెదరు. అపరిపూర్ణులు భువర్లోకమున యాతనా శరీరములతో తమతమ ధ్యానసంకల్పములకు తగినట్లు సంభవించెడు నరకమనుభవించి తిరుగా జన్మించెదరు.

సర్వదోషనాశము.

శ్లో॥ జ్ఞానిన సర్వపాపాని విస్యతే నాత్రసంశయః।
క్రీడన్నపి న్లిప్యేత పాపై ర్నానావిధైరపి।

తా. జ్ఞానికి సకల పాపములును నశించుచున్నవి సంశయము లేదు. వానికి పలువిధములైన పాపములు పుట్టినప్పటికిని నిర్మలభక్తుడగుటచే అవి వానినంటవు.

శ్లో॥ మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః।
బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్॥

తా. ఈ సకల ప్రపంచమున్ను మనస్సే, మనుష్యునియొక్క బంధమునకిన్ని శత్రువును మనస్సే, మోక్షమునకు కారణమైనది మనస్సే, విషయాశక్తితోగూడినది బంధమనియును, నిర్విషయమనస్సు ముక్తిగా నెఱుంగనగును.

వి.—మనస్సునడంచుటకు అభ్యాసముజేయవలయును. నెట్టివారిని మదియందునిల్పి పూజింతెమో వారితేజస్సు మదియందు ప్రవేసించి ఆయాస్థితికి దెచ్చుచుండును.

గురుస్తుతి.

శ్లో॥ గురుచరణం భవహారం శరణాగతాభరణమాత్మ సుఖకరమ్।
మరణభయాన్తకరం తరుణారుణ కిరణమహామీడే॥

తా. సంసారదుఃఖమును (పాపమునులేక జన్మమును) బోగొట్టునదియును, ఆశ్రితులను (శరణాగతులను) సంరక్షణము చేయునవియును, (పునర్జన్మము నశింపజేయునదియును) అగు గురువుయొక్క చరణకమల బాలారుణ ప్రకాశముచేత నావరింపబడిన నేను (అట్టి చరణములను) స్తోత్రము చేసెదను.

వి.—భక్తిపురస్సరముగా గురువునునాశ్రయించిన శిష్యునికే సదుపదేశమును గురుప్రసాదంబునులభించును. సద్యోముక్తియొనగూడును.

చ. తలపగమూలదుంప పరమార్థము దెల్పను శక్యమేభువిన్।
బలిమిని యాత్మగుట్టు మదిభావనసేయగ బ్రహ్మతత్త్వమున్।
గలుగును ముక్తిజీవులకు కాపున నాత్మనిధానదృశ్యమిా।
సలలిత సత్స్వరూపమని చాటును వేమన లోకమెల్లెడన్॥

తా. వేమనయను యోగివర్యుడు లోకులెల్లరును మాయలో దగిలియున్నారని దెలసి పరబ్రహ్మముయొక్క నిశ్చయము దెలియుటకు ఆత్మవిచారము చేయవలయుననియును, ఆత్మవిచారముచేతనే ముక్తికలుగుననియును, ఆత్మ యెరుగవలయు ననియును, యిదితప్ప అనాదిగా యుండుమూల కందమైన కర్తనుగూర్చి విచారించి ప్రయోజనములేదనియును, మఱియు దానిదెలసికొనుటకు ఎవ్వరికి సాధ్యముకాదనియును, బోధించెను. (మాయాచావిద్యాచ స్వయమేభవతి) అనిజెప్పియున్నది.

భగవద్రూప వివరణము.

శ్లో॥ నారాయణో௨క్షరోనంత సర్వవ్యాపి నిరంజనః।
తేనేద మఖిలం వ్యాప్తం జగత్స్థావర జంగమమ్॥

తా. నాశరహితుడును, ఆద్యంతములులేనివాడును, సర్వవ్యాపియును, పరిశుద్ధుడును అగు నారాయణుండు స్థావర జంగమాత్మక ప్రపంచంబంతయు వ్యాప్తమైయున్నది. భగవంతుం డొక్కడే సకల ప్రపంచమై యున్నాడని భావము.

శ్లో॥ యథాశివ స్తథావిష్ణు ర్యథావిష్ణు స్తథాశివః।
అంతరం శివవిష్ణ్వోశ్చ మనాగపి నవిద్యతే॥

తా. శివుండెట్లో అట్లు విష్ణువు, విష్ణు వెట్లో అట్లు శివుఁడు, శివ విష్ణువులకు కొంచమైనను భేదములేదు.

శ్లో॥ ఏకమేవా ద్వయం బ్రహ్మ నేహ నానా స్తికించన॥

తా. రెండవదిలేని బ్రహ్మ మొక్కటేయున్నది ఇచ్చట వేరే మియు కొంచమైననులేదు.

శ్లో॥ బ్రహ్మసర్వమిదం విశ్వం విశ్వాతీతంచ తత్పదమ్।
వస్తుతస్తు జగన్నాస్తి సర్వం బ్రహ్మైవ కేవలం॥

తా. ఈ సకలప్రపంచమును బ్రహ్మమే, ఆ బ్రహ్మమే ప్రపంచము నందు శ్రేష్ఠమైనది వాస్తవముగాజూడ తానుగాక జగత్తులేదు సర్వమును బ్రహ్మరూపముగానున్నది.

వి. బ్రహ్మము అనిర్వాచ్యము, అఖండస్వరూపము, పరబ్రహ్మము, అట్టి పరమాత్మ స్వరూపమును (గుడ్డివాఁడు తనముందరియుండు వస్తువులను చూడంజాలఁడుగదా) అట్లుగురుశిక్షపొందనివాఁడు బ్రహ్మము నెఱుగం జాలఁడు.

శ్లో॥ తపేద్వర్ష సహస్రాణి ఏకపాద స్థితో నరః।
ఏతస్యధ్యానయోగస్య కలాం నార్హంతిషోడశిమ్॥

తా. మనుష్యుఁడు ఒకకాలితో నిలచి వెయ్యిసంవత్సరములు తపస్సుజేసినను అది ఆత్మధ్యానముయొక్క పదునారింట నొకభాగము నకు సమముకాదు.

చిత్తసంసార కారణము.

శ్లో॥ చిత్తాంతరేవసంసారః కుంభాంతః కుంభఖం యథా।
చిత్తనాశేన సంసారః కుంభనాశేన కుంభఖమ్॥

తా. ఘటమున ఘటాకాశమెట్లు, అట్లు చిత్తమునందు సంసార మున్నది, ఘటమునాశనమైన ఘటాకాశములేనట్లు, చిత్తమునాశమైన మీాద సంసారము నశించుచున్నది.

శ్లో॥ సర్వచింతాం పరిత్యజ్య సావధానేనచేతసా।
నారాయణాను సంధ్యేయో యోగసాంబ్రాజ్య విచ్ఛతి॥

తా. యోగసాంబ్రాజ్యమును గోరినవాడు సమస్తమైన చింతలనువిడచి సావదాన మనస్కుడై నారాయణ శబ్దవాచ్యుడైన పరమాత్మ (నారాయణ) అని అనుసంధానము ధ్యానముచేయవలయును, జీవుడు తన్ను సకలభూతములయందును, సకలభూతములుతనయందును, జూచుచుండువాడు బ్రహ్మమును బొందుచుండును. నాపరబ్రహ్మము నిత్యముగను శుద్ధముగను జ్ఞానస్వరూపముగను అద్వైతయుండుగను తురీయమైనదిగను నుండు బ్రహ్మము (నేనైయున్నానను) నదే పరమపదము (మోక్షస్థానము) అని యెంచందగు.

శ్లో॥ మనస్థం మనమధ్యస్థం మధ్యస్థం మనవర్జితం।
మనసా మనమాలోక్య స్వయం సిధ్యంతియోగినః॥

తా. మనస్సు మనస్సుచేతనే యోగులుజయించుచుండవలెను, జయించువారలు అర్చిరాదిమార్గంబగు శుక్లపక్షమియను (జ్ఞానమార్గమున) బోవు బ్రహ్మోపాసకులుక్రమముగాముక్తినిజెందెదరు. ధూమమార్గంబగు కృష్ణపక్షమియను (అజ్ఞానమార్గమున) బోవు కర్మయోగులు చంద్రలోక (స్వర్గమున) కర్మక్షయమునరకునుండి తిరుగా జన్మమునకు వచ్చుచుందురు. నిస్సంకల్పయోగీశ్వరులు యీశ్వరాంశమునందు గలియుదురు. నిప్పునందు వెడలు మిణుగురులు నిప్పేయగుచుండునుగదా అట్లేలాందరునందుండు అద్దములమురికినితుడిపించిన స్పష్టముగా ప్రకాశించును గదా, అట్లే మన కామక్రోధ మధమాత్సర్యాది మాలిన్యగుణములం బోగొట్టుకొనిన ఈశ్వరాంశమగు తేజంబున గలియవచ్చును.

## సర్వం మనోమయము.

శ్లో॥ మనఏవ జగత్సర్వం మనఏవ సదారిపుః।
మనఏవ హి సంసారో మనఏవ జగత్త్రియమ్॥

తా. ఈ సకల ప్రపంచమును మనస్సే మనస్సెవుమను (శత్రువుగానున్నది) సంసారముగానున్నది త్రిలోకములు మనస్సే యగుచున్నది.

## ప్రపంచము సద్రూపము.

శ్లో॥ అస్తిచేద స్తితారూపం బ్రహ్మైవా స్తిత్వ లక్షణమ్।
అస్తిత్యుక్తే జగత్సర్వం సద్రూపం బ్రహ్మతద్భవేత్॥

తా. ఉన్నదియనెడువస్తువు ఉండునెడల అట్లున్నదనెడి లక్ష్యము బ్రహ్మమే, జగత్తువున్నదనగా అట్లుండుజగత్తు మొదలగునవి యన్నియు సద్రూపమైన బ్రహ్మమేయగును, సమస్తము బ్రహ్మమేయనిభావము.

## ప్రపంచము చిద్రూపము.

శ్లో॥ భాతీయుక్తే జగత్సర్వం భానం బ్రహ్మైవ కేవలమ్।
మరుభూమౌ జలం సర్వం మరుభూమాత్రమేవ తత్।
జగత్త్రయ మిదం సర్వం చిన్మాత్రం స్వవిచారతః॥

తా. జగము కనుపడుచున్నదికదా, యనగా అట్లు కనుబడున దియును (బ్రహ్మమే) మరుభూమియందుతోచునట్టి జలమంతయు( విచారించగా) మరుభూమిగానేయున్నట్లు (జలముకానట్లు) తనస్వరూప విచారమువల్ల త్రిలోకములును చిత్స్వరూపముగనే యున్నది అనగా బ్రహ్మమే ప్రపంచముగా గనుపడుచున్నదని భావము.

## ప్రపంచానందరూపము.

శ్లో॥ దృశ్యతే శ్రూయతేయద్య ద్బ్రహ్మణో న్యన్నతద్భవేత్।
నిత్యశుద్ధ విముక్తైక మఖండానంద మద్వయమ్॥

తా. ఏదేది కనుబడుచున్నదో ఏదేది వినబడుచున్నదో అవియంతయు బ్రహ్మముతప్ప వేఱుకాదు ఆబ్రహ్మము నిత్యమై శుద్ధమై బంధరహితమై అఖండానందమై రెండవది లేనిదై యున్నది.

సర్వశబ్దవాచ్యుఁడు పరమాత్మ.

నారాయణ శ్శివో విష్ణు శ్శంకరః పురుషోత్తమః।
ఏతేషు నామభిర్బ్రహ్మ పరం ప్రోక్తం సనాతనమ్॥

తా. నారాయణుఁడు శివుఁడు విష్ణువు శంకరుఁడు పురుషోత్తముఁడు అను నీ నామములయందు ఏనామముచేతనైనను శాశ్వత పరబ్రహ్మముగా చెప్పఁబడును.

వి. జగత్కారణమైన పరమాత్మ గుణరహితుఁడైనను రజోగుణమును స్వీకరించి బ్రహ్మస్థితినిబొంది సృష్టి చేయుచున్నాఁడు సత్వగుణప్రధానుఁడై విష్ణుస్థితినిబొంది ధర్మాధర్మములను పాలించుచున్నాఁడు తమోగుణప్రధానుఁడై రుద్రుఁడు ప్రపంచమునంతయు నశింపఁజేసి త్రిలోకములను స్వప్నమువలె జేయుచున్నాఁడు నిర్గుణుండైనను త్రిగుణములతోఁగూడి యున్నాఁడని భావము. త్రిలోకములు స్వప్నమువలె మిథ్యయని, పరమాత్మయొక్కఁడే సత్యమని యెంచనగు, అట్టి కేవలబ్రహ్మము మనోజయముచేతనే యోగీంద్రులు పొందుచుండెదరు.

మనోజయోపాయము.

శ్లో॥ అధ్యాత్మ విద్యాధిగమ స్సాధుసంగతి రేవచ।
వాసనాసం పరిత్యాగః ప్రాణస్పంద నిరోధనమ్।
ఏతస్తాయుక్తయః పుష్టా స్సంతిచిత్త జయేక్రమాత్॥

తా. బ్రహ్మవిద్యాభ్యాసము ౧, సాధుసంఘము ౨, వాసనాపరిత్యాగము ౩, ప్రాణస్పందనిరోధము౪, (అనునీనాల్గుసాధనములు) ఉపాయములు మనోజయమునకు తగియున్నవి. శాస్త్రములు జదువుట ౧, సద్గురువుల నాశ్రయించుట ౨, మలినవాసనలువిడుచుట ౩, వాయువుయొక్క చలనమడ్డగించుట, ౪.

వి. మనస్సుశాంతివలన ధర్మపత్నివలెనగును ఆత్మసంరక్షణార్థమై తండ్రివలెనగును మనస్సు ఉత్తమపథము నొసంగుటకు సుహృత్తమగుచుండును.

### జీవన్ముక్తులు.

శ్లో॥ జీవన్ముక్తా నజీవంతి సుఖదుఃఖ రసస్థితే।
ప్రకృతే నార్థకార్యేణ కించిత్కుర్వంతి వా న వా॥

తా. జీవన్ముక్తులు సుఖదుఃఖములయొక్క అనుభవముగలవా రుండరు అయినను ప్రకృతి సంబంధమైన కార్యములు కొంచము చేయుచు న్నారు కొంచముచేయరు జీవన్ముక్తులు యిష్టానిష్టములనుబట్టి సంతోషమును దుఃఖమును బొందరనియును ప్రపంచసంబంధమైన కార్యములు కొన్నిటిని చేసియు చేయకయుందురు.

వి. సంసారమందిచ్ఛలేనివాడును, సంప్రాప్తమైన సుఖదుఃఖములు బొందనివాడును, సంతోషము, అసూయ, భయము, క్రోధము, కామము, కార్పణ్యము, మనస్సు, ఆకాశమునలె నిర్మలముగా నుండు వాడును, చిన్మాత్రమైన పరమపావనపదమందు నిశ్చలమనస్కుడై యుండు వాడును, మనోవృత్తి నిద్రయందున్నట్టి వానివలె నుండువాడును, స్వస్వరూప, సహజామనస్క, లక్షమందుండు వాడును, జీవన్ముక్తుడని చెప్పం బడును.

### విదేహముక్తి లక్షణము.

శ్లో॥ జీవన్ముక్త పదం త్యక్త్వా స్వదేహే కాలసాత్కృతే।
విశత్యదేహ ముక్తత్వం పవనో౽స్పందతామివ॥

తా. జీవన్ముక్తుడు తనశరీరమును కాలాధీనముజేసి చలన స్వభావముగల వాయువును స్తంభించి మైత్రాదిగుణ సంహితంబైన సత్వోపాధిని విడిచి విదేహముక్తిని పొందును.

వి.—సత్వోపాధికలవాడు జీవన్ముక్తుడు, సత్వోపాధి లేనివాడు విదేహముక్తుడు, విదేహమనగా దేహములేనివాడు, దేహములేనివాడనగా జననమరణము లేనివాడు, అనగా వాయువును స్తంభించు యోగమువలన దేహశుద్ధినిబొందుచుండునని తెలియందగును. విదేహముక్తునకు

శరీరోపాధులులేవు గనుక నీవు నేననువాను అనెడి వ్యవహారములులేవు కాబట్టి తురీయాతీతదశయని యెఱుంగునది.

మహావాక్యమహిమ.

శ్లో॥ వేదాంతానాం మహావాక్య శ్రవణేన తథైవచ।
మననేన తథాదేవ ధ్యానేన పరమాత్మనః।
ప్రత్యక్ బ్రహ్మైక్యతా జ్ఞానం లబ్ధ్వాయాతి పరం పదమ్॥

తా. వేదాంతముయొక్క మహావాక్యమును వినుట వలనను, మననము చేయుట వలనను, ప్రకాశ స్వరూపియైన పరమాత్మయొక్క ధ్యానము వలనను, జీవబ్రహ్మైక్యమునొంది ఉత్తమమైన పదమును (మోక్షమును) బొందుచున్నాడు.

శ్లో॥ మహావాక్య ప్రకరణం సాక్షాచ్చిన్మయం పరమ్।
ముముక్షూణాంచ వక్తవ్యం నాన్యేషాంచ కథంచన॥

తా. శ్రేష్ఠమైనదియునగు మహావాక్య ప్రకరణమును ముముక్షువులకు (మోక్షాపేక్ష కలవారలకు) చెప్పఁదగినది ఇతరులకు ఎప్పుడును చెప్పగూడదు.

మహావాక్యచతుష్టయము.

శ్లో॥ ప్రజ్ఞానం బ్రహ్మేత్యాది మహావాక్య చతుష్టయమ్।
మహావాక్య చతుర్వాక్యం ఋగ్యజుస్సామసంభవమ్॥

తా. ప్రజ్ఞానం బ్రహ్మ అను నీమొదలగునాల్గువాక్యములు మహావాక్యములనఁబడును. ఋక్, యజుస్, సామము, అను వేదములయందుండి పుట్టినవి.

౧ ప్రజ్ఞానం బ్రహ్మ శ్రేష్ఠమైన జ్ఞానమే బ్రహ్మము.

౨ అహం బ్రహ్మాస్మి నేను బ్రహ్మముగా నున్నాను ఇది గురూపదేశమొందిన శిష్యుడు నేనే బ్రహ్మమును బొందినానని భావించునట్టి వాక్యము.

3 తత్వమసి అదినీవై యున్నావు అట్లుగురువు శిష్యునకు దేహమందున్నట్టి నీయాత్మబ్రహ్మముఅనిగుర్తించి తెలియజేయునట్టివాక్యము.

౪ అయమాత్మా బ్రహ్మము ఈ ఆత్మబ్రహ్మమని గురువు శిష్యునకు దేహమందుండు నీయొక్క ఆత్మయే బ్రహ్మముఅని గుర్తించి తెలియజేయునట్టి వాక్యము.

వి.—పరబ్రహ్మము ప్రతినిత్యము అభ్యసించుస్వభావముగలవానికి చక్కగా దెలియును, ఆ సనాతనమైన పరబ్రహ్మము సూక్ష్మముగానుండుటవలన ఇట్టిదని చెప్పుటకు సాధ్యముకాదు, సంయోగమువలననే ఆ బ్రహ్మమును చక్కగా దెలియదగినది, స్వానుభవంబుచేతను, యోగంబుచేతను, బ్రహ్మం బెటుకపడవలయునేగాని చెప్పుటకు సాధ్యము కాదని భావము.

## ప్రణవధ్యానము.

శ్లో॥ ప్రణవోహి పరబ్రహ్మ ప్రణవః పరమం పదమ్।
ప్రణవం సర్వ తేవాద్యం సర్వదేవ మయుం విదుః।
సర్వేషాంచైవ మంత్రాణాం ప్రణవః ప్రాణఉచ్యతే॥

తా. ప్రణవమే పరబ్రహ్మము, మోక్షపదము, సకలవేదములకు మూలము, సకలదేవతులకు సకలమంత్రములకు జీవమైయున్నట్టు జెప్పఁబడుచున్నది.

వి.—ఓంకారమునందు నాల్గువేదములు కలిగెను, సకల స్వరములు కలిగెను, సర్వమును చరాచరంబులు ఓంకారముననే కలిగెను, ఓంకారమువిల్లుగాను, ఆత్మ భావముగాను, బ్రహ్మముగుఱిగాను, చెప్పఁబడెను. యుక్తమైన మనస్సుచేతను, సూక్ష్మ దృష్టిగల వారిచేతను, (బ్రహ్మము) చూడబడుచున్నది.

## శుద్ధరాజయోగధ్యానము.

శ్లో॥ సోహం చిన్మాత్రమేవేతి చిన్తనం ధ్యానముచ్యతే॥

తా. చిన్మాత్రంబైన బ్రహ్మమే నేనుఅని చింతించుటె ధ్యానమని చెప్పంబడును.

వి.—ఈకనుపడునట్టి ప్రపంచము లేనిదియు, రాగద్వేషనాశనమును జ్ఞానముచేత కలుగుచుండగా బుట్టెడు ఆనందము సమాధియని జెప్పంబడును. సంకల్పవికల్పములు నశించినమనస్సు ఆత్మయందు ఏకమగుట సమాధి, బ్రహ్మమే నేను భావించుటవల్ల ఆత్మశక్తి స్వరూపావస్థ కల్గుటే సమాధి, అట్టి సమాధిలో గాలిలేనిస్థలమందలి దీపముమాట్కి నిశ్చలమైనదో నిర్వికల్పసమాధియగును అదియె (శుద్ధబ్రహ్మానందస్వరూపసమాధి) యగుచున్నదని గ్రహించందగు, ఇట్టి మర్మంబులు మహేశ్వరుండుమాదేవికి తెలియంజేయుటగాక గురుగీతలు ఉపనిషత్తులు యోగశాస్త్రంబులు తేటతెల్లంబుగాబోధించుట మద్గురు సాంప్రదాయకంబుగా ఏనెఱింగి లోకంబునభక్తులకై సులభోపాయంబుగా తాత్పర్య విశేషార్థములతో జెప్పియున్నాడను, గాన మనజననమరణ ప్రవాహంబు దాటించుసద్గురుని నెవరికి శరణమొందిన వో ప్రతిఫలమునందవచ్చుంగదా యనెడు శలంపే నెదనుంకించి నీగ్రంథముచే తత్వజ్ఞాన మంకురింపంజేయుటకుం గొన్ని సులభోక్తులు శ్లోకములు పద్యములు తాత్పర్య విశేషార్థములు జెప్పియున్నాడ నిందలి తత్త్వజ్ఞాన మార్జింపం దొడరు సుజ్ఞానులకు తత్త్వజ్ఞానోదయము స్వహృదయమ్మున ప్రకాశించి ప్రసన్నచిత్తభరితాంతరంగులరై యుత్కృష్ట పరిపూర్ణ బ్రహ్మానంద సుఖమనుభవించుచుండునట్లు జేయుటకై భగవంతుని హృదయాంభోజమునందు దేజరిల్లగా స్మరించుచుండెద.

క॥ ఇది జదివిన ఆనందం బిది పరమ సుఖంబు వినుట కిది మేలుసుమీ।
ఇది సద్బ్రహ్మానందం బిదియమృతపదమునిచ్చు నిలభక్తులకున్॥

సద్రూప చిద్రూప సందర్శనము.

సమాప్తము.

శ్రీ ర స్తు.

శ్రీ గణేశాయనమః.

శ్రీరామచంద్ర గురు పరబ్రహ్మణే నమః.



శ్రీ చిత్కళా సంపత్తి.

## దేవ గురు పండితుల స్తోత్రము.

సీ. శ్రీవిష్ణురాజును చిత్తాబ్జముననుంచి బ్రహ్మనుమది జేర్చి ప్రస్తుతించి।
పరమేశునెప్పుడు బాయకపూజించి విఘ్నమూర్తిని చిత్తవీధినిల్పి।
కాళికాదేవిని కన్నులలోనెంచి తాతతల్లిని వేడి తలపునించి।
భారతినోరార బల్కుటకర్పించి దైవశిఖామణి దలచి గురుని।
పండితవిధేయుడై యేను భాషితముగ।
సీసశతకంబు జెప్పెద వాసిగాను।
వసుధ మర్త్యాల వంశ పావనవికాస।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

## అనుభవానందపరుల స్తోత్రము.

సీ. బ్రహ్మోహమస్మియ న్బ్రహ్మోత్తములకు
ప్రణతులు పల్మారు పరిగణించి।
యద్వైతభానంబు నాత్మసమాధిలో
నందుచుంచెడివారి నాత్మదలచి।
తత్వార్థములనెల్ల తరచితన్మయులైన
తాపసోత్తముల చిత్తమునసుంచి।
నాచార్యులనుజేరి యభ్యాసయోగంబు
నాచరించెడివారి కందముగను।
జెప్పబూనితి గురుకీలు మెప్పుగాను।
వినయ భయభక్తులింపున విశ్రుతమగు॥ వసుధ॥

కవులస్తోత్రము.

సీ. ఆంధ్రలక్షణగతు లభ్యసింపగ లేదు గణయతిప్రాసాది గతులెఱుంగ।
శబ్దార్థదోషము ల్బదివియుండగ లేదు శాస్త్రార్థనిర్ణయ సరణులెఱుగ।
కవితాప్రసంగంబు కలనైన నెఱుగక కృతిజేయబూనితిహితవుగాను।
తప్పులుప్పనుజూచియొప్పగాదిద్దుట గురుభావమైయున్నగౌరత లేదు।
ప్రజ్ఞనూహింప దగునార్య విజ్ఞకోటి।
లోకహితమాచరించితి శ్రీకరముగ।
వసుధ ముత్యాల వంశ పావనవికాస।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

శివుడు భవానికుపదేసించుట.

సీ. శ్రీకంఠుడీవిద్య జెప్పెభవానికి కృపను రుక్మిణికి శ్రీకృష్ణుడొసగె।
శ్రీరామమూర్తియు సీతకుబోధించె వాయుజునకుసీత వరుసదెల్పె।
శంకరాచార్యులీ శాశ్వతగురుబోధ జిజ్ఞాసులకుదెల్పె జితపడంగ।
సద్గతికోరకేను మద్గురుప్రార్థించి మానసగురునిష్ఠ బూనినిలిచి।
యుత్తమజ్ఞాన నిలయమా యుక్తిదగిలి।
పూర్ణభావంబు ప్రకటింప బూనినాడ॥ వసుధ

సీ. సకల వేదాంతార్థ సారమా జ్ఞానంబు
కాళికాంబకు చంద్రమౌళిదెల్పె।
గురుతుగా పరతత్వ గోప్యంబు గనుమని
కోర్కెలు దొలగించె కుమరుగాను।
యిదియోగరాజంబు నీప్సితార్థమునిచ్చు
తెల్విలో తెల్విని తేటపరచు।
భుక్తిముక్తులకిదే యుక్తియౌనుమ్మని
శ్రీరామతత్వంబు గౌరికొసగె।
పరచిదాకాశ కైవల్య ప్రాప్తిపొందు।
మనుచుబోధించె నిటలాక్షు డద్భుతముగ॥ వసుధ॥

సీ. శ్రీమనోరాముని చిన్మయాకారుని స్థిరమతిగీలింప జేసెశివుఁడు।
దేవుఁడుజగమెల్ల దేదీప్యముగ వెల్గు ధీజితాంతరవిద్య దెల్పెశివుఁడు
ఆదికనాదియా ననుభవభావంబు నందుచుండెడిసాజ్ఞ నాలెశివుఁడు।
యెండమావులతీరు నెటిగెడిలోకంబు నేమిలేదనిజెప్పి యేలెశివుఁడు।
పట్టులోపట్టు నిలకడ ప్రతిభజూపి।
జెప్పి నిర్దోషగమ్యంబు జేర్చెశివుఁడు॥ వసుధ॥

విశ్వరూప సాక్షాత్కారము.

సీ. విశ్వరూపబ్రహ్మ వేదాంతవేద్యుండు
విశ్వమయుండుగా వెలయుచుండు।
విశ్వమయబ్రహ్మ వేద్యమాగురిలోన
విజ్ఞానసమదృష్టి విడుగుచుండు।
వినయవిధేయుడై వివరించి గురుసంజ్ఞ
బ్రహ్మతన్మయమాని ప్రబలుచుండు।
దృక్స్వరూపముమది దృఢముగాచింతించి
జూచెడుదానినే జూచుచుండు।
నచల పరిపూర్ణ బ్రహ్మం బనాతరుండు।
జూడజూడంగ నిర్వాణ సుఖమెయగును॥ వసుధ॥

పరమాత్మ విచారణ.

సీ. సర్వజీవులయందు సాక్షియైపరమాత్మ
యేకరూపంబున నెడపకుండు।
పంచభూతములకు ప్రాపగుదేహంబు
పుట్టుచావులయందు బొదలుచుండు।
పుట్టుచావులులేని పూర్ణసుజ్ఞానియై
దిట్టరియైయుండు ధీజితుండు।
కాలమందునబ్రహ్మ పదవియేచింతించి
పట్టువిడనియోగి పరముగాంచు।

నద్భుతాకారవిశ్వేశు నాత్మనిలిపి।
నిత్యపరిపూర్ణ బ్రహ్మమై నిబ్బరించు।
వసుధ ముత్యాల వంశపావనవికాస।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

## గురువిచారణ.

సీ. గురుడనగాబ్రహ్మ గురుడనగావిష్ణు
గురుడనరుద్రుండు పరమగురుడు।
మాయనగామాయ మాయనగాబ్రహ్మ
గురుసంజ్ఞలోనుండు గోప్యమిదియె।
మాయనగాజీవి మాయనగాబ్రహ్మ
మాయనిర్మైక్యంబు బరగుగురుడు।
అజ్ఞానమెజగత్తు సుజ్ఞానమేబ్రహ్మ
మొదటియెఱిముఁలో మూలమాత్మ।
ఇట్లు గురుగీతలందున యింపుమీఱ।
జెప్పియున్నట్టిభావంబు జెందవలెను॥ వసుధ॥

## ఉపదేశ ప్రభావము.

సీ. ఉపదేశమనుమాట నూహింపదగునిట్టు
లర్థవిశేషంబు నాత్మయందు।
ఉపమనసద్గురు నుపక్రియలందుట
దేశమనగమనో నాశముక్తి।
వెలిప్రపంచక్రియ తెలివిచేగుర్తించు
తెలివియేగురుశక్తి తేరవుపరము।
చిత్కళాపూర్ణమై చిదచిద్విలాసమై
గోచరించెడియుక్తి గోప్యమంది।
పట్టుపుపమను తన్మయ పట్టువిడక।
తత్త్వమస్యాదిలక్ష్యుడై తగుటెముక్తి॥ వసుధ॥

## ఆత్మపూజా విధానము.

సీ. హితమతినై నేను పతితపావనురాము
    నుతులొనర్చెడిభక్తి నుడివినాను।
రామునిమదిలోన రమ్యంబుగానుంచి
    పూజించుక్రమమిందు బూన్చినాను।
విశ్వరూపమునంటు వితరణజ్ఞానంబు
    తెల్వితెల్వికిసాక్షి దెల్పినాను।
విజితమానసభక్తి విశదీకరించితి
    సతిపథగురుమంత్ర మంకురించి।
జన్మమరణాద్యవస్థల జాడమీరి।
బ్రహ్మమందైక్యమగుటయే పరమపదవి॥ వసుధ॥

## సృష్టిప్రభావము - పంచరత్నములు.

సీ. బ్రహ్మంబునెంచగా బహిరంతరాత్మయై
    బయలందుపూర్ణుడై బరగుచుండు।
బ్రహ్మమాకాశ సద్బ్రహ్మ నిరవధిక
    ఖం బ్రహ్మమనిశ్రుతు ల్గణుపుచుండు।
ఆకాశమునవాయు వనుగతమై బుట్టె
    నావాయువందున యగ్నిబుట్టె।
నగ్నియందునజల మనుమేయముగబుట్టె
    జలమునపృథివియు జాతమయ్యె।
పృథివియం దోషదులుబుట్టె నధిగతముగ
నోషధిరసంబుజీవులై యొప్పెజగము॥ వసుధ॥

సీ. సృష్టికాదిని పరమేశునం దొకశక్తి
    త్రిగుణకల్పనవల్ల త్రివిధమయ్యె।
రాజసశక్తిలో రంజిల్లుబ్రహ్మయై
    సృష్టించు భువనముల్ శ్రేష్ఠముగను।

సాత్వికశక్తిలో సంభవమైహరి
పాలించుభువనముల్ ప్రభువునగుచు ।
తామసశక్తిలో తక్క నిరుద్రుండు
లయకర్తగానుండు నియతిగాను ।
సృష్టియును స్థితిలయములు వ్యష్టియందు ।
బుట్టినాశనమగుచుండు పొలుపుమీఱ ।
వసుధ ముత్యాల వంశ పావనవికాస ।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

సీ. విత్తనమొఱుగునే వృక్షంబు బుట్టుట
వృక్షంబుజగమున వృద్ధిజెందె ।
విత్తులోసారమే వివరింపజీవులు
స్త్రీపుంసబీజమై చెలగుచుండు ।
బీజమేజీవాత్మ బిలముశరీరంబు
సంసారమందుండి హింసకోర్చు ।
పలుతెఱంగులకర్మ పాకంబులనుజిక్కి
ప్రారబ్ధములయందు ప్రవణుడయ్యె ।
చావుపుట్టువు నీరమై జగమునిండె ।
జీవిసంకల్పమునజిక్కి దోనగనవు॥ వసుధ॥

సీ. పుట్టినపసిబిడ్డ పుడమిగాంచుటలేదు
అట్టియీజగమున నెట్లుపెరిగె ।
జీవుడు దేహంబు జెలువొంద మనసును
నాడనీమూఱున్న యర్థమయ్యె ।
నివియుండిజగముతా నెఱుగకున్నందుకు
నేమికారణమొ నీవెఱుగుమింక ।
కొన్నిదినములుతా కొనసాగిజగమున
వింతవింతలువిన విశదమగును ।

యిట్టిగోప్యముగురుజేరి ముట్టిగనిన
యతివరేణ్యుడు కైవల్య మందుచుండు॥ వసుధ॥

సీ. మాయయేజగములు మాయయేజీవులు
మాయయే మంత్రముల్ మదినెఱుంగు।
మాయనెల్లగురుండు మాయమాయముగజేయు
మార్గముమదిజూపి మమతెనడచు।
మంత్ర తంత్రములచే మదినడంచినతోడ
మనసుధ్యానమునందు మహితమగును।
మహితమానిజజ్ఞప్తి మతిగినతోడ
మదిలోనివృత్తులు మాటుమణుగు।
వృత్తులుడిగినతిచ్ఛలో మత్తుడగుచు
శుద్ధచిన్మాత్రుడై యుంట సుఖమువడయు॥ వసుధ॥

సంసార సంగ్రహము - నవరత్నములు.

సీ. సతిపతులిలలోన సౌఖ్యంబుగానున్న
కామాదిభోగముల్ గలుగుచుండు।
సతిపతులేకమై మతిగూర్చియుండిన
పుత్రమిత్రాదుల పొందుగల్గు।
సతిపతుల్ గురుభక్తి సాక్షాత్కరించిన
స్వర్గాదిభోగము ల్పంచుగల్గు।
సతిపతుల్ ధర్మంబు సమకూడినంతట
మోక్షసుఖంబులు మొనయగల్గు।
నందె సారాంశపరతత్త్వ మందిజ్ఞాన।
మనుభవించిన పాపంబు లంటబోవు॥ వసుధ॥

సీ. ధరపతివ్రత ప్రభాతమునందు మేల్కాంచి
పతియె దైవంబని భక్తిసేయు।

తనభర్తసుఖముకై తగునుపచారంబు
పతికిహితంబుగా పరిణమించు।
పతివాక్యములనెల్ల సతముగానెంచును
పదపడిమేలుకై పాటువడును।
పతికిష్టమైనట్టి పనులు జేయుచునుండు
పతిపాదములనొత్తి పరిచరించు।
కలిమిలేములు నొకరీతి గడుపుచుండు।
కాంతగలయింటి పురుషుడేక స్త్రీపడడు।
వసుధముత్యాల వంశపావనవికాస।
చిక్కశాభోగి శ్రీనారసింహయోగి॥

సీ. పతికష్టసుఖములు సతియెంచగాబోదు
పతిమాట కెదిరించి బల్కుచుండు।
అర్జనదాపెట్టి యప్పుజూపించెడి
యాలుగల్గినయింట మేలులేదు।
పతికిసౌఖ్యముజేయ మతికింపుగానట్టి
సతితనసౌఖ్యమే చక్కబెట్టు।
తనపతియెదురైన తలత్రిప్పిపలుకక
పతిపైనతప్పులు వెతుకుచుండు।
నట్టిసతులను విడనాడి రట్టుపడక
తెలియు దెల్వినివర్తించు ధీరులెపుడు॥ వసుధ॥

సీ. స్త్రీలకోర్కెలెవడు చెల్లింపగోరునో
వానికి కష్టంబు వచ్చుచుండు।
స్త్రీలచిత్తముశాంతి చేయంగబూనిన
వానికి కష్టంబు వసుధయుండు।
స్త్రీలుకోరినకామ చింతదీర్చనివాడు
ప్రాణసంకటముల పాలుపడును।

స్త్రీలపై భ్రమచేత చిక్కిన పురుషుండు
దుష్టుడై సజ్జన దూరుడగును।
సతుల మోహంబుచల్లార్ప సాధ్యపడదు
సతి మతికినెక్క బ్రతికెడి బ్రతుకెబ్రతుకు॥ వసుధ॥

సీ. సంసారియగువాడు సద్గురుజేరక
సంతతిపై చింత సంతరించు।
సంసారియగువాడు సంకులచిత్తుడై
మనసు నిల్పగలేక మందగించు।
సంసారియగువాడు సద్గోష్ఠిబూనక
స్థిరమని ధనకాంక్ష స్వీకరించు।
సంసారియగువాడు సర్వేశునెంచక
ముక్తిమార్గముబూని ముష్కరించు।
కర్మ సంసారిమోక్షంబు గనడుసుమ్మి।
జన్మమరణాద్యవస్థలే చక్కయగును॥ వసుధ॥

సీ. ధరణిలోబుట్టిన తనువు శాశ్వతమని
గురుభావమెరుగరు క్రూరజనులు।
పారమార్థికబుద్ధి పౌరుషమెడలించి
పాపకార్యముజేయు పట్టువిడరు।
స్త్రీలపొందునుగోరి సిగ్గిడిపలుమారు
మోహసాగరమందు మునుగుచుంద్రు।
సద్గురువులగోష్ఠి సమ్మతించనివారు
గురువుల నిందించి మొరుగుచుంద్రు।
జన్మదుఃఖంబులోబడి జచ్చిపుట్టి।
నరకకూపంబులోబడి నలగుచుంద్రు॥ వసుధ॥

సీ. చిత్తసాధనలేని రిత్తగురులచెంత
జేరినవారికి చెడునుమనసు।

దొంగత్రోవలుజూపి భంగపెట్టుటెగాని
దొరకదుమోక్షంబు దొరలకైన।
మాటలమంత్రాల మరిపింతురన్యులు
నీతనేరకవది యీాదనగునె।
మనసులో గురుసంజ్ఞ మాయలడంచును
మాయలుడిగినంత మహిమయగును।
మహిమ జూపును గురుసేవ మననమందు।
మననమందిన భక్తుడే మాన్యుడగును।
వసుధ ముత్యాల వంశ పావనవికాస।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

సీ. నియమించి శిలలను నెక్కొనిజనులెల్ల
నేర్పుతోపూజించి నీతిగనరు।
చపలత్వమునబుట్టి జచ్చెడుజీవులు
వేడితంత్రముమాయ జాడగనరు।
నిర్మలహృద్వీధి నిలకడమననంబు
నిగదమహాగురుజ్ఞప్తి నెమ్మిగనరు।
తత్పదగురునాజ్ఞ తలపుననుంచరు
తథ్యమహాగురుపూజ తావుగనరు।
గురుముఖంబునసాధింప గోప్యమమరు
గానబ్రహ్మైక్యసంధాన కాంక్షగోరు॥ వసుధ॥

సీ. సకలవిద్యలుభక్తి చదివిననేర్పున
తత్త్వంబుగనరాదు తలపునందు।
గురుకీలుదెలియక గుర్తించిగనరాదు
తనుదెల్పగురువుచే తలపునందు।
మేలుగాత్రిపుటిలో మెలగెడుసూత్రంబు
తక్కొనిగనరాదు తలపునందు।

వాదభేదములకు వశపడికనరాదు
తన్మయగురుజ్ఞప్తి తలపునందు ।
కోటివిద్యలుకూటికే కోరగించు
నేర్పుగురుసంజ్ఞ దాటుట నిత్యముక్తి॥ వసుధ॥

సీ. మనసుకీదేహంబు మనికిగానున్నది
గురుశిక్షపొందగ కుదురుపడదు ।
సతతమీామనసుచే సద్భక్తిగావింప
సాధనలోగాని సఖ్యపడదు ।
సఖ్యమేపురికొల్పి సంయోగమొనరించి
నిత్యసమాధిలో నిలుపవలెను ।
నిలిపినతోడ్తోడ నిర్మలతేజంబు
శుద్ధమై వెల్గెను సూత్రమెఱుగు ।
సూత్రమెఱిగినహృద్వీధి గాత్రమందు
నాతడాత్మస్థితప్రజ్ఞు డనగనొప్పు॥ వసుధ॥

## ప్రత్యగాత్మ విచారణ.

సీ. పలుమారుమదిలోన పట్టుపీడనిజ్ఞప్తి
దలచుటగురుసూత్ర ధారణంబు ।
తెలివిగురూక్తిచే దెలసినమర్మంబు
ధీజితంబునగాని తేటపడదు ।
కనుమూసిగమనించి కనుపాపలోనున్న
కళచిదాకాశంబు గలియనొక్కి ।
ఫాలభాగమునందు ప్రజ్వరిల్లెడియాత్మ
పరిపూర్ణమందున ప్రతిభగాంచి ।
కేవలాకార పరమాత్మ కీలుదెలసి ।
ప్రత్యగాత్మను ధ్యానించి ప్రాజ్ఞుడగుము॥ వసుధ॥

## సంకర చిత్తులు.

సీ. సంకరచిత్తులు సహజదుర్వృత్తులు
సాధునిందకులు దుస్సంగపరులు ।
పరహింసకులు మధుపానమత్తులుశిష్టు
బుద్ధిహీనులును విరుద్ధమతులు ।
సద్గురుద్రోహులు సంకులచిత్తులు
గురునాస్తికులు సదా గోప్యహారులు ।
జాగరోరాసక్త క్రూరమనీషులు
పాతకంబులుజేసి ప్రబలువారు ।
భక్తి వైరాగ్యయోగము ల్పాటువడక ।
జన్మమరణాద్యవస్థల చక్కి విడరు।
వసుధ ముత్యాల వంశ పావనవికాస ।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

## భక్తిత్రయములు.

సీ. భక్తిత్రయంబుల యుక్తిగామదినెంచి
రక్తిమించెడువాడు రాజయోగి ।
పాషాణమృణ్మయ ప్రతిమలర్చించుట
ప్రథమమైయుండెడు బాహ్యభక్తి ।
తనువనిత్యంబని తలచియన్నింట
తితీక్షుడైయుంట ద్వితీయభక్తి ।
ధీవృత్తిసాక్షిగా దివ్యచిన్మాత్రుడై
దీపింపనొంటి తృతీయభక్తి ।
మర్మములనెల్లశోధించు మండితుండు
బహ్మమైపోవు పొడగాన బడకుమటుల॥ వసుధ॥

## గురూపదేశప్రభావము.

సీ. గురుసేవజేయక కుదురవుగుణములు
మాయలుపదివేలు మక్కళించు ।
కనుదానిగనలేక కావిచీరలుగట్టి
బూదిబూసిననేమి బొందవచ్చు ।
తన్నుదాగనలేక తొక్కొనిగాలిని
గనుసరై బిగబట్టి గాంచు టేప ।
అతిపథమెంచక నాలుబిడ్డలుబాసి
చిక్కులుపడనేమి దక్కవచ్చు ।
గాన దుర్వేషభాషల గాసిపడక ।
గురుకటాక్షంబు గనువాడె గొప్పజనుడు॥ వసుధ॥

## నిజభక్తులు.

సీ. చిత్తవృత్తినిజిక్కి తత్తరపడనేల
వృత్తది భ్రమలన్ని మిత్తియగును ।
గాఢతామసమందు గలిగెనీజగమని
తపనుడౌగురుజేర దగ్ధమగును ।
అజ్ఞానతమమూడ్చి సుజ్ఞానమందిన
ప్రజ్ఞానబ్రహ్మంబు ప్రత్యగాత్మ ।
ఆత్మదర్పనమందు నపరోక్షమందిన
చిత్తమేనిర్మల చిత్తమగును
నిర్మలంబైన చిత్తమే నిరుపమంబు
నిరుపమానంద మననమే నిత్యపదవి॥ వసుధ॥

## గురూపదేశము.

సీ. చిత్తమందున మోహ చింతచేభక్తులు
యంతరాళమునందు స్వాంతముంచి ।

యభ్యాస్మ యోగంబు ననువొందగాపూని
భక్తిచేగుణములు బొరదోలి।
హృదయమధ్యంబున శ్రీగురుబూజించి
రక్తియుంచె మజ్ఞప్తి యుక్తిఁ జెంది।
సంతతాభ్యాసిమై సాధించిహంసను
విమలమాకళలంటి విజ్ఞుఁడగుచు।
నీల జలదపటిల్లతా నియుతమంది
వాట్మైయు బ్రహ్మంబు బొలపిడరు।
వసుధ ముత్యాల వంశపావనవికాస।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

భక్తిలేనివారు.

సీ. వేదాంతి మెఱుగక విపరీతములుబల్క
బుధుడౌనె సద్గురు బోధలేక।
యుక్తిచేత్యాంగి యోగసదానంద
మంద నేసద్గురు నండలేక।
ధనమదగర్వ సంతతిబాసి మోక్షంబు
బొందునే సద్గురు పూజలేక।
నేర్పుచేతనవిద్య నిరసించివిజ్ఞాన
ఘనుడౌనె సద్గురు కరుణలేక।
దేశికోత్తముడాత్మలో దెలుపకున్న
నిరతిశయసౌఖ్యరూపమా పరముగనదు॥ వసుధ॥

సన్యాసులు.

సీ. సంధ్యాద్యనుష్ఠాన సహితసద్విజులైన
సకలయాత్రలుజేయు స్వాములైన।
బ్రహ్మరుద్రేంద్రాది ప్రముఖదేవతలైన
తపమాచరించెడు ధన్యులైన।

సన్న్యాసులై పరి సంవిత్తులైనను
శాస్త్రపురాణ ప్రవేశులైన ।
అన్నదానఫలంబు లెన్ని పొందిననైన
నిజమార్గగురుజ్ఞప్తి నెఱుగకున్న ।
ముక్తిగనబోరు మదిలోన రక్తిబూని
దేశికస్వామికృపలేక తెలియబోరు॥ వసుధ॥

తర్కవాదముల నిష్ప్రయోజనము.

సీ. వేదశాస్త్రములెల్ల వెదకిచూచినగాదు
విజ్ఞానగురుసంజ్ఞ వేద్యమగును ।
వేషభాషలనేర్పు విద్యలంబునగాదు
విమలవిప్రజ్ఞలో విదితమగును ।
మంత్రతంత్రములైన మాయలునగాదు
మైమఱపుసజ్ఞప్తి మఱుగనగును ।
జపమాలద్రిప్పెడి యుపముచేగనరాదు
గురుభక్తియాత్మలో కుదురినలెను ।
తర్కవాదంబులనుగాదు తలపరాదు ।
భావనాతీతబ్రహ్మంబు భాటయగును॥ వసుధ॥

మోక్షసిద్ధి.

సీ. సతతంబు శ్రీగురుస్వామిని మదినెంచ
కరతలామలకంబు గాదెముక్తి ।
నియమవిఘ్నలుచూని నిజగురుసేవింప
కరతలామలకంబు గాదెముక్తి ।
పలుమారుసంయోగ పరిపూర్ణమందిన
కరతలామలకంబు గాదెముక్తి ।
కమ్రప్రియమాత్మలో గదసినిర్భయలంద
కరతలామలకంబు గాదెముక్తి ।

అట్టిగురుసిద్ధసంయోగ మందిపట్టి
నిట్టనిలువగుమోక్షంబు బట్టుమెపుడు।
వసుధ ముత్యాల వంశ పావనవికాస।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

జన్మదుఃఖనివారణ.

సీ. దూషణభూషణ తోట్టుదేహమందాక
నాత్మకెన్నటికైన నంటబోదు।
ఆత్మకేయనియమ యమగమైనన పో
నాత్మకుహానంబు నాదిలేదు।
సర్వదూషణములు సర్వదుఃఖంబులు
దేహంబుకొందురు దృఢముగాను।
గాన దేహముకోసి బూనుముగురుసంజ్ఞ
ధ్యానముము క్తికై దగులునాత్మ।
యమృత మయమైన ధ్యానాత్మ ననుసరించి।
జన్మ దుఃఖనివారణ జూడగనుము॥ వసుధ॥

సద్భక్తి.

సీ. మనసునివాసంబు మర్మమెంచెదుయోగ
గురుముఖంబునజూడ గుర్తుగాంచు।
సతతమచ్చటనిల్వ సద్భక్తియనదగు
సద్భక్తిగలిగిన సత్యమమరు।
సత్యసామ్రాజ్యంబు స్వాధీనమైనచో
నిత్యమానందంబు నిలచియుండు।
ఆనందమేతన కనుభవమందిన
యదియిదియనిజెప్ప నలవిగాదు।
చూచిచెప్పగరానిది శుద్ధతత్వ।
మంతటను నొక్కరూపుగా నమరియుండు॥ వసుధ॥

### భవభయహరం.

సీ. కోటిసూర్యులకాంతి కూడిన హృద్వీధి
సూటిపొందించును మేటిగురుడు ।
విద్యుల్లతా పరివేష్టితంబగు బయ
ల్ఘునచిత్ప్రకాశంబు డనుపుగురుడు ।
ప్రణవాంతమైనట్టి ప్రజ్ఞలో వెలిజూపి
బ్రహ్మతస్మయమని బలుకుగురుడు ।
గురుకృపచేగన్న గోప్యమే పరబయ
ల్గుణశూన్యనిష్ఠ గూర్చుగురుడు ।
ఆదిమధ్యాంతశూన్యంబు సందజూపి ।
భవభయంబులనెల్లను బాపుగురుడు॥ వసుధ॥

### ఈషణత్రయములు.

సీ. ధనధాన్యములమీద దగులుచిత్తమ్ము ధ
నేషణమ్మంద్రు మనీషిజనులు ।
పుత్రులపై యాశ పూనియుండుటజూడ
పుత్రేషణంబని బుధులెంతురరసి ।
భార్యపై భ్రమచేత పరితపించుటజూడ
దారేషణంబని దలతురార్య ।
లిట్టిదుఃఖదములు నీప్రాకృతంబులౌ
నీషణత్రయముల నీడ్చిపట్టి ।
పట్టపసలేని పెనుబయ ల్బాకనేర్చి
అచల సంపూర్ణతత్త్వంబు నందవలెను॥ వసుధ॥

### రాజయోగము.

సీ. తీర్థావగాహము సార్థకమన్నచో
జలచరంబులుబుట్టి చచ్చునందె ।

వేషభాషలుదండ కాషాయములుగట్టి
రోషభీషణముల రోతపడరె।
అన్నముదినక పర్ణాశనులగుచేల
మేకలాకులుమేసి మేలుగినెనె।
ఫలములుదినుచేల ప్రబలునామోక్షంబు
పక్షులుదినుచుండు ఫలముగనెనె।
ముక్తిగల్పించు గురుభక్తి యుక్తిబూని।
రక్తిమించిన నాశెపో రాజయోగి।
వసుధ ముత్యాల వంశ పావనవికాస।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

మాయావిచారణ.

సీ. ఎంచరానివ్రతంబు లెన్ని జేసినగాని
మనసులోనున్నట్టి మాయవిడదు।
అన్నాదిదానంబు లెన్ని జేసినతన
మనసులోనున్నట్టి మరులువిడదు।
యజ్ఞయాగక్రియల్ యజ్వయైమెలసిన
మనసులోనున్నట్టి మంకువిడదు।
తీర్థయాత్రలుచేసి దేశముల్తిరిగిన
మనసులోనున్నట్టి మయిలవిడదు।
మనసుమనసున గురినిల్పి మట్టుబెట్టి।
మానితంబైన మనసంబు బూననగును॥ వసుధ॥

జీవన్ముక్తుడు.

సీ. బుద్ధినూహించెడి పూర్ణసమాధిలో
ప్రణవంబువినిదాని ప్రతిభగాంచి।
సచ్చిదానందాత్మ సన్నుతోర్ధ్వద్వార
సౌధమధ్యస్థిత చంద్రకాంత

బ్రహ్మపీఠంబుపై బదిలంబుగా నెక్కి
తన్మయసంయోగ తలపుసంధి
పట్టుగాలక్ష్యంబు బరికించిమించిన
పరిపూర్ణమచలంబు ప్రాప్యమగును ।
అంతటనుయొక్కరూపుగా నలరుచాను ।
నట్టివాడె జీవన్ముక్తుడనగజెల్లు॥   వసుధ॥

మోహపాశము.

సీ. మూలమేమియులేని మూలప్రకృతియందు
ప్రణవనాదముబుట్టి ప్రజ్వరిల్లె ।
దానియందొకశక్తి దాక్కొనిమాయగా
బుట్టెనులోకము లుప్పతిగాను ।
లోకమహంకృతి పాకమైయభిమాన
రాగాదిగుణములు రహిజనించె ।
కోర్కెలుకర్మము లొక్కనసాగిజీవులై
జీవులేజగమందు దోవగనరు ।
తనువు మొదలగునవి నిజమనుచునమ్మి
మోహమునజిక్కి మృత్యువుమొనయుచుంద్రు॥   వసుధ॥

ఎఱుకనుమరచుట.

సీ. వేదాంతమననంబు విజ్ఞానయోగంబు
నాదాంతగురుమర్మనావయెఱుక ।
సాధులహృదయంబు సంపూర్ణతేజంబు
బోధలోగురిమించ బొలియునెఱుక ।
ద్విదళాబ్జమధ్యమం దుదయమైబ్రహ్మంబు
తెలియుతెల్వికిసాక్షి దెల్పునెఱుక ।
అఖిలప్రపంచంబు నద్వయబ్రహ్మని
నిష్కళపరిపూర్ణ నిగదమెఱుక ।

మేరుశిఖరంబుపై జేర్చి మెచ్చునెఱుక ।
ధీయుతంబగు జిచ్చులో తేలునెఱుక ।
వసుధ ముత్యాల వంశ పావనవికాస ।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

అజ్ఞాన క్రతువులు.

సీ. తనలోని దేవుని తరచిచూడగలేక
దేశయాత్రలు జేసి గాసివడుట ।
తనలోని ప్రణవంబు తావినసేరక
క్షుద్రతుష్టలనుబడి పొక్కినడుట
మదిలోనగురుసంజ్ఞ మర్మంబుగానక
మనసుప్రవృత్తుల మాసకుంట ।
విమలమనస్కుడై విమమషించగలేక
వేషభాషలుదాల్చి వెతలునడుట ।
ఇట్టియజ్ఞానక్రతువులు నట్టిభ్రమలు ।
మోక్షసాధనగురుజేర ముక్తుడగును॥ వసుధ॥

బ్రహ్మవిద్వరునిక్రమము.

సీ. కర్ణములుమూసియు క్రమముగ వినుచున్న
ప్రణవనాదముబుట్టి ప్రజ్వరిల్లు ।
ఘోషంబులోదశ ఘోషంబులై దోచు
నాదమేబ్రహ్మం బనాదియగును ।
నాదమందునబిందు నాటించిలయమైన
నదికళారూపమై యమలమగును ।
నాదబిందుకళలు నయమారజూచితే
యింద్రియంబులుతన కెఱుకబడవు ।
యెఱుగరానిదాని నెఱుగుటే బ్రహ్మంబు ।
బ్రహ్మవిద్వరుండు బడయుచుండు॥ వసుధ॥

## ఐక్యభావము.

సీ. విన్నుపై విను కెంపు వేంచేయుటకునై
 నీరుహాంబులు నిరీక్షించునట్లు।
చెరుకువిల్తునిమామ కొరకుచకోరముల్
 కువలయనివహము ల్గోరునట్లు।
ముక్తాగ్రహమ్ములు మోదంబుతో మరు
 ద్వృష్టిరాకలకును వేచునట్లు।
అహమస్మి గురిబూని యంతర్ముఖంబున
 జీవబ్రహ్మలకైక్య భావమునకు।
గురుకృపాదృష్టి తన్మధ్య గొనకొనంగ।
మోక్షమనుచేతి దైయుండు ముఖ్యముగను। వసుధ
బ్రహ్మవిదుండు.

సీ. అద్వైతవాక్యము కర్థంబు దెలియక
 యపరోక్షభావంబు నందరాదు।
ముందునకారంబు పొందుగానున్నది
 దానినిర్ణయమెంచ తరముగాదు
ద్వయమన రెండని తలపోసినంగట
 నా రెండుయేవో యరయరాదు।
దేహిదేహముమధ్య తెరబయలుగానుండి
 స్థిరరూపశివుడని జెప్పరాదు।
శివుని జేరిన జీవుడే శ్రేష్ఠుడైన।
బ్రహ్మవిద్వరుడద్వైత బ్రహ్మవిదుడు॥ వసుధ॥

## మనోభ్రమ.

సీ. పలురోగములచేత బాధింపబడుచున్న
 పాపిష్టిఘుటము న పాడుమనసు।

కలిమిలేములకోర్చి కష్టములనుచున్న
పాపిష్టి ఘటమున పాడుమనసు ।
దారాసుతులనమ్మి దలగనిదుఃఖాబ్ధి
పడిమున్గుచున్నది పాడుమనసు ।
యెపుడుజూచినగాని ఇహచింతలోబడి
పరచింతబూనదు పాడుమనసు ।
నమ్మరానట్టిఘటమును నమ్మినమ్మి ।
దృఢతరాద్వైత జ్ఞానంబు దెలియనివదు ।
వసుధ ముత్యాల వంశ పావనవికాస ।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

ముక్తిభావము.

సీ. తారకగురుసూత్ర తపమాచరించిన
తత్పదంబునయుక్తి దనరముక్తి ।
ఆసనంబులువేసి ఆయాసపడరోత
అంత రాత్మజ్ఞాన మందముక్తి ।
కనురెప్పలాయక కానవిబయలంది
కంటిమింటికిమధ్య గనుటముక్తి ।
ఆకాశమార్గ్వీధి నాత్మలోకైవల్య
మంద గాంచెడిదృష్టి యందెముక్తి ।
పవనయోగంబుముక్తికి ప్రాభవంబు ।
ధ్యానముశుద్ధ బ్రహ్మమై దనరుముక్తి॥ వసుధ॥

ముక్తసంగుడు.

సీ. అణువుకణువుగాన నాధారకమలంబు
నందిపట్టినయోగి యమలుడగును ।
కంటిమింటికిమధ్య కన్పాపలోజ్యోతి
ఖం బ్రహ్మమయముగా గనునుయోగి ।

గురుపాదసేవచే గుణశూన్యమగుభ క్తి
పట్టుబట్టినవాడు పరమయోగి ।
ము క్తిభావమునంటి మురియుచుండెడిజ్ఞాని
ము క్తసంగుడుయోగ మూ ర్తినుడు ।
మొదలుతుదిలేక వెలెగెడు మోక్షమందు
నిట్టనిలువగు పరమంద నేర్చుయోగి॥ వసుధ॥

అచలవృ త్తి.

సీ. సూనృతబ్రహ్మంబు సూక్ష్మమైయుండెడి
జాడసద్గురుసంజ్ఞ జూడవచ్చు ।
కనువిచ్చిచూచిన కనుమూచిచూచిన
తత్పదగురునిష్ఠ దరరవచ్చు ।
వెలిలోనపూర్ణమై వెల్గుచున్నదియాత్మ
బ్రహ్మాస్మిచిచ్ఛ క్తి బడయవచ్చు ।
చి త్తవిశ్రాంతిని స్థితమగుప్రజ్ఞచే
అహమస్మిభావంబు నందవచ్చు
నచలుడై కొండవలెనిండి యమరవచ్చు
గలసిమదిలోనహంసను గదియవచ్చు॥ వసుధ॥

దేహత్రయ విచారణ.

సీ. స్థూలదేహమనంగ సూక్ష్మదేహమునాగ
కారణతనువునా గలవుమూడు ।
యీమూడుదేహము లెంచిచూచినతోడ
మూటికవస్థలు మొనసియుండు ।
స్థూలముజాగ్రత సూక్ష్మముస్వప్నంబు
కారణంబుసుషు ప్తి గలిగియుండు ।
స్థూలదేహమునందు సూక్ష్మంబుగనరాదు
సూక్ష్మంబునందు సుషు ప్తిగనదు ।

కారణంబునరెంటిని గనుట లేదు ।
గాన గురుబోధ నెఱిగిన ఘనతజెందు ।
వసుధ ముత్యాల వంశ పావనవికాస ।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

జాగ్రస్స్వప్న సుషుప్తుల క్రమము.

సీ. ధీసహాయముచేత దినచర్యలెల్లను
　　జర్పుచుండుటగాదె జాగరంబు ।
నిద్రలోగనుచున్న నిజబుద్ధిచర్యలు
　　కల్పనలవిచూడ కలయనంగ ।
నిద్రజాగ్రతలందు నెఱుగకజ్ఞప్తి సు
　　షుప్తిగా నెఱుగుట సూక్ష్మబుద్ధి ।
నరవితోనీమూడు సంజ్ఞలుమదిలోన
　　నెఱిగెడియెఱుకయే యిరవుగాను ।
యెఱిగి మఱిగెడి ఱిచ్చయే యేకతంబు
ననుభవజ్ఞానదృష్టిచే నందవలెను॥　　　　వసుధ॥

నిశ్చలసమాధి.

సీ॥ తపముజేయుచువన ముపగమించినగాదు
　　పనుపడగురుకీలు బట్టవలెను ।
యోగమార్గముబూని రాగమందుటగాదు
　　మదిసంశయంబులు మాన్పవలెను ।
గుడిగుహామఠముల కూరుచుండినగాదు
　　మననశుద్ధోహంబు మహతియగును ।
సకలశాస్త్రములెల్ల చదివివినగనరాదు
　　నికరమహాగురుశిక్ష నిగదమగును ।
గాన గురుమర్మ ధర్మంబు బూనివిడక
నిశ్చల సమాధినిష్టలో నెఱుకగనుము॥　　　　వసుధ॥

### ఆత్మసమాధి.

సీ. ఈలోకసుఖమును నీసొంపు పెంపును
లోలోన నెగనిదాని లోతెఱింగి।
నానాగుణన్యాయ నటనలుతలపోసి
చేటొనర్చెడుదాని చేరననుచు।
ఉదరపోషణకొర కుద్యోగములుజేసి
భయదమౌ క్రియలలో పట్టుబడక।
వాద భేదంబులు వాంఛచేబూనక
బూటక ప్రజ్ఞలు కూటికనుచు।
సతతమాత్మసమాధిలో సంచెఱింగి।
వాటమైయున్న బ్రహ్మంబు భాటగనును॥ వసుధ॥

### గురుశిక్ష.

సీ. భక్తులరక్షించు పరమాత్మగనలేక
భ్రష్టులై తిరిగిన ఫలములేదు।
దుర్బుద్ధులడచెడు దొరగురుగానక
జపమాలత్రిప్పిన జాడగనరు।
సర్వజీవులయందు సాక్షినిగనలేక
యుపవాసముండుట తపముగాదు।
యెందుజూచినగాని పొందియుండెడియాత్మ
గురుశిక్షనందక కుదురబోదు।
భ్రాంతిజశరీర బంధంబు బాపిగురుడు।
నిరతిశయ బ్రహ్మ సూత్రమౌ పరముజూపు॥ వసుధ॥

### మాయగురు లక్షణము.

సీ. బూరుగ మ్రానిపై జేరి యాసక్తిచే
ఫలముగానని యట్టి చిలుకరీతి।

తనయిల్లుసతమని ద్వారముల్బంధించి
పొర్లుచుమృతిబొందు పురుషురీతి ।
యెండమావులుమంచి నీరనిభ్రాంతిచే
నమ్మిపరువులుబారు నరునిరీతి ।
విషయాదిలోలుడై విరివిగావర్తించి
కడగానరానట్టి కలుషురీతి ।
మాయ గురుజేరినంతట మదిగలంగు ।
మోస పోవుట గురుభక్తి మొక్కచెడుట ।
వసుధ ముత్యాల వంశ పావనవికాస ।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

ముక్తిలక్షణము.

సీ. చీకటితనువులో జీవాత్మమున్నాడు
వెదకిజూచినగాని వేద్యపడడు ।
అంధకారముజేరి యగచాట్లుపడరాదు
మెఱుకగుదీపంబు గురుతుబెట్టి ।
భ్రమలన్నితరిగియు భాటచక్కగజేసి
గురుకీలుమదినిల్పి కుదియబట్టి ।
యచటపరంజ్యోతి యానందభావంబు
పట్టపగటనుండు పట్టువిడక ।
నిశ్చలాత్మానురాగుడై నిలచిజూడ
ముక్తిసంయోగ పరతత్త్వ మూలమగును॥ వసుధ॥

తన్మయతత్త్వము.

సీ. జగమువిచిత్రమా సరణివర్ణింపంగ
హరిహరబ్రహ్మల కలవిగాదు ।
పలువిధ జన్మము ల్పలువిధరూపము
ల్పలువిధ నామము ల్పలుకరాదు ।

పలువిధవర్ణము ల్పలువిధశబ్దము
ల్పలువిధవృక్షము ల్గలయరాదు।
పలువిధపక్షులు పలువిధమృగములు
బరికింపవేశ్వర దెలియరాదు।
అలవిగానట్టి చిత్రము లాత్మయందె।
గలసి తన్మయ తత్త్వమై యలరుచుండు॥ వసుధ॥

జీవవిచారణ.

సీ. తనువనుగుహాయందు తగిజీవుడున్నాడు
మనసురాజై యుండు మహిమగనుము।
నదులకడ్డముగట్టి నడిపించుచున్నాము
మనసును బంధించి మరలుపలేము।
పర్వతంబులనెల్ల పడగూల్చుచున్నాము
మనసు పొమ్మ్యోడిపోక మార్చలేము।
వనమృగావళులను వధియించుచున్నాము
మనసులోవృత్తులు మాన్పలేము।
మనసు గురుకీలు మరపిన మాయయడగు।
మాయ యడగిన తోడ్తోడ మహతియగును॥ వసుధ॥

జీవసంయోగము.

సీ. దేహరాజ్యముజేరి సోహం స్వరూపమై
పరిపాలనముజేయు ప్రభువుజీవి।
తనువునగురుకీలు దలచినెమ్మదిసాక్షి
సాధనాతీతమగు సాక్షిజీవి।
కాలత్రయములందు గలసియన్నిటనిండి
విజయుడై మెలగెడు విభుడుజీవి।
స్వాత్మానుసంధాన సారాంశమెఱుకచే
శేషించకనువెల్గు శివుడెజీవి।

యంతరాత్మను గతమఖిలాత్మజీవి ।
బ్రహ్మమందున సంయోగ పరుఁజీవి ।
వసుధ ముత్యాల వంశ పావనవికాస ।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

తత్త్వవేత్త.

సీ. సకలశాస్త్రంబులు చదివిచెప్పగవచ్చు
గురుకీలుమదిలోన గూర్చరాదు ।
దివ్యస్థలములెల్ల దిరుగాడగావచ్చు
పరిపూర్ణభావంబు బట్టరాదు ।
తీర్థయాత్రలుజేసి తిరిగి ద్రిమ్మరవచ్చు
దేహాత్మవిభజన దెలియరాదు ।
అకలంకమూర్తిని బ్రకటింపగావచ్చు
అనుపమ్యభావంబు నందరాదు ।
గురుని దివ్యానుసూత్రైక్య గోప్యమంది ।
తన్నుదా దెలియుచునుండు తత్త్వవేత్త॥ వసుధ॥

అచలగురుడు.

సీ. ఆత్మలోగురిజూపి యానందమొదరించు
సచలప్రపూర్ణుడౌ నాత్మగురుడు ।
భద్రంబుగానిద్ర భరిమలచిన్ముద్రచే
బ్రహ్మముస్మనిజూపు భవ్యగురుడు ।
వాయురేచకమూని వరుసను పూరించి
కుంభకాత్మైక్యంబు గూర్చుగురుడు ।
మేరుశిఖరిపైని మెలగెడుజ్యోతిని
మిన్నకమదిజూపి మెచ్చుగురుడు ।
ఆత్మసేవింప జూపు ను యచలగురుడు ।
అనుభవాగమ్యుడై యుండు నమలగురుడు॥ వసుధ॥

## నిరతిశయము.

సీ. తపముకై కొందరు తలక్రిందులై పోరి
ముక్కులుబిగబట్టి మూర్తిగనరు।
దొంగలై గురులని బంగిదాగెడువారు
వాయుకుంభకమూని వార్తగనరు।
మౌనముద్రలుబూని మాటలాడనివారు
మదిలోని నిజరూపు మంతుగనరు।
పూరించి రేచించి పూర్తిగాబిగబట్టి
కుంభించిగాలితో గుణముగనరు।
జననమరణంబు లొందని జాడగనరు।
నిరతిశయ బ్రహ్మభావంబు నెఱుగగనరు॥ వసుధ॥

## రేచకపూరక కుంభకములు.

సీ. పద్మాసనస్థుడై పట్టిరేచకమూని
పూరకంబున వాయు పొందుపఱచి।
కుంభకజ్ఞప్తిలో కుదురుగానెలుకొను
గుర్తించిహంసను కుదురుపఱచి।
నిర్వికల్పసమాధి నేర్పునగురిచుంటి
తన్మయబ్రహ్మంబు తలపునుంచి।
గగనాదిభూత సంఘాత సమోహపహ
వహ్నియై బ్రహ్మ భావంబునొంది।
యున్నయోగి తన్మయుడై యొప్పుచుండు।
చిత్స్వరూపమునంటిన చిన్మయుండు॥ వసుధ॥

## బ్రహ్మైక్యము.

సీ. ఎఱుకయుక్తదీపంబు నెదలోన వెల్గింప
నేదేదో గురుకీలు యెంచనగును।

సుషిరమధ్యమునందు సూక్ష్మంబుపొడగాంచి
సారగితన్మయమంది సాక్ష్యనగును ।
చంద్రకాంతినిజూచి చలపట్టిరేచించి
పూరించికుంభించి పొందనగును ।
ఆత్మానురాగుడై హంసయోగముపూని
అసిపదసంయోగ మందనగును ।
ముక్తిజీవికి బ్రహ్మైక్య మూలమగును
భక్తి బ్రహ్మైక్య సంధాన భావనగము ।
వసుధ ముత్యాల వంశ పావనవికాస ।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

సర్వము బ్రహ్మమయము.

సీ. కామాదిరాగ సంకల్పవర్జనముగ
స్వాంతంబు నెఱిగియు స్వస్థపఱిచి ।
యనిలమానసముల హంసనిర్ణయమూని
హృదయనభంబున హృద్యపఱిచి ।
సర్వదృశ్యములకు సాక్షియై నెఱుకను
నేకాగ్రచిన్మంట పాకపఱిచి ।
రూపురేఖలులేని రూఢితత్త్వముజూచి
తానుదానై యుంట తలపుమఱిచి ।
భ్రాంతి దొలగించి సర్వంబు బ్రహ్మమనుచు ।
శ్రుతులుజెప్పెడి వృత్తిలో సాక్షియుండు॥ వసుధ॥

నిత్య సన్యాసము.

సీ. ద్వేషంబుమదిలోన తెగటార్చియోగులు
నిత్యసన్యాసులై నెగడువారు ।
సంసృతిబంధము ల్నమయించుయోగులు
నిత్యసన్యాసులై నెగడువారు ।

కాంక్షయించుకర్తైన గలుగనియోగులు
నిరుపమానందులై నెగడువారు।
బ్రహ్మచిత్తమునందు బరికించుయోగులు
నిజమన్మయంబంది నెగడువారు।
తనువు నింద్రియ మానసాద్యములుజ్ఞాన।
వహ్నితోగాల్చి బ్రహ్మ భావమునమంద్రు॥ వసుధ॥

జీవేశులకైక్యము.

సీ. జీవేశ్వరైక్యంబు భావించుయోగులు
సర్వేశుమననంబు సంజ్ఞవిడరు।
అట్టిసుజ్ఞానులు యనుభవాగమ్యులై
బాలురపోలిక బఱగుచుందు।
రొకచోటనాడుచు నొకచోటపాడుచు
నొకటమైమఱచితా మొదగియుందు।
రాత్మపరాత్మల నైక్యంబుగానెంచి
పరిపూర్ణభావంబు పట్టువిడరు।
హరిహరాదులకైనను నలవిగాని
బ్రహ్మతన్మయపరులగు బ్రహ్మవిదులు॥ వసుధ॥

తన్మయము.

సీ. అన్నియోగములకు నాధారమననంబు
దెలిసెడిదృక్కులో తెలివినీవు।
సర్వేంద్రియములకు సాక్షియైసుజ్ఞాన
మెఱుగుచున్నట్టియా యెఱుకనీవు।
పంచకోశములను పలుమారుచింతించి
గోచరించెడిదాని గూడుమీవు
వమ్ముదలుమది బరికించినిజజ్ఞప్తి
సాక్షియాతన్మయ సాక్షివీవు।

గుర్తులన్ని యునెఱిగెడి గుర్తునీవు ।
సర్వమందు నీవగు సత్యమీవు ।
వసుధ ముత్యాల వంశ పావనవికాస ।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

చిత్సుకము.

సీ. సంయోగమందెను సదసద్వివేకంబు
సంపూర్ణచిత్సుఖ సాధనంబు ।
శివజీవులేకమౌ చిహ్న సూత్రంబు
భవహరంబగునట్టి బ్రహ్మబోధ ।
బ్రహ్మభావమునను ప్రబలగాంచెను జ్ఞప్తి
నికరమై వెల్గును నిరుపమంబు ।
నికరమౌ జ్ఞప్తిలో నిండియుండెడిజ్యోతి
సత్యస్వరూపమై నిత్యమగును ।
నిత్యమారీతిరభ్యాస నియతినిడక
పక్వమై మనంబడగును బ్రహ్మమందు॥ వసుధ॥

నాల్గు మహావాక్యములు. పంచరత్నములు.

సీ. మూడారుత్రోవలు మునుకొని మెచ్చి మహా
వాక్యములునాల్గు సర్ధమెఱిగి ।
కుండలిఛేదించి గురుసంజ్ఞలోనెంచి
బ్రహ్మోహమస్మియ న్భావమంది ।
ఆరుచక్రములకు నందనిపరమాత్మ
గోప్యమువంటెను కుహరమంది ।
ప్రజ్ఞానకళలందు భావించిచిన్మయ
మండితాకాశంబు మఱుగు జేరి ।
హరిహరహిరణ్యగర్భుల కందరాని
సమరసజ్ఞాన సంయోగ సహితుడగుము॥ వసుధ॥

సీ. యోగసాధనజేసి బాగైనచిత్తంబు
చపలత్వముడిగిన చక్కబడును ।
చపలత్వముడిగి పిదపహరమునంటి
కేవలపరమాత్మ భావమమరు ।
భావమున్మనిజేర్చి పరికించుసీలోన
వాక్యములన్నాలుగు వరుసగాను ।
లక్ష్యలక్ష్యార్థంబు లక్ష్యమై శోధించి
సర్వాత్మసంయోగ సరణిగాంచు ।
నాల్గువాక్యార్థములసిద్ధి నందిపొంది
సాధనంబేమియునులేక సాక్షినగును॥ వసుధ॥

సీ. వేదశాస్త్రపురాణ వేద్యమైసాధ్యమై
బోధ్యమైయున్నట్టి భూతిగాంచి ।
సకలచరాచర జంతుజాలములందు
వెలసిప్రకాశించు వెల్గుగాంచి ।
ద్విదళసారసమధ్య సదయుడై వెల్గెడు
హృదయాంతరంగుని వెదికిచూచి ।
దేహేంద్రియస్వాంత ధీచిత్తములకెల్ల
గోచరించనిశుద్ధ గోప్యమూని ।
జ్ఞాతమైయుండు నిష్కళభూతిగాంచు ।
ఒదిమె శైవోహమనియెంచు మాత్మయందు॥ వసుధ॥

సీ. లోకంబులెల్లను లోవెలిపూర్ణమై
చైతన్యశూన్యమై చెలగునాత్మ ।
అశిపదాతీతమై యాదిపరంజ్యోతియై
యకళంకమై యమరునాత్మ ।
భవరోగశూన్యమై ప్రకృతిద్వయాంతమై
బరగెడునాత్మయే ప్రత్యగాత్మ ।

గురుభావకల్పంబు గుణరహితాంతంబు
గురుజ్ఞప్తి చిత్పర గోప్యనూత్మ ।
నిరుపమానంద భావమే నిర్మలాత్మ।
నిష్కళానందపూర్ణమై నెగమనాత్మ।
వసుధ ముత్యాల వంశ పావనవికాస ।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

సీ. తెలివిగురూక్తిచే తెరచాటుమించెడి
తెల్వితన్మయమచ్చ తేజమాత్మ ।
తెల్వికన్నాపలో దెలిసెడిలోకంబు
తెలివిసాక్కెడిజ్ఞప్తి తేజమాత్మ ।
తెలివిరూపముగాంచ తెలియదుకంటికి
తెట్టతెలగుబయు త్తేజమాత్మ।
తెలివిమాయలలోన తెందెప్పలై దోచు
తెల్వితెల్వికిసాక్షి తేజమాత్మ ।
తెల్విలోనున్న తెల్వికి తేజమాత్మ ।
ధీజితాంతర పరమాత్మ తేజమాత్మ॥ వసుధ॥

చిద్బ్రహ్మము.

సీ. భానుకోటిప్రభా భాసితహృద్యమై
నిగమాంతవేద్యమై నిత్యమగుచు ।
ఆదియంత్యములేక నమరిచిన్మింటను
యమలమైసత్యమై విమలమగుచు ।
స్వప్రకాశాత్మయై స్వజ్యోతిరూపమై
సర్వాత్మమైబ్రహ్మ సాక్షియగుచు ।
వేదాంతవేద్యమై విద్యోతపూర్ణమై
నిర్గుణానందమై నిజమునగుచు ।
భావనాభావ్య శూన్యచి ద్బ్రహ్మమగుచు ।
నున్న పరమాత్మ సంయోగ మెన్నుచుండు॥ వసుధ॥

మానముద్ర.

సీ. తానుతానగునట్టి తలపుహృద్వీధిని
తన్మయపురిజేర్చి తాకుచుండు।
తనలోనిగురికీలు దలపోసితత్త్వంబు
నెత్తిగెడుదాని నీనెఱుగుచుండు।
మరణభయంబును మదిలోననుంచక
నిజసమాధిమనను నిల్పుచుండు।
అంటియుండుమునిత్య మంతర్ముఖంబున
మానముద్రాత్ముడై మఱిగియుండు।
పరమపరిపూర్ణ సుస్థిత ప్రజ్ఞుడగుచు।
నీలతోయద విద్యుద్వ నియతకాంతి॥ సువధ॥

జీవన్ముక్తుడు.

సీ. ఎవనిభావనగివి నెసగుదీపముమాట్కి
దేహములోపల తేజరిల్లు।
హృదయపంకజవర్తి విదితతేజస్స్ఫూర్తి
సదమలగుణమూర్తి సత్యకీర్తి।
నెంచిసౌఖ్యమునోసి మించినయోగియై
యతినిర్మలుండైన యాత్మగురుడు।
బ్రహ్మమయుండైన పరిపూర్ణచిత్తుండు
ఆనందరూపుడై యలరుననెడు।
నట్టివాడె జీవన్ముక్తుడనగనొప్పు
బ్రహ్మవిద్వర్యుడనెడు సద్బ్రాహ్మణుండు। వసుధ॥

ఐక్యభావము.

సీ. పరిపూర్ణులమటంచు భ్రమపడిపల్కెరు
పరిపూర్ణతత్త్వంబు బడయుటరుదు।

మనసు నిల్చెనటంచు మఱియలుబల్కేరు
మనసు నిల్చినతోడ మాయయరుదు।
మాయదాటితిమంచు మంకులుబల్కేరు
భాగ్గైన యమనస్క భావమరుదు।
అమనస్కభావుల మనిజమల్పలేరు
అమనస్కపరిపూర్ణ మంటుటరుదు।
అందిమనస్మయమానుట యరుమనుమ్మి।
అందిపొందెడు వారైక్య లనగ జెల్లు।
వసుధ ముత్యాల వంశ పావనవికాస।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

జాగ్రత్స్వప్న షుషుప్తులు యింద్రజాలము.

సీ. జలదర్పణాదుల చెలగెడిరూపము
లగులకుచిత్రమై యణగుచుండె।
యింద్రజాలములందు సాంద్రమహాక్రియలన్ని
మాయకుమాయయై మహిమదోచు।
స్వప్నంబులోపుత్ర సాంగత్యమునుండి
మేల్కొన్నతోడనే మిణుకరించు।
జాగ్రతలోపల జరిగినవార్తను
షుప్తిలోనిజముగా తృప్తినదవు।
రెండవదిలేని బ్రహ్మంబు నిండుమతిని।
యుండగనుమింక నిచ్చలు నుండబోవు॥ వసుధ॥

ప్రత్యగాత్మానుభవము.

సీ. రాకపోకలులేని రాజయోగముపూని
పట్టుగానచలంబు మట్టుచుండు।
నామరూపములేక నడయాడుతత్త్వంబు
భూతంబులైతోచు పుడమియందు।

వెలుఁగుహృద్వీధి వేద్యమాగురుసంజ్ఞ
యాద్యంతశూన్యమై యలరుచుండు।
మనసమంద్వైక్యంబు మఱగించిగురుసాజ్ఞ
మన్మయమగునాత్మ మఱగియుండు।
నట్టిచిచ్ఛక్తి జ్ఞప్తిలో మట్టిపెట్టి।
ప్రత్యగాత్మనుయెన్నుట నిత్యసుఖము। వసుధ॥

త్రిగుణ నిరసనము.

సీ. త్రిగుణంబులందున వృథమతిశోధించి
సాధువృత్తినిబూన సత్వమున్న।
రాజసగుణమంద రజ్జులాడించునను
తామసగుణమంద తమకమున్న।
నీమాటిలోపల నియమించి సాత్వీక
యోగమందినగాని బాగుగాదు।
రాజసతామస రహితుడౌసుజ్ఞాని
తత్పదగురియుండె దగిలిజ్ఞప్తి।
తనరుసాత్వికరాజస తామసముల
బొందిపొందక నిర్గుణానందపరుడు॥ వసుధ॥

ఐక్యసంధానము.

సీ. అంతరాత్మజ్ఞాన మందగోరుచువిశ్వ
మయునినిరంజను మదినినిల్పి।
భావనాతీతుని దేవాదిదేవుని
స్వప్రకాశుని శివు శాశ్వతునజు।
నిఖిలాంతరాత్మను నిర్ణయప్రజ్ఞలో
నిజముగాధ్యానించి నిర్గుణంబు।
దాకితన్మయమందు తలపునైక్యముజేసి
పరిపూర్ణుడై యుండు భావమందు।

తాను దనలోన హంసను దనరజూచు ।
నట్టివానికిమరుజన్మ మవనిలేదు ।
వసుధ ముత్యాల వంశ పావనవికాస ।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

సీ. పాత్రలలోనీరు బరికించ వేర్వేరు
    నీరుదానొక్కటై నిండియుండు ।
బంగారుసొమ్ములు శృంగారముల్వేరు
    బంగారమొక్కటై బరగుచుండు ।
దీపముల్వేర్వేరు దేదీప్యమైవెల్గు
    వెలుగుదానొక్కటై వెలయుచుండు ।
ఘటములువేర్వేరు గన్పించుచుండును
    మృత్తికయొక్కటా యత్తమగును ।
దేహములుచూడ వేర్వేరు దేహియొకడు
ధ్యానమున జీవుడేకమై దనరుబ్రహ్మ॥ వసుధ॥

సీ. లేదులేదనిజూడ లేకపోవుజగంబు
    కద్దుకద్దనిజూడ గలుగుజగము ।
కలయందుదోచెడి గజతురగాదులు
    లేచిచూడ మతిదోచవయ్యె ।
మెలకువలోనున్న మేలైనసంపద
    ల్నిద్రలోనష్టమై నిలువవయ్యె ।
యీరెండవస్థలు యెవినిజమనిచూడ
    కలయెరెండును చెల్లవెచట ।
భ్రాంతిలేనట్టిపరమాత్మ భావమెఱిగి
భ్రాంతిశూన్యంబెఱుంగుటే బ్రహ్మమయము॥ వసుధ॥

## యోగప్రభావము.

సీ. సుస్థిరప్రజ్ఞలో సాగుచుండెడిజ్ఞప్తి
పాదుజూచినవాడె పరమయోగి।
బోధరూపములగు బుద్ధ్యాదులకుసాక్షి
నియమించుహంసను నిత్యయోగి।
నేననుగురుకీలు గానంగరానిది
తనకుతానై మించు తత్త్వయోగి।
అన్నిటిలోనుండి యెన్నకుమారిక
రాణించుహృద్వీధి రాజయోగి।
మొదలుకొనలేక వెల్గును ముక్తయోగి।
బ్రహ్మమయమంద గోరును భవ్యయోగి॥ వసుధ॥

## హంసజపము.

సీ. నిర్వికల్పసమాధి నిర్గుణధ్యానంబు
నియతిదప్పనిజ్ఞప్తి నిజముగనుము।
బుద్ధిబుద్ధినిజేర్చి పూర్ణసమాధిలో
నచలుడై యుంను హంసజపము।
మాటలింకినతోడ మనన్మయగురునిష్ట
బ్రహ్మోహమస్మియ న్పరమపదము।
వెలివిషయమునాపి విజ్ఞానదృష్టిలో
నిజమూర్తిగనుచుంట నిత్యతపము।
సర్వదృగ్దృశ్య ములకెల్ల సాక్షివగుము।
కొండవలెనిల్చి నచలుడై యుండగనుము॥ వసుధ॥

## అవ్యయ బ్రహ్మము.

సీ. పరమైనబ్రహ్మంబు గురిదాటిచూడగా
తరముగాకెదియుంను స్థిరమదేను।

బోధరూపంబున బుద్ధ్యాదులకుసాక్షి
చిరకాలమొకరీతి స్థిరమదేను ।
నేనునేననుజ్ఞప్తి నెక్కొనియున్నది
తరచిచూడగరాని స్థిరమదేను ।
అన్నిరూపులయందు యమరియేయున్నది
నిరుపమంబైనట్టి స్థిరమదేను ।
పరమచిదచిద్విలాసమూ స్థిరమదేను ।
బ్రహ్మమద్వయమనిచెప్ప బలుకుశ్రుతులు ।
వసుధ ముత్యాల వంశ పావనవికాస ।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

బ్రహ్మమేనీవనుభావము.

సీ. ఆడువారెవ్వరు పాడువారెవ్వరు
గూడువారెవ్వరో గుర్తుగనుము ।
జూచువారెవ్వరు బ్రోచువారెవ్వరు
వినెడువారెవ్వరో వెదకిగనుము ।
తిరుగువారెవ్వరు తినెడువారెవ్వరు
మెరుగువారెవ్వరో యెఱకగనుము ।
పలుకువారెవ్వరు పలికింతురెవ్వరు
స్వప్రకాశంబైన సాక్షిగనుము ।
ఏది సంతోషదుఃఖంబు లేకమగునో ।
యదియెబ్రహ్మంబునీవని యందిగనుము॥ వసుధ॥

తన్మయ బ్రహ్మము.

సీ. సకలయోగీంద్రుల సన్మనోనిలయుని
సంచేతింగినజ్ఞాని సత్యసముడు ।
జాతినీతులురోసి జన్మదుఃఖముబాసి
జటిలుడై తిరుగును జైత్రుడెపుడు

పంచవింశతితత్త్వ పరచిదాకాశంబు
  ప్రతిభగాంచెనుమాని ప్రాజ్ఞుడతను ।
యెప్పుడు పరిపూర్ణ మిరవుగానెంచెను
  యెఱుకబుచ్చినవాడు విధిరెముడు ।
ఘననభోజ్యోతి బెంగెడు ఘనుడతండు ।
తన్ను తాజూచి తన్మయం బెన్నుచుండు॥ వసుధ॥

అద్వయానందము.

సీ. దేహపంజరమందు దిమ్మరైయొక్క
  తత్త్వంబుమఱిచితానణుడుజీవి ।
విమలబోధాకార వృత్తిచే కేవల
  పరమాత్మసంయోగ పరుడుజీవి ।
భూ్రిమధ్యదేశ నభోవీధి చిక్క
  విశ్వరూపాత్ముడై వెలయుజీవి ।
పరిపూర్ణ దృశ్యయ బ్రహ్మంబు ధ్యానమ్మధ్య
  తన్మయానందుడై దనరుజీవి ।
వివిధ విషయేంద్రియములకు విరతిజీవి ।
యద్వయానంద పూర్ణుడై యలరుజీవి॥ వసుధ॥

హంసమహిమ.

సీ. లయమంత్రసాంఖ్యాది లక్షణంబులకంటె
  నధికఫలంబిచ్చు హంసమహిమ ।
శివవిష్ణుబ్రహ్మల చేరిమ్రొక్కుటకంటె
  నధికఫలంబిచ్చు హంసమహిమ ।
సకలతీర్థస్నాన సంకల్పములకంటె
  నధికఫలంబిచ్చు హంసమహిమ ।
తలక్రిందులై యుండి తపముజేయుటకంటె
  నధికఫలంబిచ్చు హంసమహిమ ।

ప్రజ్ఞలోవెలిపూర్ణమౌ బయలుహంస।
భావనాతీత చిద్బ్రహ్మ పరమహంస।
వసుధ ముత్యాల వంశ పావనవికాస।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

బ్రహ్మానందము.

సీ. ఉత్కృష్టమగువేద ముంభితజ్ఞానంబు
నరయబ్రహ్మానంద మందిపొందు।
వుదితమై వేదము లుద్గాఢముగజెప్ప
నాప్రజ్ఞనిలయమే నధిగమించు।
స్వాత్మైక్యమననంబు సత్యవ్రతంబుగా
వెలియైజగమునకు వెలుగుపొందు।
సర్వమునీలోన సాధించిబ్రహ్మన్మధ్య
పరిపూర్ణచిద్బ్రహ్మ ప్రతిభనెంచు।
నిన్నునీలోనగనిమెల్లు నిగ్గుమనసు
పోలియుతనయందె యింధనానలముపగిది॥ వసుధ॥

పరిపూర్ణము.

సీ. నిర్మలాకారమౌ నిగమాంతవేద్యంబు
నిత్యసత్యజ్ఞాన నిర్ణయంబు।
నిష్ప్రపంచజ్ఞాన నిష్క్రియాసంపూర్ణ
నిష్కారణంబైన నిర్గుణంబు।
నిస్సంగనిర్మోహ నిష్కళాజ్ఞానంబు
నిగమాంతవేద్యమౌ నిరుపమంబు।
నిర్మత్సరంబైన నిజగురుధ్యానంబు
నిర్వికల్పంబగు నిర్మలంబు।
ఆత్మకైవల్యపరిపూర్ణ మనుభవంబు
గలసియొక్కటిగ్గయెమించు ఘుషియలోన॥ వసుధ॥

## మహావాక్యవిచారణ.

సీ. నేను నీవనుజ్ఞప్తి నెమ్మినాలోచింప
    నేనుప్రజ్ఞానంబు నీవుజడము।
నేననజీవాత్మ నీవన దేహంబు
    నేను ఈశ్వరుడైతె నీవుమాయ।
నేనుపరబ్రహ్మ నీవుమాయాశక్తి
    వద్వయద్వయముల నమరజూడ।
నేనులక్ష్యార్థంబు నీవువాచ్యార్థంబు
    గనుమీమహావాక్య ఘటితసరణి।
నీవు నీవగువాచ్యార్థ నియతిమాని।
నేను నేనగు లక్ష్యార్థ నేతవగుము॥ వసుధ॥

సీ. తత్త్వమే నిత్యమా తాత్పర్య మరయంగ
    సోహమస్మైక్యంబు సూత్రమయ్యె।
ప్రజ్ఞానమేబ్రహ్మ సంజ్ఞ గాగొనిన జీ
    వోహమస్మియన బ్రహ్మహమయ్యె।
అయమాత్మయనుబ్రహ్మ మంతరాత్మజ్ఞాన
    మన్మయసంయోగ మహిమయయ్యె।
అహమస్మిబ్రహ్మ తదంతరాళముజూడ
    కంటిమింటికిమధ్య ఘనమదయ్యె।
నిర్గుణానంద పరిపూర్ణ నిష్కళంక।
భావమందిన బ్రహ్మంబు బట్టబయలు॥ వసుధ॥

## తన్మయ బ్రహ్మము.

సీ. గురుభావమొకటచే గుర్తించిమించిన
    గురుశిష్యులకుమధ్య గుర్తులేదు।
గుర్తుగానిష్ఠలో గుణశూన్యమందిన
    గుహ్యమేయచలంబు కోర్కెలేదు।

క్రోధకాలంబెను జ్ఞప్తి కుంభించిచూడగా
నిమిషమాత్రం జ్ఞప్తి నిలువలేదు ।
నిలువనియెఱుకను నిర్ణయించిసాక్షిన
కేవలపరమాత్మ కిట్టిముట్టు ।
నిరవధి బ్రహ్మ తన్మయ పరుడవగుచు
భోగపరవశుడై యుండు పూర్తిగాను ।
వసుధ ముత్యాల వంశ పావనవికాస ।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

నిర్వికల్పము.

సీ. ఏయుపాధియులేక నెద్దానినంటక
లోకమందునజ్ఞాని లోలుడగుచు ।
తిరుగుచుతన్మధ్య దృష్టిచేరగనిల్పి
పరగురుభావ నిష్పత్తివిడక ।
తననీడతోడ్పాటు తాను బ్రహ్మమునంటి
నిర్గుణానందంబు నేర్పువిడక ।
గడచిపోయినవన్ని గమనించకను సచ్చిదా
నందమొందు సత్యముగలోన ।
నిర్వికల్పసమాధిలో నిగుడముట్టి ।
బ్రహ్మతన్మయ మానును భవ్యయోగి॥ వసుధ॥

బ్రహ్మైక్యము.

సీ. ప్రత్యగాత్మనుజూచి పనుపడమదినిల్పి
ధ్యానసంయోగంబు బూనవలెను ।
కనుపడునవియెల్ల కానుకానని దంటి
ఖం బ్రహ్మ మయమందె గాంచవలెను ।
తత్త్వమసిస్మృతి తాత్పర్యమార్జించి
తన్మయానందుడై దనరవలెను ।

అయమాత్మ బ్రహ్మైక్య మనువుగాగూడెడి
    హంసయోగంబులో నందవలెను ।
బ్రహ్మమందునదోచెడి భ్రాంతులడచి ।
శ్రుతియథార్థములోనెంచు బ్రతిభముక్తి॥			వసుధ॥

౬. బ్రహ్మసంయోగంబు బరికించుసుజ్ఞాని
    యెక్కువసుఖమంది సాక్షియుండు ।
పూరూరుతిరుగుచు నుపక్రియలందక
    పరిపూర్ణుడై తాను బరగుచుండు ।
నొకచోటజ్ఞానియై యొకచోటమత్తుడై
    యొకచోటనాడుచు నొదిగియుండు ।
సూర్యునినీడను చూడనిక్రియ తాను
    స్థూలదేహమునంటి సారగియుండు
పరచిదానందనిలయుడై పజుగుచుండు ।
నట్టిపరిపూర్ణుడవనిలో బుట్టుటరుదు॥			వసుధ॥

సర్వము బ్రహ్మము.

సీ. యోగియైనెమ్మది భోగసామ్రాజ్యంబు
    ప్రజ్ఞలోగురుకీలు బలిమిగనుము ।
తనువుదూష్యమటంచు తగుధ్యానమందుచు
    మెప్పుగాగుణములు మెదపిగనుము ।
నేనుజీవుడగాను నియమాత్మశివుడనే
    నియతిదప్పనియుక్తి నేర్పుగనుము ।
అంతరాత్మజ్ఞాన చింతనీలోనుంచి
    నేనునేననువాడ నేనటన్చు ।
భ్రాంతినిరసించి సర్వంబు బ్రహ్మమనుచు ।
మంత్రతంత్రములడచి స్వతంత్రుడగుము ।

వసుధ ముత్యాల వంశ పావనవికాస ।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

## కేవల బ్రహ్మము.

సీ. అచలసమాధిలో నభ్యసించినజాలు
నఖిలముద్రలపైని యాసలేల ।
కేవలబ్రహ్మంబు కీలుగాంచినచాలు
పలుమారుయోగము ల్పట్టనేల ।
ద్వాదశాక్షరిమంత్ర తత్త్వమందినచాలు
మంత్రతంత్రంబుల మచ్చికేల ।
గురుతుగాబ్రహ్మంబు గురినిల్పితేచాలు
యితరగుర్తులపైని యిచ్ఛయేల ।
పరచిదాకాశ బ్రహ్మంబు నెఱుగువెన్క ।
సకల సంశయములువీడి సమయునచట । వసుధ॥

## ద్వాదశాక్షరి భావము.

సీ. అచల సంపూర్ణంబు నాత్మసమాధిలో
ద్వాదశాక్షరిబూని దలగకుండు ।
మూలమేమియులేని ముక్తికై గూర్చొడి
షోడశాక్షరిగుట్టు గూడియుండు ।
కలనుదోచినవన్ని కల్ల దేహములని
పంచదశాక్షరి పమ్మిచుండు ।
కోరియీమంత్రము ల్కుదురుగామదినెంచి
పట్టువీడనియోగి పావనుండు ।
గానబ్రహ్మైక్య సంధాన మానబూను ।
నట్టియోగికి మరుజన్మ మవనిలేదు॥ వసుధ॥

## సాక్షిత్వము.

సీ. సర్వజీవులయందు సంపూర్ణముగనిండి
        సర్వేశుడున్నట్టి జాడజూచి ।
నామరూపక్రియ లేమియులేనట్టి
        యంతరాత్మజ్ఞాన మమరజూచి ।
కర్మసంచయమందు కర్తవ్యమెంచక
        గ్రాలుచున్నట్టియా ఘనముజూచి ।
స్వప్నజాగ్రత్సుప్తి సంధులమెదలక
        కనుచూపుకందని కాంతిజూచి ।
అందునిందన కనుబయ లందజూచి ।
సర్వమందుననేకమౌ సాక్షియగును॥                వసుధ॥

## జీవన్ముక్తుడు.

సీ. ఈపద్యముల్విన పాపముల్నశియించు
        చదువువారాత్మైక్య పదవిగందు ।
రాయురారోగ్య సరై శ్వర్యములగూర్చు
        నద్వైతసంసిద్ధి యమరుచుండు ।
ధనపుత్రపౌత్ర సంతతిబాంధవాదిగా
        పశుగజతురగ సంపదలుగలుగు ।
శాంతిధాంతిక్షమా సత్యధర్మోపేత
        బలయశస్తేజముల్ ప్రాప్తమగును ।
నిర్వికల్పక సమధిక నిత్యసత్య ।
భవ్యపదమబ్బు తిరిగి యెప్పటికిరారు॥                వసుధ॥

సీ. ఈసీసపద్యము ల్వ్రాసిన చదివిన
        పరమైక్య సంప్రాప్తిగలుగు ।

దీనియందున్నట్టి దివ్యతత్త్వమునెంచ
సర్వదుఃఖంబులు సమయఁగల్గు ।
స్థిరమైన గురుభక్తి సిద్ధింపనేరకొని
క్రమముక్తిమార్గంబు కదియఁగల్గు ।
విశ్వరూపాకృతి వెలయంగమదిజూపి
ధ్యానశుద్ధబ్రహ్మ తత్త్వమమరు ।
దినకరశశాంక పావకాది ప్రభుతులు ।
నుంచు నందాక నీకృతి యుంచుభువిని ।
వసుధ ముత్యాల వంశ పావనవికాస ।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

మంగళము.

సీ. పరమగురూక్తిలో ప్రణవాంతమగునట్టి
మననచిదాత్మకు మంగళంబు ।
సకల దృగ్మయరూప సారాంశమైయొప్పు
మన్మయబ్రహ్మకు మంగళంబు ।
నిత్యసత్యజ్ఞాన నిర్ణయమైనట్టి
మనమధ్యహంసకు మంగళంబు ।
గురుశిష్యులకుమధ్య గుణరహితాత్మ స
న్మాన్యతత్త్వమునకు మంగళంబు ।
మంగళాకార పరమాత్మ మంగళంబు ।
మహితమహా కేవలాత్మకు మంగళంబు ।
వసుధ ముత్యాల వంశ పావనవికాస ।
చిత్కళాభోగి శ్రీనారసింహయోగి॥

చిత్కళాసంపత్తి సంపూర్ణము.

ఓం.

శ్రీగణేశాయనమః.

శ్రీ మహాభారతమునందలి శాంతిపర్వంబున
( భీష్ముండు ధర్మరాజునకు )
పార్ష్ణేయుండను మునీశ్వరునికిన్ని
ఆయనశిష్యునకున్ను జరిగిన సంవాదము.

3. అధ్యాత్మ విద్యాసంసిద్ధి.

శ్రీశారదాంబస్తోత్రము.

శ్లో॥ నమస్తే శారదాదేవి కాస్మీరపురవాసిని ।
త్వామహం ప్రార్థయేనిత్యం విద్యాదానంచ దేహిమే॥

శ్రీగణాధిపతి స్తోత్రము.

వృత్తం॥ గణాధీశ సాంబ్రాజ్య సింహాసనస్థం ।
సమారాధ్య మబ్జాసనాద్యై సమస్తైః ।
ఫణాభృత్య మాబద్ధ తుండం ప్రసన్నం ।
భజే విఘ్నరాజం భవానీతనూజం॥

స్వగురుస్తోత్రము.

పంచపాది గీత పద్యములు.

పంచరత్నములు.

గీ॥ శరణుదైవశిఖామణి శరణు శరణు ।
శరణుశరణాగతత్రాణ శరణు శరణు ।
శరణు బ్రహ్మోపదేశిక శరణు శరణు ।
శరణు యస్మద్గురుప్రభో శరణు శరణు ।
ఆగమాంతర్య నరసింహ యోగివర్యా॥

గీ॥ స్వామిదైవ శిఖామణి స్వాంతమహిమ।
నేమిజెప్పుదు దిగంబరు నిశ్చగింత।
నెట్లువర్ణింతు మద్గురు నీళెతంబు।
సన్మనో నిలయపూర్ణ మే సత్యమయ్యె।
ఆగమాంతర్య నరసింహ యోగివర్యా॥

గీ॥ షోడశాక్షరి మననంబు జాడబట్టి।
యందె అష్టాక్షరములలో ననువుమీర।
ద్వాదశాక్షరి మంత్రంబు తలపునంటి।
వేదచతురాక్షరానంద వేత్తనైతి।
ఆగమాంతర్య నరసింహ యోగివర్యా॥

గీ॥ బ్రహ్మవిజ్ఞాన గురుతనూ భవులగలసి।
బ్రహ్మగురుబోధ మననుడై భవమువిడది।
బ్రహ్మ భూతాంతరాద్యంత పరమసత్య।
బ్రహ్మమందైక్య మగుటయే పరమపదవి।
ఆగమాంతర్య నరసింహ యోగివర్యా॥

గీ॥ అచలబ్రహ్మబోధ ఆత్మసమాధిలో।
దలచిదలచియోగ తల్పమందు।
నచలితంబులేని సర్వసుఖానంద।
పరవశత్వమంద బ్రహ్మమదియె।
ఆగమాంతర్య నరసింహ యోగివర్యా॥

వ. ఓధర్మరాజా పార్ష్ణేయుండను పేరుగల మునీశ్వరుండు సుఖగోష్టిలో నున్నప్పుడు అతని శిష్యుం డొకడు వచ్చి ముకుళితహస్తుండై నమస్కరించి వినయములో నిట్లనియె.

ఓ మహాత్మా? మోక్షమార్గము నాపై కృపగలిగి జెప్పుమని పాదములమీదబడె ఆమహాదివ్యజ్ఞాని శిష్యునితో నిట్లనియె.

ఓశిష్యా? నీవునాయందు భక్తిగలిగియున్నావు జ్ఞానవంతుడయ్యె ధవు మోక్షమార్గమును ఉపదేశించుటకు నీవుయోగ్యుడవు నేను జెప్పెడి మాటలను సావధానముగా చిత్తంబున నిలిపి వినుచుండుము ఈకాల చక్రము పరిమితి లేనిది ఈకాలమువలన సృష్టి పరింపాలను ప్రళయ పరంపరలును జరుగుచుండును జలప్రళయమైన పిమ్మట పరమాత్మను ప్రకృతినిబొంది మరియు భూతముల సృష్టించుచుండును అట్లు భూమిమనులు పుట్టినపుడు మునులు యేర్పడి వారలు ప్రళయమందుదాగిన అంశయుండెడి సర్వవేదశాస్త్రములను తిరుగాయేర్పరిచి సకలజనులకును ఉపదేశింపజేయుచుందురు సకలవేదశాస్త్రములును (బ్రహ్మజ్ఞానమును) తెల్పుటకుసాధనములై యున్నవి ఆబ్రహ్మస్వరూపమును దేవతలును మునులును తెలియగా జాలకుండిరి విష్ణుదేవుడు మాత్రము (అనగబ్రహ్మమును) యెరిగియుండె ఆ బ్రహ్మజ్ఞానము సకలదుఃఖములను పోగొట్టుటకు దివ్యౌషధ తుల్యమై యుండును ఆబ్రహ్మజ్ఞానమును అనాదిపురుషుడగు శ్రీవిష్ణుదేవుని కృపవలన మునులు దెలసికొనిరి, ఆమునుల వలనక్రమక్రమముగా జనులు దెలిసికొనిరి అంతట కేవల శుద్ధుండగు పరమాత్మయందు మొదట వొక (చైతన్యము) శక్తి బుట్టినది ఆశక్తివలన ప్రకృతిగలిగినది ప్రకృతివలన బుద్ధిగలిగినది (బుద్ధిని) మహాతత్త్వమని జెప్పుదురు ఆమహాతత్త్వమందు (అహంకారము) కలిగినది ఇవియన్నియు (చేతనశక్తిపొంది) చిత్తమందు కూడియున్నవి (అహంకారము) వలనఆకాశముపుట్టె, ఆ ఆకాశమువలన వాయువుపుట్టె, ఆవాయువువలన అగ్నిపుట్టె, ఆఅగ్నివలన జలముపుట్టె, ఆజలమువలన పృథ్వి పుట్టె నివియన్నియు చేతనాంశముగలిగి సత్వరజస్తమోగుణ స్వరూపములై యున్నవి మరియు (మహత్తత్త్వము) మొదలుకొని భూమిపర్యంతముగల యేడును సప్తవికృతులనబడెను వీనివలన బుట్టిన జ్ఞానేంద్రియములైదును కర్మేంద్రియములైదును శబ్దస్పర్శాది విషయములైదును మనస్సువొకటియు కూడగా పదియారు అగుచున్నవి యివియే షోడశ

వికారమువలనంబడుచున్నవి యీపదియారింటికి ( లింగశరీర ) మనియు, (స్థూలశరీర) మనియు రెండుపేర్లుగలవు యీలింగశరీరము పరమాత్మను గోచనియ్యక దాచిపెట్టినదై నను కరుణారూపమైనపుడు ఆపరమాత్మను ఉపాసించునది యగును, మరియు ఓశిష్యా? తొమ్మిది ద్వారములుగల దేహమనెడి దివ్యపట్టణమందు చింతింపశక్యముగాక వ్యాపకుడై యుం డెడి ( పరమాత్మ ) నివసించియుండును ఈదేహమందుగల సకల భావ ములతో గూడియున్నందున ( ఆపరమాత్మ ) పురుషుడని చెప్పంబడును ఆపురుషుడు మృతిలేనివాడగును పరిమితిలేనివాడగును నిర్మలస్వరూపు డగును వృక్షమందగ్ని యున్నట్టు పురుషుడనెడి ( పరమాత్మ ) దేహమం దుండును ఈపురుషుని బుద్ధిచేతతెలిసి యెరుగవలయును మరియు ప్రకా శరూపమగు ఆ పురుషుడు యోగమధనముచేత బుద్ధికి తెలియబడును మధన మనగా ( పెరుగు ) నందు వెన్నతీయుటకు చిలికినట్లు, అనగా మన స్సులోనే మనన దృఢంబుచేత తెలియందగు ఆ పురుషుని స్వరూపము ( ప్రజ్ఞాఘన స్వరూపమైయుండును ) అది సకల జీవులచేతను ఆశ్రయింప దగినదగును గనుక శ్రవణ మనన నిధిధ్యాసలచేత ఆ పురుషస్వరూపము తెలియంబడును సకల భూతములును ( అవాఙ్మానసగోచరుండగు ) పరమాత్మయందు బుట్టుచు వృద్ధిబొందుచు నశించుచున్నవి ఆపురు షుడు భూతముల ఉత్పత్తి మొదలగు కార్యములకు సాక్షియైయున్నాడు గాని ( ఆపురుషునకు ) వికారములు యేవియునులేదు. ఓశిష్యా? ఆత్మ చేత ఒకకాలచక్రము పట్టుకొనబడి కాలవశమువలన దిరుగుచుండును ఆచక్రమునకు మహత్తత్వములు మొదలగు యేడువికృతులకును అంచు లుగానున్నవి పదియారు వికారములును చక్రమునకు బొడ్డుచుట్టుగల ప్రదే శములోనున్నవి ( మధ్యబొడ్డు తెలియంబడని ) మాయాస్వరూపము గానున్నది నిశ్చలరూపము ఆచక్రమునకు ఆధారముగానున్నది ఈకాల చక్రమునందు సకలమగుజంగమస్థావరరూపప్రపంచమంతయు స్వాధీనము తప్పి కలబడుచున్నవి ఇట్లున్నవని తత్వజ్ఞానముచేత చూచుకొనవల

యును. ఓశిష్యా? దుష్టువాయువు పొందినట్లుగా సత్వరజస్తమోగుణములు పరిశుద్ధుడగు (ప్రత్యగాత్మను) పొందుచుండును. (ఆత్మజ్ఞాన)ము కలిగిన పిమ్మట పండితుండగువాడు వివేకముచేత ఆ సత్వాదిగుణములు ఆత్మయగు (తనకు) పొందనివ్వడు లోకమందు వేదాంతవేత్త దుర్లభుడై యుండును జనులకు సాధారణముగా కర్మమును దెలిపెడి మార్గమందే శ్రద్ధగలిగియున్నదిగాని మోక్షమార్గ సౌఖ్యమందు బుద్ధిప్రవేశించుటలేదు మరికొందరు పెద్దలగువారలు కర్మలక్షణములగు కార్యములనుజేసి కీర్తికొరకు గ్రహింపదగిన విషయములయందు కామక్రోధాదులను విడువక ప్రవర్తించుచున్నారు. దేహమందభిమానముగలవానికెంత శాంతచిత్తముండినను కామక్రోధాదులు గలిగియున్నయెడల (బ్రహ్మజ్ఞానము) పుట్టనేరదు అందుచేత వేదాంతవేత్తయగువాడు ఏవిధముచేతనైనను దేహాభిమానము విడిపించెడి చూపును అభ్యసించి యుండవలెను మరియు అడవికిపోయినవాడు అడవియందంతట తిరుగుచు నవ్వులాటగా వేడుకలకును అడవినిచూచుచున్నట్లే సంసారమనే అరణ్యమందు సంచరించెడివారి పద్ధతియు అటువలెనేయుండును. మరియు వ్యాధిగలవాడు తనవ్యాధిని పోగొట్టుకొనుటకై ఔషధమును తినునట్లు అజ్ఞానమువలన కలిగిన (సంసార) బంధమును పోగొట్టుకొనుటకు (సత్వముపరిశుద్ధము మనోనిగ్రహము ఇంద్రియ నిగ్రహము) వీటిని అభ్యసింపవలయును భూమిమొదలు అయిదుభూతములకును శ్రోత్రముమొదలు సకలేంద్రియములకును సాత్విక రాజస తామస గుణములకును సకల లోకములకును ఆలోకాధిపతికిని సర్వమునకు (అహంకారము) మూలకారణమగును పూర్వముచూచిన విషయమును స్మరించుటయు సంతోషించుటయు అనుగ్రహించుట మొదలగు నట్టిగుణములు సత్వమువలన బుట్టినవగును రాగము లోభము రోషము క్రోధము మొదలగునవి రాజస గుణమువలన బుట్టినవియగును గర్వము దుఃఖము మొదలగునవి తామస గుణమువలన బుట్టినవియగును యీ ముందుచెప్పబడిన సా

భావ గుణములన్నియు (జ్ఞానమునకు) భంగములై యుండును గనుక (బ్రహ్మజ్ఞానమును) కోరువాడు అధిక ధైర్యశక్తిగలిగి సాత్విక గుణమునుమాత్రము ఆశ్రయించి తక్కినగుణములను నిగ్రహించి విడువవలయును అట్లుసాత్వికగుణమును మనస్సునందుధరించినయెడల ఆసాత్వికగుణము అధికమైనప్పుడు అది బ్రహ్మజ్ఞానహేతువగును అహంకారమువలన కర్మమును పూనగలుగును కర్మవలన దేహసంబంధమును విడువక ప్రవర్తింపవలసినప్పుడు ఈప్రకారమే అనేకజన్మపరంపరలు గలుగుచుండును శుక్లశోణితములతోజేరి పుట్టుచుండుట (జన్మమనంబడును) అట్లుశుక్లశోణితములతో జీవుడుకూడుకొని గర్భమందుగల మూత్రపురీషములతో వృద్ధినిబొందును స్త్రీయొక్కమర్మస్థానమునుంచి బయలుపడి సంసారమనుబంధమునందగిలి మనుష్యుడు దుఃఖించుచుండును ఇట్టిసంసారము కలుగుటకు (ఆశయనెడి) తీగెయే మూలకారణము ఆశయనెడితీగె ప్రాణి వృద్ధిబొందుటకు స్త్రీ జననమే ఆధారమైయుండును వివేకియగువాడు పైవిషయములను దెలుసుకొని ఆశను విడిచి సంసారబంధ విముక్తుడగును జ్ఞానాజ్ఞానములకు (ఆత్మయే) ఆధారము బుద్ధికిని అహంకారమునకును సాక్షివిధముగనుండెడిదై ఇట్టిదట్టిదని చెప్పరానిదియునునగు బోధచే (జీవాత్ముడని) శ్రుతులుజెప్పుచున్నవి అట్టిజీవుడు పూర్వజన్మమందు చేయబడిన కర్మములచేత సంసారమందుండి సుఖదుఃఖములననుభవించుచు అజ్ఞానమందుమునిగియున్నాడు స్వప్నమందు మనుష్యుడు నమ్మిన సుఖదుఃఖములను అనుభవించినట్లుగా (జీవుడు) యింద్రియములతో గూడుకొని సంసారమును అజ్ఞానభ్రాంతిచేతనమ్మి సుఖదుఃఖములను అనుభవించుచున్నాడు కామముచేతగలిగెడి యింద్రియభోగములనువిడిచి ఆత్మవిచారమువలన బ్రహ్మజ్ఞానమును సంపాదించినయెడల (పునర్జన్మదుఃఖము) గలుగనేరదు సకల జీవులయందు మనుష్యుడు శ్రేష్టుడు మనుజులలో బ్రాహ్మణుడు శ్రేష్టుడు ఆ బ్రాహ్మణులలో వేదార్థమెరిగినవాడు శ్రేష్టుడు వానికంటె ఆత్మజ్ఞానమెరిగినవాడు శ్రేష్టు




ము ( జ్ఞానము ) నేత్రమువంటిది ( నేత్రములేనివాడు చూపులేకయుండు
ను ) కాబట్టి జ్ఞానమార్జించదగు. మంచి [illegible] శక్తితో గూడియుండు
చిత్తమునకు ఓర్పును సత్యమును ఏ..శుద్ధము అట్టివే, మంచి ధర్మము [illegible]
గును. బ్రహ్మచర్యము మిక్కిలిపరమధర్మము [illegible] లయందు [illegible]
చిక్కుపర్చక జాగరూకతగలిగి యుండవలెను మరియు [illegible] నిలచి
యుండుటకు పదినాడులు మూలకారణమై యున్నవి ఇంద్రియములు సం
చరించుటకు అయిదునాడులు హేతువులై యున్నవి ఈ చెప్పబడిననా
డులలో పదిస్థూలములై యున్నవి అయిదు సూక్ష్మములై యున్నవి మరి
యొకనాడి మిక్కిలి పరమసూక్ష్మరూపముగానుండి హృదయముయొక్క
వనమును వ్యాపించియున్నది అదిచూడగా ( సర్వవ్యాపియగును ) ఆసూ
క్ష్మనాడి మరిగినచిత్తము మరియొకస్థానమునకు పోజాలదు ఒకానొకప్పుడు
పోయినను త్రిప్పుకొనవచ్చును ప్రపంచసుఖముమరచి హృదయమందున
చిత్తమును నిలిపి (పరమాత్మను) చూడవచ్చును (శుక్లము) దర్శించిన
చిత్తమునిల్చును ఆశుక్లమనేబిందుదర్శనము చేయనివారికి (పరమాత్మ)
గోచరముకాదు శుక్లముయొక్క పొగరువలన కామముగలుగును కామ
మువలన సకలేంద్రియములకు పొగరుబుట్టును మనస్సంకల్పమువలన శు
క్లము చిక్కులోబడి చెడిపోవును పురుషబీజమగు ( శుక్లము ) యింద్రి
యమనియును (బిందువని) చెప్పంబడును సకల ధాతువులకు (శుక్లమే)
మూలమైనది శుక్లము మనస్సునకు సూక్ష్మమైనరూపమై తోచుచుండును
అట్టిమనోరూపము ఆపుటకు పరిపక్వమగుబుద్ధి సమర్థతయుండవలెను యు
వ్వనవంతులునువృద్ధులును అజ్ఞానముచేతదుర్బుద్ధిగలిగి తెలివిమాలి తమ
మనోవేగమునుఆపజాలరు శుక్లమునురక్షించుట దేహమునుండి వెలుపలికి
రాకుండెడి స్థితినిగలిగించుకోవలయును అట్లుచేయుటకై యమము నియ
మము మొదలగు యెనిమిదియోగములు సాధనములుగలిగి పూర్తిగానుక
ర్మమునుచేయుచు ఆయమనియమాదులు అభ్యసించుచు విషయ (సుఖ
కర్మములను) గోరక ప్రవర్తించవలయు విషయములవలనగలిగెడు దుఃఖ

ములకు అంతములేదు గోరినవారికి కీడేవచ్చుచుండును విషయాభిలాష వదలినవారికి ( మోక్షము ) నిస్సంశయముగా గలుగుచుండును జనన మరణ నానావిధ దుఃఖములు జనులు పొందుచుండగా అట్టి జనులను పండితులగువారుచూచి భయపడి మోక్షమునకు ప్రోత్సాహించుచుండందగు మోక్షేచ్ఛ గోరెడువారు దేహపరిశుద్ధతయు వాక్పరిశుద్ధియు మనోపరిశుద్ధియు జేసికొని అహంకార స్వభావములేనివాడై నిర్మలబుద్ధిమంతుడై యేకోరికలేనివాడై సకల జంతువులయందును దయగలిగి మెలగిన యడల ( జ్ఞానము ) గలుగుచుండును ధైర్యవివేకములుగల బుద్ధినిపొంది బుద్ధిచేత మనస్సుగెలచి మనస్సుచేత యింద్రియముల నిగ్రహించి నిలిపి విషయములు విడచిపెట్టిన వారికి దేవతలు అనుగ్రహించెదరు నిర్మలమైన యోగమార్గము లభించును బుద్ధినిశ్చలమై నిలచును మోక్షస్థానముసిద్ధించును యోగియగువాడు జ్ఞానాభ్యాసముచేత సర్వదా జాగరూకుడై యుండవలెను ఒకానొకప్పుడు అజాగ్రత నిద్రలో స్వప్నమువలె వచ్చినను జ్ఞానాభ్యాస బలముచే జయించనగును జాగ్రదవస్థయందు అనుభవించిన విషయంబులు స్వప్నంబున దోచుటలేదు స్వప్నంబున దోచినవన్నియు జాగ్రతయందుదోచవు ఆత్మ రెంటికి (సాక్షియై) యున్నాడు జాగ్రత్స్వప్నసుషుప్తులనెడి మూడవస్థలు విడిపించుకొని తుర్యావస్థయందు యుండెడి యోగికి నీమూడవస్థలు గలుగంజాలవు (వ్యక్తము) (అవ్యక్తము) అనురెంటిని తెలియనివానికి (మోక్షమార్గము) లభించనేరదు వ్యక్తమనునది (మాయాకార్యములగు) వికారములును, అవ్యక్తమనునది (ఆత్మస్వరూపమగును) గనుకనే ప్రజ్ఞానందఘనుడగు స్వరూపవిష్ణుండు ( వ్యక్తమనునది ) మృత్యువనియును (అవ్యక్తమనునది) అమృతమనియును జెప్పియున్నాడు సత్యజ్ఞానానందాద్వితీయమగు పరమాత్మ (స్వరూపము) శ్రేష్ఠమైనదగును అట్టి తత్త్వమును బొందదగినదని వేదంబులు మొరపెట్టుచున్నవి గనుక శిష్యునికి నిర్గుణానంద పరిపూర్ణసుఖం బనుభవించుమని (పాష్ణేయుండనెడు మునీశ్వ

రుండు) అనేకవిధంబులుగా అధ్యాత్మ విద్యాసంసిద్ధిని బోధించి శిష్యుని కృతార్థునిజేసెనని భీష్ముండు ధర్మరాజునకుజెప్పి ఓ ధర్మరాజా యీచె
ప్పబడిన వాక్యార్థములను నీవువిని మనస్సునం దుంచుకొంటివి
గదాయని అడిగిన నాధర్మరాజువిని సదానందభరితాం
తరంగుడనై ఆనందించితియనెను ఆగురుశిష్య
సంవాదంబును అధ్యాత్మ విద్యాసంసిద్ధి
సర్వంబును సంపూర్ణము.



చ॥ చదివినవారికిఁ గలుగు సంపదసౌఖ్యము లాయువృద్ధియుఁ ।
కుదురును జ్ఞానయోగసుఖ గుప్తములిందున నిర్భయంబులై ।
పదిలపరాపరంబునకు బ్రాకెను భావజితేంద్రియాత్మలో ।
విదిత విధిజ్ఞులై భువిని విచ్చలులై విహరింతురెప్పుడుఁ॥

వ. మోక్షాపేక్షులగువారలీగ్రంథము నందలి రహస్యములను సద్గురూపదేశంబుగ్రహించి బ్రహ్మానందసుఖమంద సదానందమందుచుం డెదరుగాత.







ఓం.

శ్రీగణేశాయనమః.

( వ్యాసభగవానులు శుకబ్రహ్మకు పదేశించిన )

౮. పరబ్రహ్మ సంక్షేపము.

## శ్రీ వినాయకస్తోత్రము.

క॥ శ్రీకరముగ నిర్విఘ్నము చేకొనియెద విఘ్నపతిని చింతిలిపిదపన్ ।
ప్రాకటముగ సుజ్ఞానవివేకము ప్రచురింపబుద్ధి వితమరినైతిన్॥

## శ్రీశారదాంబస్తోత్రము.

క॥ శ్రీవాణి నజునిరాణిని వావిరి వాగ్జృంభణంబు వరకవితోక్తుల్ ।
ప్రావీణ్యముగను బలికెడు త్రోవను వసిగొనుట కేను తొలుతనుతింతున్॥

## స్వగురుస్తోత్రము.

క॥ పరుడై దిగంబరేశుడు పరతత్త్వము జాడజూపి పాలించిమతిన్ ।
స్థిరబుద్ధి నిలువజేసిన గురుమూర్తికి నతులొనర్తు కూరిమితోడన్॥

శ్రీ మహాభారతమునందలి శాంతిపర్వములో వ్యాస మహాము నీంద్రునకున్ను తనకొమారుడైన శుకబ్రహ్మకున్ను జరిగిన ( పరబ్రహ్మసంక్షేపమును ) భీష్ములవారు ధర్మరాజునకు జెప్పినవిధంబెట్లనగా. ఓ తండ్రీ వ్యాసమునీంద్రా? పరబ్రహ్మప్రాప్తి యజ్ఞము వలనకలుగునో లేక ప్రజ్ఞాధిక్యతవల్లకలుగునో సాంఖ్యమువల్ల కలుగునో లేక యోగాభ్యాసమువల్ల కలుగునో ఆవివరమును నాకుచెప్పుమని వేడగా నావ్యాసమునీంద్రుండు ఓపుత్రుడా! శుకుడా! నీవుచెప్పినవన్నియు మేలునుకలిగించెడివగును. అయినను చెప్పెదవినుము. విశేషమగు తపస్సుతోగూడిన యింద్రియనిగ్రహముగలిగి, రాగలోభగుణములనువిడిపించి, దృఢజ్ఞానముగల పుణ్యపురుషుడు బ్రహ్మమును పొందగలడు. అందొకవిశేషముకలదు చెప్పెదవినుము. జ్ఞానేంద్రియములగు, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములనెడిఅయిదును, పరమాత్మనుజూచెడి జ్ఞానమునకు అడ్డమై

యున్నవి. ఆయింద్రియములను మొదటజయించగా మనస్సుపరమా త్మనుజూచుటకు సమర్థమైనదగును. మరియుమోక్షమునకు ప్రయత్నించెడివాడు, మొదటనే, మనస్సును యింద్రియములను గ్రహించి, శబ్ద స్పర్శాది విషయముల నుంచి మళ్ళించగా సకల సిద్ధులును కలుగు చున్నవి.

మరియు, ఓశుకుడా! ఆపరమాత్మ స్వరూపమందు శబ్దస్పర్శాది గుణములులేవు. ఇంద్రియములకు కనబడునదికాదు. నిర్మలమగుబుద్ధి చేత తెలియబడును. మరియు, పండితులగువారు జ్ఞానవైరాగ్యములు గల బ్రాహ్మణునియందును, గోవునందును, యేనుగునందును, కుక్కయందును, ఆకుక్కనుదినెడి మాలవానియందును, వుండెడి పరమాత్మను చూచుచు సమానదృష్టిగలిగియుందురు. మరియు, స్థావరములగువృక్షాదులయందును జంగమములగు మనుష్యాదులయందును పరమాత్మ యేకరూపముగా నుండును. ఆస్థావరజంగమములును పరమాత్మయందు స్వాభావికము గలిగియుండును. అట్టిపరమాత్మనుభావించుటవలన, ఆ పరమాత్మతోటి ఐక్యముకలుగును. మరియు, ప్రపంచమందుండెడి సకల దేహములలో, క్షరపురుషుడుండును. ఆత్మ, అక్షరపురుషుడనబడును. ఈరెండును ఆత్మకు రూపము లనబడును. క్షరమనునది మృతియనబడును. అక్షరమనునది నాశములేనిదగును. యీరెండు స్వరూపములను పండితుడు యెరిగియుండును. మరియు, యీసకలలోకములను కాలముక్రమించుచున్నది. అట్టికాలమును ఆత్మక్రమించుచున్నాడు. అట్టి ఆత్మ, మృతిలేనివాడును, ముదిమిలేనివాడును, సత్యస్వరూపుడునగును. మరియు, తొమ్మిది ద్వారములుగల దేహమనెడి పట్టణమందు పరమాత్మయనెడి ప్రభువు ప్రకాశింపుచుండును. ఆపరమాత్మను, నాశములేనివాడనియు, అమృతస్వరూపుడనియు మహాత్ములుచెప్పుదురు. అట్టిపరమాత్మను, జ్ఞానవైరాగ్యములను అభ్యసించిన పుణ్యాత్ముడు యెరుగగలడు. అనియిట్లుచెప్పి వ్యాసుడు మరలనిట్లనియె.

ఓశుకుడా! కామ క్రోధ భయ నిద్ర లోభములనెడి ఈ యైదును యోగులకుకూడనివగును. గనుక, యీ యైదింటిని విడువవలయును. సంకల్పమును విడిచినయెడల కామమునశించును. సాత్వికగుణవిచార మువలన, నిద్రామోహములు నశించును. పెద్దల సాంగత్యమువలన లోభగుణము నశించును. మనోనిగ్రహమువలన క్రోధము నశించును. ధైర్యమనస్సుగలిగి జాగ్రతప్రవర్తనముచేత ప్రవర్తించిన యెడల భయ మునశించును. మరియు, నిర్మలమగు జ్ఞానముచేత, వివేకియగువాడు, శిశ్నమును, కడుపును, కాళ్ళను, చేతులను, ధైర్యమును, కండ్లను, చెవులను, చెడువిషయములయందు ప్రవేశింపజేయక, పరిశుద్ధమనస్సుచేత, రక్షించుకొనును, మరియొకపద్ధతిని చెప్పెదవినుము. ఇంద్రియములలో నొకటైనను పట్టుపడకయుండెనేని, అట్టి ఇంద్రియద్వారా, ప్రజ్ఞనశించును. గనుక మనస్సును మొదటనిగ్రహించవలయును. అట్లుమనస్సును యింద్రియములను ఆత్మయగు తనయందునిలపగా, అందుచేతజ్ఞానము గలిగి, అట్టిజ్ఞానముచేత అవాఙ్మానసగోచరుండగు పరమాత్మను బొంది, "పొగలేని అగ్ని హోత్రమువలె" ప్రకాశింపు చుండును. మరియు, సంసారదుఃఖమును పోగొట్టదలచికొనినవాడు, మనస్సునుయేకాగ్రమగు నట్లుజేసి, పామరజనులుండు స్థలములనువిడిపించి, నదీపర్వతదేవాలయము మొదలగు స్థలములయందుండి, ధ్యానయోగము నభ్యసింపవలయును. అట్టివాడు, తనను పరులుసన్మానించినను, అపకారముచేసినను, సంతోషక్రోధములను పొందరాదు. రాళ్లునుబంగారమును సమానముగ చూచుచుండవలయును. అట్లు, ఆరుమాసముల పర్యంతము ధ్యాన యోగముచేత సమాధిని అభ్యసించినయెడల శబ్దబ్రహ్మముస్ఫురించగలదు. శబ్దబ్రహ్మమనగా సగుణబ్రహ్మమని తెలియవలయును. అట్టి సగుణబ్రహ్మమందు వర్తించుచు సమాధినిష్ఠుడై యున్న యెడల, శీఘ్రముగా, పరమానందస్వరూపమగు నిర్గుణపరమాత్మను చూడగలడు. అని వేదవ్యాసమునీంద్రుండు జెప్పగా, శుకుండిట్లనియె.

ఓ మహాత్మా! తండ్రీ! వేదము, కర్మయోగమును సన్యాసయోగమును రెంటిని జెప్పుచున్నది. ఇదిచూడగా, పరస్పరవిరుద్ధమై యున్నట్లు దోచుచున్నది. గనుక అకర్మయోగ సన్యాసములలో, దేనికేశ్రేయఫలము కలుగుచుండునో అదిస్పష్టముగ జెప్పుమని అనుగగా, వ్యాసుండిట్లనియె.

కర్మమార్గము, సంసారమందు ప్రవర్తింపజేయును. కర్మసన్యాసమార్గము, సంసారమునుంచి నివర్తింపజేయును. గనుక, జ్ఞానవంతులుకర్మములనుచేయుటకు యిష్టపడరు. ఓశుకుండా, కొందరుకర్మమార్గమును మెచ్చుకొందురు. అట్టివారికి జననమరణ రూపమగు సంసారమునందు ప్రవర్తనముకలుగుచుండును. కర్మమును సన్యసించిన జ్ఞానపరులగువారు, సంసారబంధమును విడిపించుకొని బ్రహ్మానందమునుపొందుచుందురు మరియుపుణ్యకర్మమువలన చిత్తశుద్ధికలుగును. అట్టిచిత్తశుద్ధియు, ఆత్మజ్ఞానాపేక్ష లేనివారికి అజ్ఞానరూపమే యగును. కర్మమును సన్యసించి. ఆత్మజ్ఞానవిచారణముచేసినయెడల, అదిపరమధర్మమగును. అట్టివిచారజ్ఞానమువలన మోక్షము కలుగుచున్నది. మరియు, గుమ్మడిపువ్వునందుండుతీపువలెను, తేనెయందుండు తీపువలెను, బావియందుప్రతిబింబించి యుండెడి చంద్రకాంతివలెను, కర్మఫలములు ఉంటున్నవి. జున్నువలెను, పూర్ణమగుయేటివలెను, సంపూర్ణచంద్రునివలెను, నిర్మలమగు జ్ఞానమగుచున్నది. అట్టిఆత్మవిచారణజ్ఞానము పరిపక్వమైనపుడు, అఖండమగు ఆత్మసుఖమునిచ్చుచున్నది. గనుక, కర్మమార్గముకంటె, సన్యాసమార్గముశ్రేష్ఠమగును. మరియు, (మోక్షము)కర్మములవలనకలుగనేరదు. ఆత్మతత్త్వజ్ఞానమువలన మోక్షముకలిగెడి విధము జెప్పెదవినుము. నీటియందు ప్రతిఫలించినచంద్రునివలె, అజ్ఞానమందు జీవుడుప్రతిఫలించి, మోహముచేత, తాను సంసారినని అభిమానించియున్నాడు. అట్టితనయొక్క అజ్ఞానముపోవుటచేత, ఆజీవుడే, పరిపూర్ణ సత్యజ్ఞానానంద పరమాత్మ స్వరూపుడగుచున్నాడు. గనుక, అజ్ఞాననాశనము, జ్ఞానమువలన కలుగునేగాని, కర్మమువలన కలుగనేరదు.

## బ్రహ్మచర్యము బ్రహ్మవిద్యాప్రాప్తికి ముఖ్యకారణమని చెప్పుట.

అని వ్యాసుడు చెప్పగా శుకుడువిని, యిట్లనియె. ఓతండ్రీ! వ్యాస మునీంద్రా! జ్ఞానము యెటువంటి జనులకు లభించునో, యెరిగింపుమని యడుగగా, అపుడు, వేదవ్యాసుండిట్లనియె. ఓశుకుడా! గొప్ప అరణ్యమునకువెళ్ళి, ఆయడవియందుండెడి మునులదగ్గిరనిలచి, బ్రహ్మచర్యవ్రతముతోఁగూడిన తపస్సునుచేయుచుండవలయును. అట్లుచేయుచు, తగిన సమయములయందు మునులపర్ణశాలలకువెళ్ళి భిక్షమెత్తుకొని భుజింపుచుండవలయును, మరియు, పరులు, తననుస్తుతించినను నమస్కరించినను గర్వించక, సుఖదుఃఖములనుబొందినపుడు, మనోవికారముజెందక, జనులున్న స్థలమందునిలువక, యుండినయెడల, అదిమంచివ్రతమే యగును. యీవ్రతము ఆత్మజ్ఞానమును కలుగజేయును. అనియిట్లుచెప్పగా, శుకుడిట్లనియె.

ఓతండ్రీ! వ్యాసమునీంద్రా! కొందరు వేదవేత్తలగువారు, కర్మమును నిశ్శేషముగా విడుచుటకు యెవ్వరికిని సాధ్యముగాదనిచెప్పదురు. అట్టిపెద్దలమాటను నమ్మతగదా! అనిఅడుగగా సర్వజ్ఞుండగు వేదవ్యాసుండిట్లనియె. ఓశుకుడా! కర్మమునువిడువకుండుటయు, విడుచుటయుంగలదు. ఆవిశేషములను జెప్పెదవినుము. బ్రహ్మచారియు, గృహస్థుడును, వానప్రస్థుడును, సన్యాసియు, వీరునలుగురును, తమతమ ఆశ్రమములకు విధించియుండెడి కర్మములనుచేయుచు, సిద్ధిబొందెదరు. యీనాలుగాశ్రమములచేత, అరువదినాలుగు విద్యలనెడినిచ్చెనతో, అంత్యమునకు యెక్కవచ్చును. ఇట్లు క్రమముగా నాలుగాశ్రమములనుపొందుట సులభమార్గమైయుండును. మరియు, బ్రహ్మచారియొక్కనడవడికను చెప్పెదవినుము. యిరువదియైదు సంవత్సరముల పర్యంతము బ్రహ్మచర్యవ్రతమందుబ్రాహ్మణుండుండవలయును. ఆబ్రహ్మచారి, గురువుదగ్గిర దాసునివలెనుండి, సర్వదా, ఆగురువునకు యిష్టమగు పనులు చేయుచుండవల

యును. గురువు, భోజనము చేసినపిమ్మట, తానుభుజించవలయును. గురువుపండుకొనునపుడు, ఆగురుని పాదములను తనచేతులతో పిసుకుచు, గురువు నిద్రించినపిమ్మట, తానునిద్రించవలయును. మరియు, గంధము చందనము పుష్పములు మొదలగువానియందు బ్రహ్మచారికి యిష్టముకలుగరాదు. సమయముచూచి, గురునివలన వేదము చదువుచుండవలయును. ఇట్లు బ్రహ్మచారి ప్రవర్తించవలయును. యీ బ్రహ్మచారి, గృహస్థాశ్రమమునందుండెడి విధమును జెప్పెదవినుము. అట్లు, యిరువైయైదు సంవత్సరములవయస్సువచ్చెడి పర్యంతము బ్రహ్మచర్య వ్రతమందుండి, పిమ్మట తనశక్తికొలది గురునకుదక్షిణయిచ్చి, ఆగురువనుగ్రహముపొంది, సమావర్తనమనెడి క్రియనుజేసికొని, వివాహమైన పిమ్మట, సత్యముగా మాటలాడుచు ధనములనుసంపాదించి దేవతలకు హవ్యకవ్యములిచ్చుచు, అతిథులను సంతోష పరచుచు, బంధువులను పోషించుచుండవలయును. అట్లుండి, తనభార్యయందు రమించుచు పుత్రులను కలిగించుకొని, పుత్రులను వృద్ధిబొందించుచు, యిట్లు యిరువదియైదు సంవత్సరములు గృహస్థాశ్రమమందుండవలయు. అప్పటికి యేబదసంవత్సరముల వయస్సు అగును. అట్లుగృహస్థ ధర్మమును నడిపి, అగ్నిహోత్రములను విడువకనే, అడవికిపోయియుండుట వానప్రస్థాశ్రమమనబడును. అట్లువానప్రస్థాశ్రమమందుండి, అడవియందు ఫలించెడి ధాన్యములను, కందమూలఫలములనుదెచ్చి, సన్న్యాసులగు యతులకుపెట్టి పూజించుచు, మిగిలినవి తానుభక్షించుచు, తపస్సుచేయుచుండుట, వానప్రస్థాశ్రమధర్మమగును. ఇట్లుయిరువదియైదుసంవత్సరములు వానప్రస్థాశ్రమమందుండవలయును. అప్పటికి డెబ్బదియైదుసంవత్సరములవయస్సుఅగును. అట్టివాడు, అప్పటికి శాంతచిత్తుడగును. గనుక, అట్లు వానప్రస్థధర్మమునుజరిపి వెనుక, సన్న్యసింపవలయును. అట్లుసన్న్యాసాశ్రమమందుయిరువదియైదుసంవత్సరము లుండవలయును. ఇట్లుమనుష్యునకుగల ఆయువుసంవత్సరములనూటిని, నాలుగు పాళ్లుచేసి ఒక్కొక్క భాగమునకు ఒక్కొక్క

ఆశ్రమమువంతున జరుపవలయును. ఇట్లు జరుపుట శ్రేష్ఠమగు ధర్మస్వ
రూపమగును. ఇట్లుడెబ్బదియైదు సంవత్సరములపర్యంతము, బ్రహ్మచర్య
గృహస్థ వానప్రస్థాశ్రమములు జరుపగా, అప్పటికి పరిపక్వచిత్తుడై, నాలు
గవ ఆశ్రమమగు సన్యాసధర్మమును పొందుటవలన కృతార్థుడగును.
ఆసన్యాస ఆశ్రమముయొక్క పద్ధతిని యెరిగించెదవినుము. సన్యాసియ
గువాడు, ఆత్మయందు అగ్నినికల్పించుకొని, మనోయజ్ఞమును చేయు
చుండవలయు. ఇది, అంతర యజ్ఞమనబడును. మరియు, సన్యాసియ
గువాడు. పరులతోడి మైత్రికలహములు చేయక, పరులవలన యేమి
యుదీసికొనక, నివాసగృహములేనివాడై, వృక్షములక్రిందనివసింపుచు,
ఒంటరిగానుండవలయును. మరియు, కామక్రోధ దుఃఖములులేనివాడ
గుచు, నిందాస్తుతులను తనమనస్సునందు చేరనివ్వక, తానుపరులతట్టు
చూచిమాట్లాడక యుండవలయును. మరియు, తాను, ఆకాశము అం
తటనునిండియుండినట్లు చూచుచుండవలయును. మరియు, తనకు, యేప
దార్థము దొరకినను భక్షింపుచు, యేదైనను కోరిక, యేదియైనను కట్టు
కొని మానమును కాపాడుకొనుచు, యెక్కడైనను పడి నిద్రించుచుండ
వలయును. ఇట్టిసన్యాసినే, బ్రాహ్మణుడని దేవతలుచెప్పుదురు. మరియు,
అట్టిసన్యాసి, జనుల సాంగత్యమును “సర్పమువలె” దలచికొని మాని
యుండును. స్త్రీనిచూచినయెడల “పీనుగవలె” తలచివుండును. విషయ
సుఖములను “నరకమువలె” దలచివిడిచియుండును. మరియు, సకలజంతు
వులపాదములును, యేనుగుపాదములో అణగియున్నట్లు అహింసయందు
సకలధర్మములు నణగియుండును. సన్యాసికి, సకలభూతములయందును
దయగలిగియుండుట పరమధర్మమైయున్నది. ఆభూతదయయే, అహిం
సా స్వరూపమగును. గనుక, సన్యాసియగువాడు, సకలజగత్తులకు సేవింప
దగినవాడగుచు, అమృతముతో తడపబడిన మనస్సుగలవాడై “ఆకాశ
మువలె” కల్మషములేనివాడై, సర్వలోకపూజ్యుడై యుండవలయును.
అని యిట్లు, వ్యాసమహాముని శుకునకుజెప్పి, మరల నిట్లనియె.

శ్లో॥ వందే మను దర్మవిభుం రామం తద్ధర్మపాలకం ।
వేదవిన్యాసకం వ్యాసం కృష్ణం వేదాంత బోధకమ్॥

జీవుడే బ్రహ్మమని యెరింగి భేదబుద్ధి విడిచి సకల జీవులను త నవలెనే సమముగానెంచుచు జీవకారుణ్యముగలిగి మనస్సన్యాసమును బొంది సదా ఆత్మానుసంధానపరుండై యుండుటే బ్రహ్మజ్ఞానము ఈవిష యము దెలియక కొందరువిష్ణువే సర్వేశ్వరుడనియును మఱికొందరు శివుడే సర్వేశ్వరుడనియును వొకరితోనొకరు వాదించుచు ఈర్ష్యాసూయలు గ లవారై ఒకరి నొకరు దూషించుకొనుచుందురు ( జీవబ్రహ్మైక్యము ) అద్వైతుల యభిప్రాయము తప్పనియు జీవుడు పరమాత్మకు దాసుం డనియు ఒకప్పుడున్నూ (జీవుడు) పరమాత్మలో సంయోగముకాడనిన్ని ( ద్వైత ) సిద్ధాంతులు తమశిష్యులకుబోధించియున్నారు అద్వైతుల నుద్వైతులు పరిహాసము జేయుచున్నారు గనుక ఈగ్రంధములోనిశ్రు తులనున్నూ పూర్వము ఋష్యాదులయేర్పాటులున్నూ భగవద్గీతలలో ని మర్మములున్నూ భారత భాగవతములలోని వ్యవహారములు చక్క గాగురువులవల్ల దెలిసికొనినవారలు ద్వైతమతాచార్యులబోధ నంగీ కరించుటలేదు శరీరమునెడి తోటలోనుండు ప్రాణాదివాయువులు శల్యిం చుచుండును అట్లుశల్యించుచుండు కాలమునందు శరీర మాద్యంతమును వ్యాపించియుండు ధనుంజయవాయువు మాత్రము యెప్పుడును శరీరము నందుండి తప్పించుకొని యధాస్థానమునకు పోదునాయని చింతించును గాని మనస్సు తనస్థానమునకే చేరును. అట్లే అద్వైతవిధ్యావిశారదుం డగు జీవుండు బ్రహ్మములోనైక్యమగు సాధనస్థిరపడి పరబ్రహ్మమునందు కలియుస్థితిని బొందును.

గీ॥ ఆకసముమాట్కి చిత్తము నడ్డగించి ।
నిర్మలజ్ఞానపరిపూర్ణ నిలయమందు ।
నాత్మదర్శన పరతత్త్వమందవలెను ।
ఆగమాంతర్య నరసింహ యోగివర్యా॥

తా. ఆకనము యుంమనట్లుగా చిత్తమును స్వాధీనముచేసుకొని ఆత్మదర్శన మందుచుండిన పరతత్త్వమందవచ్చును.

శ్రుతి॥ సోకామో నిష్కామో ఆప్తకామ ఆప్తకామో నతస్య ప్రాణా ఉత్క్రామంత్యత్రైవ సమవలీయంతే॥ బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి అశరీరో నిరింద్రియో అప్రాణోహ్య మనస్సచ్చిదానంద మాత్ర స్సస్వారాడ్భవతి॥

తా. బ్రహ్మమేఆత్మ ఆత్మయేబ్రహ్మమని అభేదఐక్యజ్ఞానముగ లిగి ఆత్మధ్యానముచేయుచుండు బ్రహ్మజ్ఞాని మరణించినతోడనే శరీరము యింద్రియములు ప్రాణము మనస్సు మొదలయినవి లేనట్టివాడై కేవలనిరాకార సచ్చిదానందపరబ్రహ్మమునందు ఐక్యమగుచు ఆపరబ్రహ్మమే యగుచున్నాడని అద్వైతులు వేదోక్తులున్నూ అనుభవమున్నూ వొప్పుకొని దృఢచిత్తులై యుండెదరు.

శ్రుతి॥ పరజీవోపాధీ మాయావిద్యే విహాయ తత్త్వంపద లక్ష్యం ప్రత్యగ్భిన్నం బ్రహ్మ తత్త్వమసీతి॥

తా. మాయాప్రతిబింబమగు ఈశ్వరునికి అధిష్టానమైన సాక్షిగానుండు చైతన్యమే ( పరమాత్మ ) అంతఃకరణ ప్రతిబింబమగు జీవునకు అధిష్టానమై సాక్షిగానుండు చైతన్యమే ( ప్రత్యగాత్మ ) ఒక్క ఆకాశమే ఘటోపాధివలన ఘటాకాశమనియు మఠోపాధులవలన మఠాకాశమనియు గృహోపాధివలనగృహాకాశమనియు గోపురోపాధివలన గోపురాకాశమనియు నానావిధములుగా చెప్పంబడును ( పరబ్రహ్మమగు ఆత్మ ఒక్కడే ఈ జీవజంతువుల శరీరములందు వసియించుటవలన ప్రత్యగాత్మయనియు బ్రహ్మరుద్రేంద్రాదుల శరీరములయందు వసించుటవలన ( పరమాత్మ ) యనియు చెప్పంబడును మహాకాశమే ఘటాకాశమైనట్లు ఘటాకాశమే మహాకాశమైనట్లుగా ప్రత్యగాత్మయే పరమాత్మగాను పరమాత్మయే ప్రత్యగాత్మగాను సమరసైక్యమును బొందుచుండును. ఈరెంటికిన్ని సత్యజ్ఞానానందలక్షణములు సహజములుగాన

ఇవిఏకమేగాని ఏమాత్రమున్ను భేదములేదు. అయితే మేఘజలమునందు ప్రతిబింబించిన ఆకాశమున్ను కల్పితంబగుటవలన దానికి ఐక్యముగలుగం జాలదు యిట్లుమాయయందు ప్రతిఫలించిన ఈశ్వరుడున్ను అంతఃకరణ ములయందు ప్రతిఫలించినజీవుడున్ను ప్రతిబింబములగుచు మిథ్యాస్వ రూపములగుటవలన రెంటికి ఐక్యము గలుగంజాలదు కాబట్టి జీవస్వరూ పంబుకల్పితంబు ఆత్మస్వరూపమే నీ నిజస్వరూపముగాన నీవు జీవుడను భ్రాంతినివిడిచిపెట్టి నీవుప్రత్యగాత్మవని నీవే పరమాత్మయని సమరసై క్యము పొందుచుండందగు. ఇదే సత్యముగా పరబ్రహ్మసంక్షేపముగా నెఱుంగుము.

వి. సాధారణముగా ఎల్లవారికిగలుగు అవసానకాలము బ్రహ్మ వేత్తకు మృత్యువుగాజాలదు బ్రహ్మనిష్ఠయందు దేహము మఱచి యుం డుటే మృత్యువు తటాకజలమునందు పాచినియెంతదూరము పోగొట్టినను మరల వెంటనే ఆపాచి యథాప్రకారముగా ఆనీళ్లను కమ్ముకొనునట్లు ఎంతటి బ్రహ్మవేత్తయైనను బ్రహ్మనిష్ఠాభ్యాసమునందు శ్రద్ధలేనివారికి సదా కుగానున్నప్పుడు మాయావరణ విక్షేపస్వరూపమునగు మాయ అప్పుడ ప్పుడు ఆవరించుచుండును అట్టిస్థితిలోనుండు బ్రహ్మజ్ఞానిని జన్మమరణము లకు దెచ్చుచుండునుగాన నీవు వొకప్పుడైనను బ్రహ్మ నిష్ఠాభ్యాసము మఱవకుమని ఆశీర్వదించి ( అహం బ్రహ్మాస్మి ) అని ఆత్మానుసంధానము జేయుచు అభేద దృష్టిచేత వర్తించుచుండుమనెను గదా యని శుకుల వారికి వ్యాసుండుపదేశించిన నీరహస్యమును ధర్మరాజునకు భీష్ముండు పర బ్రహ్మ సంక్షేపముసు సంపూర్ణముగా దెలిపిరి.

క॥ ముక్తినిగోరితివాగద భక్తికిమార్గంబుగురుని భావించుటయా ।
సక్తిని హృద్యాభాషణగురు భక్తిని సశరీరముక్తి బడయగవచ్చున్॥

క॥ హితమతి నీకృతివ్రాసిన సతతము వినజదువజూడ సంపదలమరున్ ।
వెతలెల్లదీరు సతిసుత మతిసౌఖ్యము గల్గుభువిని మనుజులకెల్లన్॥



ఓం.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

## ౫. పరమాత్మ సంహితము.

### సర్వేశ్వర ప్రార్థనము.

క॥ శ్రీమించుసదాశివునిఁ బ్రేమించెద శంకరునకు బ్రియభక్తుడనై ।
భూరిమధ్యభుజగభూష శ్రీమూర్తిని నిలిపికొలతు స్థిరమతితోడన్॥

### సరస్వతిదేవి ప్రార్థనము.

క॥ ధీరస్తుతముల్ మంజు స్వారములై నాదువచన జాలములలరన్ ।
నారదపారదమూర్తిన్ శారదభజియింతునెమ్మి సంరంభుడనై॥

### గణేశ్వర ప్రార్థనము.

క॥ గజముఖునారాధించెద గజకర్ణుని విఘ్నపతిని గౌరీతనయున్ ।
త్రిజగత్పూజ్యునిస్కందాగ్రజు లంబోదరునిరంతరంబునుమదిలోన్॥

### స్వగురుస్తోత్రము.

క॥ శ్రీగురుకరుణన్ తత్త్వము
బాగుగరచియింపబూని భయనయములనా ।
నాగమ వేద్యగురూక్తము
యోగులకిదిసులభమగు నుత్సాహముగాన్॥

క॥ మృదువచన రచననార్యులు విదితంబుగ దెల్పిరదియె వివరించెదనే ।
తుదిమొదలుగురుతు లేనిదిఇదెయదియనిభావపరమునిలభక్తులకున్॥

### బ్రహ్మజ్ఞాని అసంగుడనుట.

శ్లో॥ జ్ఞాతామనోహం కృతివిక్రియాణాం దేహేంద్రియప్రాణకృతక్రియాణాం అయోగ్నివత్తా ననువర్తమానో నచేష్టతే నోవికరోతి కించన.

తా. ఇనుమునందు (అగ్ని) సమ్మంధించి ఆ యినుమువలెనే గుండ్రము నిసుపు మొదలగు వికారములు గలిగినట్లు తోచుచున్నను యదార్థముగా ఆవికారములు ( అగ్ని ) కి లేనట్లున్ను మరియు కరమల

వాడు ఆయినుమును సుత్తితో గొట్టుచుండగా ఆదెబ్బలు దానికి లెగు లునుగాని అందుసంబంధించియుండు (అగ్ని) కి కొంచమైనను తెగలనట్లున్ను అహంకారమునకే చంచలత్వ కర్తృత్వాదివికారములనియు ఆకలి దప్పులు ప్రాణవాయువుయొక్క ధర్మములనియు చూచుట వినుట స్పృశించుట నడుచుట మాట్లాడుట ఇచ్చుట భోగించుట మలమూత్రములువిసర్జించుట మొదలగుకార్యములు చేయక దేనితోడ సమ్మందించక కేవలసాక్షిగానున్నాడని తెలిసి తనలోతాను ఆనందించుజ్ఞాని ఆయహంకార ప్రాణదశేంద్రియములను అనుసరించి వాటి వికారములున్ను కార్యములున్ను తాను చేయువానివలె తోచుచున్నను సదా తాను ఏవికారములు లేక ఏకార్యముచేయక దేనినియనుభవించక అకర్తగా అభోక్తగా సాక్షిమాత్రుడై బ్రహ్మస్వరూపుడుగానె యుంటున్నాడు స్వదృష్టివలన తన్నుదా జూచుచు బ్రహ్మానందస్వరూపుడై యుండును గాన (అన్యదృష్టికి) ఆత్మజ్ఞాని స్నానశౌచాదికార్యములు చేయువానివలె తోచుచున్నను అందు వలన అతనికి యేమి భాదలేదు అగ్నివలె యెఱ్ఱగానుండుటవలన భ్రమించి దానిని అగ్నియని భావించి నప్పటికిన్ని దానికి అగ్నివలె దహించు శక్తిలేనట్లు లోకులకంటికి (ఆత్మజ్ఞాని) సకల వికారములున్ను సంసారధర్మములున్ను కలవాడుగాదోచినను యథార్థముగా అతడు యేవికారములేక సంసారిగాక కేవల బ్రహ్మస్వరూపమునందే ఆనందించువాడగును.

## పరమాత్మ ధ్యానము.

శ్లో॥ అంగుష్టమాత్ర మాత్మాన మధూమజ్యోతి రూపకమ్ ।
ప్రకాశయంత మంతస్థం ధ్యాయేత్కూటస్థ మవ్యయమ్॥

తా. అంగుష్టప్రమాణముగలవాడు పొగలేని జ్యోతిస్వరూపము గలవాడు, హృదయమునందుండి (సర్వమును) ప్రకాశింప జేయువాడును, నాశములేనివాడును, అగు ఆత్మయైన (కూటస్థుని) ధ్యానముచేయుచుండవలయును.

వి. పరమాత్మను హృదయ కమలమునందు భావింపవలయును ఇదే పరమాత్మస్థానము. (కూటస్థుడనగా) నిర్వికారస్వరూపుడు (అసంగుడు) అంగుష్ఠప్రమాణమనియును జీవుడు అణుమాత్రుడుగాను హృదయ మధ్యంబున నిలిపి సదాధ్యానము చేయుచుండందగు శబ్దార్థ జ్ఞానముల జ్ఞాపకము మరచి ధ్యాన వస్తువును మాత్రము అభిముఖమై యుండునట్లు నిర్వికల్ప సమాధిలో ధ్యానించందగు (అధ్యాత్మ) ప్రసాధమగును లోకములో నిదివరకు జరిగియున్న సకలవ్యాపారములు ఒక్కమాఱుగా తనలో (ఆత్మలో స్ఫురించును) క్రమేణచిత్తము దృఢమైన స్థిరత్వమును కొచ్చును బుద్ధినిర్మలమైనదో వికల్పము నొందదు సత్యముతోగూడిన ప్రజ్ఞగలిగియుండును ఆత్మప్రజ్ఞ కలవాడు నిజస్వరూపమును చక్కగా తెలుసుకొనువాడై యోగమునందు ఆయత్తమైన స్థితిని పొందును చిన్మాత్రుడైన పురుషునియొక్క విశిష్ట స్వరూపము ప్రత్యక్షముగా తెలియును బహిర్ముఖ జ్ఞానమును నిరోధించవలెను చిత్తము చలించుటవలన సంసారము గలుగుచుండును నిర్మలమైన (మోక్షమే) యగుచుండును శరీరములోని రోగము నివర్తిచుకొరకు ఔషధ మెట్లవశ్యమో అట్లు గురువైన వైద్యుని వెదకి యోగామృతరసమనెడి ఔషధమును భుజించి (మోక్షమును) అనగా (పరబ్రహ్మానందసుఖమును) అనుభవించవలెను.

తా. పరమాత్మ ఆకారముకలదికాదు యెవ్వడు రాగద్వేషాదులువదలుచున్నాడో వాడే (కేవలుడు మంగళాకారుడు) అగు (పరమాత్మ అనగా జీవాత్మపరమాత్మలకు) భేదములేదని యెరుగుచుండందగు.

శ్లో॥ సర్వం జగద్విద్ధి నిరాకృతీదం సర్వం జగద్విద్ధి వికారహీనం।
సర్వం జగద్విద్ధి విశుద్ధదేహం సర్వం జగద్విద్ధి శివైకరూపం॥

తా. ఈసమస్తము ఆకారములేనిది పరబ్రహ్మము గానెరుగుము ప్రపంచము వికారములు మాయ గనుక అనిత్యము శరీరములేని (పరమాత్మ) నిత్యము కేవలుండును మంగళాకారుడును అయియున్నాడు గను

కే సదానిశ్చలసమాధిలో బ్రహ్మతన్మయ ఉచ్చగలిగిన నీవే (పరమాత్మ) సందేహము లేదని భావము.

తే॥ బ్రహ్మవిజ్ఞాన సమష్టిసృష్టి భవహరంబు।
బ్రహ్మభూతాంతి సాధ్యంబె పరవశంబు।
బ్రహ్మమందైక్య మగునాత్మ పరవశంబు।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

తా. బ్రహ్మమందు ఐక్యమగుట విశేషానందము భవహరంబుగా నెరుంగవలెను.

శ్లో॥ కేవలతత్త్వనిరంతరసర్వం యోగావియోగా కథమిహసర్వం
ఏవం పరమ నిరంతర సర్వం ఏవం కథమిహ సారాసారమ్॥

తా. సమస్తస్వరూపుండగు తాను అద్వితీయుడును తత్త్వస్వరూపుడును నిత్యుడును సమస్తస్వరూపుండగు పరమాత్మయని తెలిసికొనునట్లయితె సుయోగవియోగము లెక్కడివి, జ్ఞానాజ్ఞానము లెక్కడివి, తాను ఉత్పత్తి మయినదియు నిత్యమయినదియు సమస్తమయినదగు (పరమాత్మ) అని తెలిసికొనునట్లయితె రసవిరసములు లెక్కడివి అని భావము.

గీ॥ సత్యసౌభాగ్యమునుగోరి సద్వజింపు।
నిత్యనిరతిశయానంద నిపుణుడగుచు।
సత్యసమమగు జ్ఞప్తికి సాక్షియగును।
రమ్యగుణభోగినరసింహరాజయోగి॥

గీ॥ తనకుదాస్వప్రకాశమై వనరుబయలు।
మఱిగియుండుము నిత్యమా మార్గమిదియె।
సత్యమానందపరిపూర్ణ ప్రత్యగాత్మ।
రమ్యగుణభోగినరసింహ రాజయోగి॥

గీ॥ ఆత్మ పరిపూర్ణబోధుడై యుంటిబ్రహ్మ।
ముండియాడెను నిజరూప మూనిబట్టి।

పండువెన్నెల బయలందె బ్రాకసగును।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

గీ॥ బ్రహ్మమయమందె విశ్వంబు బ్రహ్మమందె।
లయముగావించి మఱినిలిపి లక్షణముగ।
చింతజేయుచు నుండుటే చిన్మయంబు।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

గీ॥ రాజయోగీంద్రు డెప్పుడు రమ్యముగను।
యాత్మభావము తనలోన నైక్యమొనర।
జెంది పరవశుడై భువి జెలగుచుండు।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

గీ॥ అచలయోగంబు నందాత్మ రుచిరముగను।
నిలిపి నిర్గుణపూర్ణుడై నిమ్మళంక।
బ్రహ్మనిర్వాణ పదవిలో బ్రబలుచుండు।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

గీ॥ సర్వపరిపూర్ణ చిత్కళా సారమాని।
సత్యమబ్రహ్మ మందెడు శక్తిబూని।
సర్వమందును నచలుడై సన్యసించు।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

గీ॥ సకలదృశ్యంబు నెల్లను సమయజూచి।
నీవు పరిపూర్ణమాగురి నెఱయజూడు।
లింగజీవైక్య సంధి ప్రసంగమదియె।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

గీ॥ తానునేనను మానాభి మానముడిగి।
బూని మదమత్సరాబ్ధిలో బొనగనీది।
స్వానుభవతీర నిర్గుణ సారమాను।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

గీ॥ శ్రీసదానందమగు ప్రశస్తి చెదానినక ।
నిత్య నిర్గుణబయలంద నేర్పుతోడ ।
సత్యమగు తేజమందుచే శాశ్వతంబు ।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

గీ॥ చిత్రదీపమున నతమను చెడనిమాటికి ।
చిత్రదీపంబు వలెనిల్పి చెనకరయాత్మ ।
నిష్ఠతోజూడు దృఢమైన దృష్టిబూని ।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

శ్లో॥ సాకార మనృతం విద్ధి నిరాకారంతు నిశ్చలం ।
ఏత త్తత్వోపదేశేన పునర్భవసంభవః॥

తా. రూపముతోగూడిన ప్రపంచమునందలి సమస్తపదార్థములు అబద్ధము, ఆకారములేనట్టి పరబ్రహ్మ మొక్కటియే స్థిరమైనదను జ్ఞానోపదేశమువల్ల పునర్జన్మరహిత మగుచున్నది అనగా (జీవన్ముక్తి) యని యెరుంగనగు.

వి. ఆత్మసమాధి అనాత్మసమాధి విశిష్టసమాధి ఇవియన్నియు తెలియుట దృఢచిత్త మమరువరకె పిమ్మట అవశ్యములేదని సమస్త ప్రపంచకోటి నొక్కటియేయను నిశ్చయించునట్టులయిన (ముక్తిస్వరూపమగు సాక్షాత్కారము) (తానే) యనుభవించుచుండును శరీరములేనిదియు ఉత్పత్తిలేనిదయు నాశములేనిదియు ఛేదములేనిదియు నగు (జ్ఞానస్వరూపము) నీవే యగుచుండగా (కేవలపరమాత్మనునెఱుగుదుననియు) నెఱుంగననియు తలంచుచుంట భ్రమలోచేరునుగదా తత్త్వమసి అహమస్మి సర్వం ఖల్విదంబ్రహ్మ అహంబ్రహ్మాస్మి ప్రజ్ఞానంబ్రహ్మ మొదలగుమహావాక్యములు జీవాత్మయేపరమాత్మయని జెప్పంబడుచుండగానిట్టిఅభేదజ్ఞానము అనిత్యమైనశరీరము నేనుగానని వేదంబులు మొరవెట్టుచున్నవి.

శ్లో॥ సాకారాంచ నిరాకారం నేతినేతిచసర్వదా ।
భేదభేద వినిర్ముక్తో వర్తతే కేవలశ్శివమ్॥

వి. తాను కేవలుడును తత్త్వస్వరూపుడును నిరంజన స్వరూపుడును సర్వాత్మకుండునైన (పరమాత్మ) (ఆకాశముబోలి) సంగాసంగము లేనట్లు అనురాగ విరాగములులేనట్లు ( సమాధిలోగాని నిర్గుణ ప్రజ్ఞలోగాని ) తన్మయమందుచుండి నట్లులయి నిగమగోచర ( పరమాత్మ ) యే యగుచుండును అట్టి సుఖానుభవసిద్ధిగలవాని మనస్సుచే గల్పింపబడిన సహజానందము శుద్ధజ్ఞాన సమస్వరూపంబగు సుఖానుభవమందే లయమందుననిభావము.

గీ॥ ఆదిమధ్యాంతమనగాని దచటస్ఫూర్తి।
లేదులేదనిమదిదోచె లేనిజగము।
పాదుకొనిపూర్ణమైయుండు నాశమేల।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

గీ॥ అద్వితీయోహమనగ సనాతనంబు।
నిత్యశుద్ధోహమనునది నిర్మలంబు।
స్వప్రకాశ శివోహమే శాశ్వతంబు।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

గీ॥ ఏకమేవా ద్వయో బ్రహ్మ మితిఘటించి।
ఖల్విదం బ్రహ్మసర్వంబు గాస్మరించి।
సర్వసమమగు గురిజేసి శాశ్వతంబు।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

జీవన్ముక్తి.

శ్రు॥ ప్రజ్ఞాన ఘన ఏవైతేభ్యో భూతేభ్యస్సముత్థాయ తాన్యేవాను ప్రవిశ్యతి నప్రేత్య సంజ్ఞాస్తి॥ అవినాశివా రేయమాత్మాను చ్ఛిత్తి ధర్మేతి॥ మాత్రా సంసర్గ స్త్వస్య భవతి॥

తా. ప్రారబ్ధకర్మము నశించినతోడనే దేహేంద్రియాదులు నశించును అప్పుడు ఆత్మ తనకు గలిగిన జీవత్వాభిమానమునశించి తాను నిత్యముక్త పరబ్రహ్మస్వరూపముగానే యగుచున్నాడు అట్టిమోక్షదశ

యందు (అంతఃకరణప్రతిబింబమగు చిదాభాసుడను జీవుండు నశించిపోవు చున్నాడు) అనగా బ్రహ్మమునందు లయించిపోవుచున్నాడు. కర్తృత్వభోక్తృత్వ వికారములులేక సాక్షిమాత్రముగానుండు టవిదేహముక్తి యనబడుచుండును. ప్రారబ్ధకర్మము నశించినతోడనే దేహేంద్రియాదులున్నూ చిదాభాస జీవుడున్నూ నశించి ఘటము పగిలినతోడనే ఘటాకాశము మహాకాశములో గలసినట్లు ఆత్మ పరబ్రహ్మమునందు గలిసి అభేదబ్రహ్మస్వరూపమగుటచే (విదేహముక్తియనియు, విదేహకైవల్యమనియు,) చెప్పంబడుచుండును. కాబట్టి వ్యవహారికమందు సత్యముగా ఒక్కొక్కమనుష్యుడున్ను తాను మోక్షము జెందుటకుగాను గురుభక్తి దేవతాభక్తి జీవకారుణ్యము వైరాగ్యము వేదాంత శ్రవణమననాదులు చేయుటవలన పరమాత్మ సంసిద్ధి గలుగుచుండును.

గీ॥ మానజపవృత్తిలోనైన మరుగుజేరి ।
నిరతమాత్మ చిదానంద నిలయమందు ।
భోగపరవశుడై యుండు పూర్తిగాను ।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

గీ॥ జూచునెడ బ్రహ్మమయముగా జూడనగును ।
వినికి నిశ్శబ్దపరిపూర్ణ విలయమందు ।
తలపు సర్వత్ర బ్రహ్మమై దనరజూడు ।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

గీ॥ కుంభగతదీపశోభాని కుంభలీల ।
త్రిపుటిపై జూట్కి నిల్పుచు దృఢముగాను ।
మిన్నకుండుము నీలోన నిన్ను దెలసి
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

శ్లో॥ యత్రతత్ర మృతో జ్ఞానీ యేనవాకేన మృత్యునా ।
యథాసర్వగతం వ్యోమ తత్రతత్ర లయంగతాః ।
ఘటాకాశ మివాత్మానం విలయం వేత్తితత్త్వతః॥

తా. జ్ఞానియైనవాడు ఏస్థలములయందైన యేవిధముగా మృతి నొందినను, సర్వత్ర వ్యాపించియుండు ఆకాశమువలె, ఆస్థలమునందే లయమొందుచున్నాడు. వాస్తవముగా (మహాకాశమునందు కలిసిపోవునట్లు) ఆత్మపరమాత్మలో లయమొందును. శుద్ధముగా బ్రహ్మోపాసనము చేయువాడు ఎచ్చటకుపోవుట లేదు, ఆబ్రహ్మజ్ఞానియొక్క జీవము అనగా ప్రాణము జలమునందు వుప్పు గలిసినట్లు పరమాత్మయందె గలిసిపోవుచుండును.

గీ॥ నీదు మదిక్షేత్రమా ప్రజ్ఞ పాదుగనుము ।
కష్టమగుయోగసంసిద్ధి తుష్టిపరచి ।
పరమహంసను గీలించి ప్రాజ్ఞుడగుము ।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

గీ॥ పలికి పలుకడు తానైన బ్రహ్మవేత్త ।
జూచిచూడడు తనలోని చోద్యములను ।
వినియు వినవాడు వేషుడై వెలయుచుండు ।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

గీ॥ వేదవిద్యావిధుడు యోగి విధమెరింగి ।
కోరి ప్రాణాదివాయువుల్ గుదయుబట్టి ।
మిన్నకుసుమసీలోన నిన్ను దెలసి
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

క॥ ఇదిమోక్షపదవిజూపును । చెదరనిహితమతినివ్రాయ చేకురుపుణ్యం ।
బిదివినజదవినవారికి । బదిలంబుగ యోగసిద్ధి ఫలమగుచుండున్॥

పరమాత్మ సంహితము సర్వము సంపూర్ణము.

ఓమ్.

శ్రీరామచంద్ర గురు పరబ్రహ్మణేనమః.

## ౬. కైవల్య సంభోగము.

### సర్వేశ్వర ప్రార్థనము.

క॥ శ్రీమించుసదాశివుని । ప్రేమించెదశంకరుడు ప్రియభక్తుడనై ।
భ్రూమధ్యభుజగభూష । శ్రీమూర్తినిలిపికొలతు స్థిరచిత్తమునన్॥

### సరస్వతీదేవి ప్రార్థనము.

క॥ వాణిన్ వీణాపుస్తకపాణిన్ బొమ్మిట్టిరాణి బాలిక భక్తశ్రేణిన్ ।
మాద్యద్భ్రమరీ వేణిన్ వినుతింతుమనని విచ్చలవిడిగాన్॥

### గణపతి స్తోత్రము.

క॥ శ్రీగణనాథుగజాననుయోగిజనధ్యానగమ్యునూర్జితకరుణా ।
సాగరుమ్రొక్కెదగావ్యము బాగుగనెరవేరియిలను ప్రాగ్భారముగన్॥

క॥ గురుపాదమందుభక్తిని సరిగాగురినిల్పియోగసౌఖ్యముగంటిన్ ।
గురుడద్వైతశిఖామణి దరిజూపుదిగంబరుండు తథ్యముగాగన్॥

### జీవన్ముక్తి లక్షణము.

శ్లో॥ క్రియానాశాద్భవేత్ చింతానాశో స్మాద్వాసనా క్షయః వా
సనా ప్రక్షయోమోక్షః స్సజీవన్ముక్తి రిష్యతే॥

తా. సకల వ్యాపారములు నశించినయెడల చింతలేకుండును, చింతలేకుండుటవలన వాసనాత్రయము నశించును, అట్లునశించుటే జీవన్ముక్తియనబడును.

వి. బ్రహ్మమునందు లీనమైన బ్రహ్మవేత్త నిర్వికారుడుగాను నిష్క్రియుడుగానుండును. బ్రహ్మమేఆత్మయనియు, ఆత్మయేబ్రహ్మమనియు, తత్త్వవిచారణచేత దెలిసి సమరసైక్యభావమునొంది సకలసంకల్ప

ముంబునశించి సకలమున్మఱచి తానుతానై కేవలసాక్షిమాత్రమైయుండు వృత్తియే (ప్రజ్ఞయనంబడు) అట్టిప్రజ్ఞగలవాడే జీవన్ముక్తుడు, బ్రహ్మముకున్నూ ఆత్మకున్నూ భేదమొకప్పుడైనను కలుగనేరజాలదు. బ్రహ్మమేఆత్మ,ఆత్మయేబ్రహ్మము, అనియెవనిజ్ఞానముచేత మెఱుగుచున్నాడో వాడేముక్తుడు, దూషణ భూషణ లేనివాడై సర్వత్ర సమబుద్ధిగలవాడే జీవన్ముక్తుడు.

శ్రుతి॥ పురుషస్య సుఖదుఃఖాది లక్షణ చిత్తధర్మః క్లేశరూపత్వాత్ బంధో భవతి తన్నిరోధనం జీవన్ముక్తిః॥

తా. నేనుయజమానుడను సర్వము నావల్ల జరుగుచున్నది యనెడు (అహంకారము) గలిగిజేయుట (కర్తృత్వ)మనంబడును. ఆఫలము ననుభవించుట (భోక్తృత్వ)మనంబడును. మనస్సుచేతనే నానావిధసుఖదుఃఖము లనుభవించబడుచున్నవి గాన నేను యేదిచేయుట అనుభవించుటలేదని సాక్షిమాత్రుడనని మనోవికారములనాశముచేసి కేవలసాక్షిమాత్రుడై చిన్మాత్ర బ్రహ్మముగా నుండుటే జీవన్ముక్తి యనంబడును.

వి. వ్యాపార శూన్యముగానున్న జీవన్ముక్తుడు గానేరడు.

శ్రుతి॥ ప్రారబ్ధకర్మ పర్యంతం మహి నిర్మోకవత్ వ్యవహరతి చంద్రవచ్చరతే దేహిసముక్త శ్చానికేతనః॥

తా. ప్రారబ్ధకర్మము నశించువరకును ఎట్టివారికిని దేహమునశించదు గాన జ్ఞానిప్రారబ్ధమునశించువరకు దేహధారియైయుండును. కోసినపైరు మరల మొలవకుండా యున్నట్లు జ్ఞానాగ్నివలన యిఖను పునర్జన్మమురాకుండాజేసుకొని పున్నమచంద్రునితీరుగా నిష్కళంకుడై కుమ్మరపురుగురీతిగా బురదనంటనియట్లు సంసారమునంటక వశీకృతమాన సేంద్రియుడై సుఖదుఃఖములువచ్చినను సంతోషమున్నూ చింతయులేనివాడై ప్రాప్తించినవాటితో సంతోషించుచు సదా బ్రహ్మైకాత్మ్యాను సంధానుడైయుండు నతడే జీవన్ముక్తుడని జెప్పంబడు.

వి. సర్వలోకస్తులచేత స్తుతించబడ్డవాడై యధేశ్చగా నిర్భయ ముగాబట్టబయలైన (బ్రహ్మైకంవినా బ్రహ్మమే) నేననిబుద్ధినిలిపిసర్వము తానని సహజామనస్కయోగనిద్రాపరుడై అఖండానందవృత్తిలో నుండు జ్ఞానియే (జీవన్ముక్తుడు) సర్వమునూ సంపూర్ణుని యందైక్యమగుచు న్నాడు. జ్ఞానాజ్ఞ చేతగ్రమున్ శరీరమును విడిచిన యెడల అట్టిశరీరమునకు కర్మక్రియలు చేయరాదు సమాధిక్రియలు చేయవలయును అటిజ్ఞానులు మరణించిన తర్వాత శుద్ధనిర్గుణ నిరాకార సంపూర్ణ బ్రహ్మమునందు కలిసి అఖండముగా యేకమైపోవుదురు. ఇదియే (విదేహముక్తి) విదేహ కైవల్యమనంబడును.

శ్రుతి. విశోకా వైరాగ్యా దపివోషనమయే కైవల్యమ్ ।

తా. అ (విశోకా) నామకసిద్ధియందు వైరాగ్యము కలుగుట వలన రాగాదిక్లేశములకు కారణమైన అవిద్యానాశనమై ముక్తికలుగును.

వి. (విశోకా) సిద్ధియందు వైరాగ్యముచే క్లేశాదులు బీజమై నఅజ్ఞానము క్షీణమైనందువలన నిరతిశయానంద స్వరూపమైన కైవల్య ముసిద్ధించుచున్నది. వశిష్టులవారు (శ్రీరామమూర్తికి) దెల్పిన శాంబరి కోపాఖ్యానంబున చపలమనస్సు నశించుటే కైవల్యమునకు మార్గమని దెల్పియున్నారెట్లనగా భూమియందు నూరామడలుగల ప్రదేశము ఒక గోవుపాదముకొలదియగు ప్రదేశముగాను గోష్పాదముభూమి శతయో జనముల నిడుపుగలదిగానగును మనోవిలాసమునందు కల్పములయొక్క సమూహము క్షణకాలమై తోచుచుండునను అనగా జాగ్రదవస్థయం దుగలిగిన (అరఘడియకాలము) స్వప్నావస్థయందు (యాభై అరువై సంవత్సరములు) జీవించియున్నట్టు (అనేకకార్యములుజేసినట్టునూ) (జాగ్రదవస్థయందు) స్వల్పకాలమగుచుండును కాబట్టి (జాగ్రస్వప్న ములు) మనఃకార్యములని నిగ్రహించుమని బోధించియున్నాడు మనో జాలములనుగురించి (హరిశ్చంద్రమహారాజు) వంశంబున (లవణ మహా రాజు) కధను (శ్రీరాములవారికి) వశిష్టుండు బోధించినదెట్లనగా ఒక

నాడు ( లవణమహారాజు ) సింహాసనముమీదయుండి నిండుపేరోలగం బున ఆకాశమందు పౌర్ణమచంద్రునివలె ప్రకాశించుచుండెను. అట్టికా లమందు ( శాంబరికుండొకడు ) ఆరాజసభకు ( జయము కలుగుగాక యనుచు) వచ్చిరాజుయెదటనిలిచి ( ఓరాజా ) నేనొకచమత్కారమును జూపించెద జాగ్రతతోజూచిన జనులు భళీభళీయని మెచ్చుచుందురు. గాన అట్టి విచిత్రమును తమకే జూపెదనని పలికి తనచేతనున్న ( నెమిలి కుంచను ) రాజుతలపై ద్రిప్పెను. ద్రిప్పినతోడనే సూర్యకాంతికి సమము గావెల్గుచున్న నొకగుఱ్ఱపువాడు గుఱ్ఱముతోకూడా రాజుకంటికి గోచ రుండాయెను. ఆకనుపడిన గుఱ్ఱపువాడు రాజునుజూచి ఓరాజా స్వర్గమం దలి (ఉచ్చైశ్శ్రవముతోడ సమానమైన యీగుఱ్ఱమును) నన్ను రక్షించు నట్టిరాజు నీకుయిచ్చిరమ్మనెను కాబట్టి దీనిపరిగ్రహింపుమనగా రాజు సం తసించి ఈగుఱ్ఱమువల్ల గలుగు మహిమను జెప్పుమనగా యీగుఱ్ఱము నెక్కినతోడనే లోకమంతయు సంచరింతువు తలచినచోటికి చేర్చును. అనిపల్కినతోడనే ( ఆలవణమహారాజు ) అశ్వమును స్వప్నప్రాయము లో భ్రమావస్థయందు దేహవ్యాపారముమాని ధ్యానమందు రెండు మూడు నిమిషములు మూర్ఛిల్లిగనుచుండెను. ఆయింద్రజాలకుని మైక మందు (లవణమహారాజు) రెప్పవేయనిచూపుచేత మైమరచియుండుట సభవారెల్లరింగి నిశ్శబ్దులై సమర్థతలేనివారై యుండిరి. యిట్లు రెండు ముహూర్తములవరకు సింహాసనమున రాజు వ్యాకులచిత్తుడై మైకంబు గానుండి భ్రమనుజెంది మేల్కొని అంతలో తానుగన్న ఆశ్చర్యమును సభవారికి దెలియజెప్పె. ఓసభికులారా! ఆనందామృతముతో గూడిన స్థిరచిత్తులరై ఆకర్ణింపుడు. ఈక్షణమందు నేజెప్పబోయెడి నీయింద్రజా లమహిమను నేను మైకముజెందినతోడనే మహాచిత్రమయిన గుర్రము వచ్చె. దానిచూచినతోడనేనేనుయెక్కితి. నేయెక్కినతోడనే వేటాడుట కుబుద్ధిపుట్టె. ఆగుఱ్ఱము అతివేగముగా పరుగెత్తి దూరముగా తీసుకొని పోయె. పదునాల్గులోకములుత్రిప్పె పక్షివృక్షసమూహశూన్యమైన బ్ర

హ్మాండముజేర్చె. అక్కడమంచుతోగూడిన అడవిగాదోచె నిర్జలప్రదే శమైయుండె అస్తమానమునకు ఆగుజ్జుముయెక్కడనిలువక పోవుచునే యుండగా నేను బహుబడలికెనుజెంది తెల్విదప్పి బహు దుఃఖముతో నుంటిని. ఆత్మజ్ఞానముగల బ్రహ్మవేత్తచేత దాటబడిన సంసారార్ణవము వలె గొప్ప భయంకరమైన అడవినిదాటితిని అట్టిగుజ్జుము మీద నుండి జూచిన మహదారణ్యమును నేనువర్ణించి జెప్పజాలకయున్నాను గుజ్జు ము పొయ్యెడి లఘువున పైననిలునలేక దుఃఖించుచు నొక నిమ్మచెట్టు తీగెలతో నిండియుండు దానినికని ఆతీగెలను హస్తములతో పట్టుకొని గుజ్జమును వదిలినాడను అగుజ్జము ప్రవాహమునబడి కొట్టుకొనిపోవు దానివలె నన్నువిడిచివెళ్లిపోయినది తీగెనుజారి భూమిమీదపడితి నన్నా దరించువారులేక భ్రమపడిబ్రహ్మకల్పమైనట్టు ఆరాత్రియంతయుగడిపితి యిఖను జరిగిన ఆశ్చర్యమును బహుశ్రద్ధతో నాలకించుమని చెప్పందొ డంగె (నేనుజలకమాడుట దేవపూజభోజనముచేయుట) లేకపోయినను ఆయడవిమృగములలోచిక్కి(జచ్చుటయు) లేకరాత్రియంతయుజీవించితి గాఢాంధకారములో ఎడతెగని చలివల్ల వణకుచుంటిని సూర్యోదయ మయినతోడనే నలుప్రక్కలకుపోయిచూడగా నాగొప్పఅరణ్యమందు పక్షులశబ్దము వినవచ్చుచుండెనుగాని కంటికిగోచరించలేదు అట్లుండగా రాత్రిఅయ్యె ఆరాత్రి కాలంబున వారికంటె చూపుగల ( నొకస్త్రీని ) జూచితి ఆస్త్రీచేత అన్నముయుండెను నేనుదానిని నీచేతయున్న అన్న మును నాకుయివ్వమనిన్ని నాకు మరణస్థితి గల్గుచున్నదనిన్ని విశేషము గావేడుకొనగా ( శ్రీదేవి ) పాపాత్ములకు (ధనమొసంగనిరీతిగా) అది యివ్వక వెళ్లుచుండె నేనున్నూ దానివెంబడిపోవుచుంటిని అదినన్ను ఓడి వ్యాభరణములుగల చిన్నవాడా నావెంట యేలవచ్చెదవు నే ( చండా లస్త్రీని ) కాబట్టియీఅన్నమును నీకుయివ్వతగదనిపోపొమ్మనిబిగ్గరచె ప్పెను నాకుఆశబుట్టించునట్లు అనేక వైయ్యారపునడకనడుచుచూ సా యంకాలమువరకు నామనస్సు మిక్కుటముగా కల్తనొందునట్లు జేసినది.

ఆఅన్నము నాతండ్రికి తెచ్చితిని నీవు నాకు భర్తవైన యెడల నీకుసగ
ము అన్నమిచ్చెదను శీఘ్రముగా జెప్పుమ్మనెను నేనుఒప్పుకొని యీక్ష
ణమందే నీకు భర్తనయ్యెదనని చెప్పి సగము అన్నమునుతీసుకొని భు
జించితిని సొరకాయలోనున్న నీళ్లుత్రాగి నేరేడిపండ్లరసమును పానము
చేసి బడలికదీర్చుకొంటిని నన్నుతనచేత పట్టుకొని తనతండ్రివద్దకి పోయె
ను. వానిచూచినతోడనే(యముడివలెతోచెను) వానికినన్నుజూపి యిది
మొదలు యితనునామభర్తయని తండ్రితోజెప్పెను. నేనుఆచండాలస్త్రీ
యునుబోయపల్లెకుచేరితిమి ఆపల్లెయందుండెడుబాలురచేత మాంసఖండ
ములు అసహ్యముగాయుండె ఆఖండములు యీగలు దోమలు ముసరి
యుండె అవిచూచి అసహ్యపడి వ్యాకులచిత్తుడనై యుండగా పచ్చసం
దిలిమొదలగు అలంకారము ఆబోయవానియింటివద్దతయారు చేయబడి
యుండె మామిడాకులతోరణములుగట్టియుండు అత్తగారియిల్లు ప్రవేశిం
చితిని వొకరక్తకండ్లుగలస్త్రీ నన్నుజూచి యిదుగోఅల్లుడు వచ్చెననెను.
అత్తనన్నుజూచి సమ్మతించెను ఆపెండ్లికివచ్చినస్త్రీలు నల్లగాయుండిరి.
పాపియగువానికి (యమపురంబున) గల్గుచందంబున నాకుదోచుచుండె
ఆచిన్నదాన్ని నాకుకన్యాదానమొసంగిరి ఆపల్లెలోనిబోయవారు విశేష
ముగాబొబ్బలుపెట్టిఅరచిరి. నాకు పెండ్లిఅయినదిమొదలు యెనిమిదినెలలు
వారియింట్లోనేయుంటిని. ఆస్త్రీకిగర్భమైనది ఆపిల్లనుకనెను. అట్లుమూ
డుసంవత్సరములైనది తిరుగాకొమారునికనెను. ఆయడవియందు దారా
పుత్రాదులు యెట్లుజీవింపగలరోయనెడు వ్యాకులముతో నిమిషములుజెం
దుచున్న నాకు ఆశవృద్ధిఅయ్యె ఆపల్లెయందె ముసలివాడను అయితిని
అప్పటికి కరువుసంభవించె అక్కడ అన్నోదకములుగాని పర్ణములుగాని
తినుటకుచిక్కకపోయెను జీవించవలెనని నేను చాపల్యతననుసరించిఅక్కడి
వారు వింధ్యపర్వతమువద్ద జలమున్నట్లు తెలుసుకొని అక్కడికి వెళ్లిరి.
దావాగ్నితోగూడినగాలికొట్టివర్షములేక గెడ్డియునులేకపోయినిప్పుతగు
లొక్కనిఆయడవిమండుటజూచిభయపడి సంకటములోనుండునపుడొకొం

దయశోషించి కొందరుఆనిప్పులోకాలి కొందరుసహించకూడనిఅరుపుల
బిడచ్చుచుంటజూచితి ప్రళయకాలమనిదోచె నాభార్యాయిలాకా వారి
కుటుంభమువారుమాత్రము బ్రతుకుటకై యెచ్చటికోపోయిరి నేనునాబి
డ్డలిద్దరిని బుజముపై నెక్కించుకొని భార్యతోగూడి నేదోనొకదేశమునకు
పోదామనిపోవుచుండగా నొకతాటిచెట్టువద్దబిడ్డలదించి (నరకమందుండి
తప్పించుకొనినవానివలె) నాచెట్టుక్రింద చల్లగాపండుకొనినిద్రపోయినాడ
ను నాభార్యాబిడ్డలు నిద్రించి శ్యాతిజెందిరి నాబిడ్డలకు ఆకలి దప్పులచే
ప్రాణాంతమగుననిదోచె. యిట్టిదురవస్థలు పడుటకంటే జచ్చుటమేలని
తలంచి (కట్టెలచితిపేర్చితిని) అదితగులబెట్టితిని అదిఅగ్నిజ్వాలల ప్రకా
శమై ఆయగ్నిమధ్యంబుననుండి నేనుకండ్లుతెంచిచూడగా మీయెదుట
యీసింహాసనము మీద నున్నాను. ఇట్టి మూఢత్వమును యింద్రజా
లకునివల్ల నాకుజరిగి భ్రమచే అజ్ఞానాకర్షణమున యిట్టివిచిత్రము పొం
దితినేను కాబట్టి ఓ రామచంద్రా ఈకనబడెడు నామరూప ప్రపంచ
ము అంతఃకరణ కార్యమే గనుక మనస్సు యెల్లెట్లో వ్యాపించును.
ఆవిధముగా ప్రపంచములుయేర్పడి క్షణకాలంబున అనేకవృత్తులుగల్పిం
చును. విశేషార్థము (మనస్సే) మూసుకొనుటకు విప్పుకొనుటకుగాను
న్నవి మూసుకొనుట ( చాపు నిద్ర మరుపు ) విప్పుకొనుట మెళకువ
జన్మములనియును, గ్రహించందగు ( మనస్సే ) మాయా ( మాయ
యే ) మనస్సనియు, ఊహించనగును.

గీ॥ సత్తుచిత్తైక్య మచల హంసప్రకాశ ।
వశముకొందక తన్మనో యశము లేదు ।
గాన యమనస్కయోగము న్భూనవలెను ।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

గీ॥ నీవెనిర్గుణపరమైన నీతిదెలసి ।
విశ్వమెల్లను సగుణమై వెలయజూచి ।
గన్నవాటినిగణుతించి మిన్నకుండు ।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

గీ॥ సత్యగుణమందు స్వరూప సత్యమబ్బి।
భక్తియుతముగచిత్తంబు పరిణమించి।
యుక్తి బయలునజేర్చుట ముక్తికిరవు।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

రామశబ్దార్థము.

(రమతీతి రామః) అనగా జ్ఞానుల హృదయమందు రమించు వాడు రాముడు.

శ్రుతి॥ అకారో తత్పదార్థస్స్యాత్ మకారస్త్వంపదార్థవాన్, త యోస్సంయోజన మసీత్యర్థే తత్త్వవిదో విదుః అనగా (రా) తత్ప దలక్ష్యార్థమైన నిరాకారబ్రహ్మము (మ) త్వంపదలక్ష్యార్థమైన (ప్రత్య గాత్మ) కాబట్టి (రామ) అనగా నిరాకార (పరబ్రహ్మమే) ఒక్కొక్క జీవజంతువునందు సాక్షిమాత్రుడుగా ఆత్మరూపముగా నున్నాడు. బ్ర హ్మాత్మా అఖండైక్యము అర్థమగుచున్నది. కాబట్టి దేహత్రయసాక్షిగా నుండు ఆత్మయే రాముడని యెరుంగనగును.

శ్రు॥ రమంతే యోగినోనంతే నిత్యానందే చిదాత్మని।
ఇతిరామ పదేనాసౌ పరబ్రహ్మాభి ధీయతే।
చిన్మయస్యా ద్వితీయస్య నిష్కళస్యా శరీరిణః॥

అనగా కేవల సత్యజ్ఞానానంద నిత్యనిర్మల నిరాకార పరబ్రహ్మ స్వరూపమును బ్రహ్మజ్ఞానులు తమయొక్క ఆత్మస్వరూపంబుగా నెఱింగి సదా అట్టి నిజస్వరూపమగు (రామ) శబ్దబ్రహ్మమును ఆత్మయందే రమించుచున్నారుగాన (రామ) అనెడు పేరుగలిగెనని యెంచందగును.

బ్రహ్మలక్షణము.

౧. ఏకమేవా ద్వితీయం బ్రహ్మ, అద్వితీయమే బ్రహ్మము.

౨. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, సత్యజ్ఞానానందమే బ్రహ్మము.

3. చైతన్యం బ్రహ్మ, నిర్విశేష శుద్ధజ్ఞానమే బ్రహ్మము.

౪. విజ్ఞానమానందంబ్రహ్మ, కేవలజ్ఞానానందస్వరూపమేబ్రహ్మము.

ఇట్లనేక ప్రమాణములుండుటేగాక ర మహావాక్యములు బ్రహ్మ మేఆత్మయని దృఢముగా జెప్పుచున్నవి. (ఆ పరబ్రహ్మ) పరిపూర్ణమై ఆదిమధ్యాంతములులేనిది అప్రమేయమైనది నిత్యమైనది ఆనందమైనది నాశములేనిది ప్రత్యగాత్మగా నున్నది అఖండజ్ఞాన స్వరూపమైనది అంతములేనిది సర్వపరిపూర్ణమైనది సర్వోత్కృష్టమైనది నిరాధారమైనది శుద్ధనిర్గుణమైనది నిర్వ్యాపారమైనది అతిసూక్ష్మమైనది నిరంజనమైనది చిద్రూపమైనది తనకుతానేయుండునది పరిశుద్ధమైనది ఒక్కటియైనది తనకంటె రెండవపదార్థములేనిది వాక్కు మనస్సునకందరానిది యిన్నిపేర్లచేత (పరబ్రహ్మమను నామమును) ఉపచారవార్తలుగా చెప్పంబడి యున్నది.

వి. అట్టి పరబ్రహ్మమునందు లీనమైన బ్రహ్మవేత్త నిర్వికారుడుగాను నిష్క్రియుడుగాను బ్రహ్మమే ఆత్మయనియు ఆత్మయేబ్రహ్మమనియు తత్త్వవిచారణచేత దెలిసి సమరసైక్యభావమునొంది సకలసంకల్పములునశించి సకలముమరచి తానే తానై కేవలసాక్షిమాత్రుడై యుండు వృత్తియే (ప్రజ్ఞ) యనంబడును. అట్టి ప్రజ్ఞగలపురుషుడే జీవన్ముక్తుడగును.) అట్టిజ్ఞాని కాశిరామేశ్వరములందైనను పుణ్యతీర్థములయందైనను అడవి గుహ మొదలగు స్థలములయందైనను మాలవాని యింటనైనను ప్రారబ్ధము నశించినతోడనే శరీరమునువిడిచి పరబ్రహ్మైక్యమునుజెందునుగాన యెచ్చోటజీవమును విడచినా (ఆబ్రహ్మజ్ఞానికి) యేదోషము గలుగంజాలదు. గంగానదులుప్రవహించి సముద్రముజేరు నట్లుగా సముద్రము జేరిననదులు నామరూపములువిడిచి సముద్రస్వరూపమైనట్లు (బ్రహ్మజ్ఞాని) పరమాత్మస్వరూపమందే లయమగుచుండును.

ఇట్లు వసిష్టమహామునీంద్రుండు శ్రీరాములవారికి జ్ఞానవాసిష్టమందు పదేశించిన చిత్తోపాఖ్యానములో మనస్సునుదేయున్నట్టు అదవినావేరే మియు యదార్థమైనది లేదు. పరమాత్మయందునిష్కల్మషమును నాశరహితమును వేరొకటియునులేదు. అన్నిసామర్థ్యములు మనస్సునకే గలి

గియున్నది ఆమనస్సువల్ల, పరమాత్మను సాక్షాత్కరించుకొనుచు సంక
ల్ప వికల్పములులేక నీవు యోచించి ఆమనస్సును పరబ్రహ్మమునందు,
లీనపరుచుచు కైవల్యోపాయమును సాధించి, నిష్కల్మషమైన బుద్ధి
యుంచుము. అని బ్రహ్మదేవుడు నాపై కరుణించి నిష్కల్మషబుద్ధితో
నాకుపదేశించిన దానిని, నీకు దెలియపరచెదను. ( యోజన శతంబుల
దెచ్చట నొక్కమూలకుఁ ) అనుట యందు, లెక్కలేని సంకల్పము
లను, లెక్కలేని జాగ్రదాద్యవస్థలును సృష్టి మొదలుకొని వచ్చిన జన్మ
ములును, అన్నియు, దశదెక్కులలోని, వ్యాపారములే యగుట, వీని
నన్నిటిని అతిక్రమించిన స్థానమే, ( గజేంద్రమోక్షమందు చెప్పబడిన
లోకంబులు లోకేశులు లోకస్థులు, తెగినతుది నలోకంబగు, పెంజీక
టిననెడిస్థానము, ఒకమూలకుం అనుటయందు దానియందొకమూలను,
హెచ్చించుటకును, తగ్గించుటకును నలవిగాని భయంకరమైన చీకటిఅ
రణ్యమొకటిగలదు. చూడచూడ అనగా బ్రహ్మవేత్తలచేత, విచారణ
చేయచేయ యద్భుతము అట్టి మనోదృష్టిలో ( సహస్రశీర్షా పురుష
సహస్రాక్ష స్సహస్రపాత్, అను మొదలు సహస్రశీర్షం దేవం ) అను నా
రాయణోపనిషదర్థమున్ను, పరబ్రహ్మ తటస్థలక్షణమని గ్రహించ తగ్గది
(పురుషుడనగా) పురుషము (శరీరము) దానియందునివసించియున్నాడు.
గనుక ( పురుషుడని ) పేరుగలిగె అట్టి పురుషుని వృత్తులేహస్తములు,
అట్టి పురుషుడు మనస్సును తానే చెఱుచుకొని ప్రతిశరీరమునందు వొక
నిమిషమైనను నిలవక నేను నాది యనుకొనుచు పరుగులిడుచున్నాడు.
యిట్టి మనోరూపమైన ( చిత్తమును ) అట్టి చిత్తమును మునుచుకొనుట
యేకైవల్యమువికశించుటయే ఉత్పత్తిస్థితులుకాబట్టిమనోనిగ్రహమును
బొంది నిర్వికల్పసమాధిని పొందుచుండుటయే కైవల్యమం దిచ్చుమా
ర్గమని శ్రీరాములవారికి వసిష్టమునీంద్రుండు చిత్తోపాఖ్యానంబున
దెల్పిన రహస్యమును సంగ్రహముగా దెలిపి యున్నాడను.

రాజయోగము అభ్యసింపబూనెడువాడు జనక మహారాజువలె

భార్యాబిడ్డలతో సంసారముచేయుచున్నను ఇంద్రియములను వశపరచు
కొని నిష్కాముండై దానధర్మముల యజ్ఞశ్రాద్ధాది సత్కర్మములను చే
యుచు బ్రహ్మనందపరుండై యుండనగు కాబట్టి మనస్సన్యాసముబొం
దినవారికి గృహమే తపోవనముగానుండును ఎట్లనగా పూర్వము మిథిలా
నగరములో జనక మహారాజు రాజ్యముచేయుచుండగా అతనిచిత్తము
నుశోధించుటకు సులభయనెడి నొకస్త్రీ తనయోగబలముచేత అతియ
వ్వన సుందరరూపముదాల్చి ఆరాజ సభకు వచ్చి ఓరాజేంద్రా? నీవుమ
హాజ్ఞానసంపన్నుడవని వినబడి నిన్ను దర్శించవచ్చితిని నేనొక యోగిని
స్త్రీని మనమిద్దరమున్ను జ్ఞానమార్గమునందే యున్నాము గాన నీతోడి
సాంగత్యమే నాకు తగునుగాని పామరసాంగత్యము నాకుతగదు. నీయం
దే నామనస్సు లయించియున్నది. కాబట్టి నాప్రార్థనచేకొని నాతోడ
భోగించి నాకుతృప్తిచేయుమనిచెప్పగా నతడు (రామరామయని) చెవు
లుమూసికొని చింతాక్రాంతుడై ఓతరుణీ నీవేల యిట్లు వెఱ్ఱి వెఱ్ఱిగా
మాట్లాడుచున్నావు.

శ్లో॥ మాతృవత్పరదారేషు పరద్రవ్యేషు లోష్టవత్ ।
ఆత్మవత్సర్వభూతేషు యఃపశ్యతి సపండితః॥

అనునట్లునేను పరస్త్రీలనుకన్న తల్లివలెను, పరులధనమును మట్టి
గెడ్డవలెను, సకలజంతువులనునావలెను సమముగా నెంచువాడను, సత్య
ముదప్పనివాడను, నీవు బ్రాహ్మణివి, పరస్త్రీవి, నీవాడుమాటలు ధర్మవి
రుద్ధములు. అనగా నా (సులభ) కామవికారమును గల్గించునట్టి అనేక
శృంగారచేష్టలుచేయుచు, చిరునవ్వునవ్వుచు, చమత్కారముతో చెప్పి
నది యేమనగా, ఓరాజేంద్రా! నీవు ఆరూఢజ్ఞానివని వినివచ్చినందుకు నీ
భావము బహుచక్కగానున్నది. (ఏకమేవాద్వయం బ్రహ్మ సోహ
మస్మి అహమేవ సర్వం సమస్తః పరమస్యం) అనునట్లు తనకు రెండ
వది లేక యేకమై వెల్గునట్టి పరబ్రహ్మమేనేను, నాకన్యమేదియులేదు, సర్వ
మునేనేఅని అద్వైతభావమందుండు నీవునన్ను పరస్త్రీయనియు, నాతో

భోగించుట దోషమనియు, చెప్పవచ్చునా? (శ్లో. ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంతఇతిధారయన్, నైవకించి త్కరోమీతి యుక్తోమన్యేత తత్త్వవిత్.) ఆయా ఇంద్రియములు దానిదాని కార్యములుచేయుచున్నది. ఆత్మ యేమియ్ను చేయుటలేదు, ఏదియునను భవించుటలేదు, ఆత్మ అభోక్త, అకర్త, సాక్షిమాత్రుడు నిర్వికల్పుడుగా నున్నాడు. అట్టి ఆత్మస్వరూపుడవగు నీకు కామమున్ను, పుణ్యపాపములున్ను, గలదా? (నిస్త్రైగుణ్యే పథి విచరతాం కోవిధిః కోనిషేధః॥) త్రిగుణశూన్యమైన శుద్ధనిర్గుణ బ్రహ్మస్వరూపుడగు నీవు యిది చెప్పవచ్చును చెప్పరాదని విధినిషేధములు గలదా? (శ్లో. యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే, సర్వత్రావ స్థితో దేహే తథాత్మా నోపలిప్యతే.) అను భగద్వాక్యరీతిని ఆకాశము సర్వత్ర వ్యాపించియున్నను దేని నంటకుండు నట్లు ఆత్మ సర్వత్ర వ్యాపించియుండై దేని నంటకయుండునుగదా? మరియు కుండ తోడకుండ ఒకటొకటి ఒరసికొనుచుండగా ఆకుండలోని బయలుకు నేయుపాదిలేక యుండునుగదా? అట్లునీ దేహము నా దేహము యొరసికొని భోగించిన మన ఆత్మస్వరూపము నిర్వికారముగా నిర్దోషముగా నిశ్చలముగా నుండునుగదా? ఇంకనైనను ఇట్టిభ్రమలువిడిచి నిర్వికార పరబ్రహ్మమే నీవని భావించి నిర్భయముగా నాతో భోగించి తృప్తిచేయుమనగా, నతడు చిరునవ్వునవ్వుచు ఓతరుణీ? నీవాడుమాటలెల్లా సత్యమే నాకట్టి భ్రమలులేవు నాకు భోగింపవలెనని యిచ్ఛలేదు. నీవు భోగించుటకు రమ్మని పిలుచుచున్నావు. యిట్టి భేదబుద్ధులు నాకు నేర్పుచున్నావు, ఛీఛీ యిట్టి భ్రమను విడిచి నీలో నిన్ను దెలిసి సుఖమందుమనెను. ఆమాటవిని ఓరాజా నీవు నీలో నిన్ను దెలసి సుఖమందుచు నీభార్యతో భోగించుటలేదా, అనగా నతడు ఓచిన్నదానా రోగికి ఔషధము రుచించకపోయినను దాని భుజించునట్లు నిజభార్యకు ద్రోహము చేయకుండా దాని యిష్టమును దీర్చెదనేగాని కామవికారేచ్ఛలు నాకు లేవనగా నాసులభ సంతోషచిత్తురాలై లోకంబున శుష్కవేదాంతులు

నేనే బ్రహ్మము, అంతా నేనేయని యేమిచేసినను దోషములేదని వాచా జ్ఞానము మాట్లాడుచు కామాతురులై అహంకరించి పరస్త్రీగమనము మొదలగు అనేక పాపకార్యములు చేయుచుందురు. ఆత్మజ్ఞానములేక అక్రమమున ప్రవేసించు మూఢులు నరకప్రాప్తిజెందుదురని శ్రీశంకరాచార్యులు చెప్పియున్నారుగదా? ఆశను విడిచిపెట్టిన మహాత్ముడే సకల కర్మముల నశియింపజేసె ముక్తుడగును సుమా? (శ్రుతి॥ అదివిద్యాయామంతరే వర్తమానాః స్వయం ధీరాః పండితం మన్యమానాః దంద్రమ్యమాణాః పరియాంతి మూఢాః॥ అంధేనైవ నీయమానాః యథాంధాః॥) అనగా కొందరు అజ్ఞానమునను సరించి అనేకపాశములలో దగులుకొని బ్రహ్మజ్ఞానులమని యందురేగాని ముక్తిని బొందంజాలరు. గుడ్డివాడు గుడ్డివానికి తోడైనట్లు ఫలము బొందం జాలరు. గనుక నీవు మహానుభావుడవు నీచిత్తము శోధించుటకై వచ్చితినేగాని యితరము తలచకుము నేను బహువృద్ధకాలను (సులభ) అనెడు బ్రాహ్మణ స్త్రీని అని దాని నిజరూపు జనక మహారాజునకుజూపి అతనిని బహువిధముల కీర్తించి యథేశ్చం జనియె. కాబట్టి బ్రహ్మజ్ఞాని నిర్వికార పరబ్రహ్మస్వరూప చింతనయందు దృఢముగానుండి తాను జేయు సత్కర్మములను బ్రహ్మార్పణముజేయుచు కర్మఫలమును గోరక దామరాకునందు జలంబుపగిది కేవల బ్రహ్మానందపరవశుండై మనస్సన్యాసిగా నుండందగును.

శ్రుతి॥ దీర్ఘం వాపి మనోరాజ్యం సంసారం దుఃఖసాగరం, చిత్తే చలతిసంసారో నిశ్చలం మోక్ష ఉచ్యతే॥

అనగా చపలమనో రాజ్యమేదో అదే దుఃఖసాగరము, భార్యాపుత్రాదులు సంసారముగాదు, కాబట్టి మనోనాశమే బ్రహ్మానందము, అదే నిజమైన సన్న్యాసము, బ్రహ్మమువినా వేరే రెండవ వస్తువు లేదని ప్రపంచ మవిద్యగా తానే బ్రహ్మమని నిష్టజెందుటే శివజీవైక్యభావము. యోగియైనను భోగియైనను భార్యాపుత్రులు మొదలగు జనగోష్టిలో

నుండిన వాడై నను సంగవర్జితుడై నాసరె ఎట్టివాడై నను జీవబ్రహ్మై క్యానుసంధానము చేయుచుండిన అట్టియోగి నిత్యానందమగు మోక్షమును జెందును. ఈ జనకసులభ సంవాదముగాగల మనోవాంచలనెల్ల తుదముట్టం జదివి కర్ణకుహరంబులచేత స్గ్రహించి నిస్తరంగవార్ధి సమ ధైర్య కైవల్యసంభోగ బ్రహ్మానంద సుఖమనుభవించదగు. ఇదియు నుంగాక. యింకొక దృష్టాంతముగలదు. శ్రీమహాభారత శాంతిపర్వం బున శ్వేతద్వీపవాసియగు ( నారాయణుడు ) నారదునకు ఉపదేశించిన తత్త్వమార్గంబెట్లన. ఓనారదా? ఏకాంత భక్తిదప్ప యితరమార్గము లతో నన్ను దర్శింపం జాలరు. నీవు యేకాంత భక్తిచేతనే నన్ను జూడం గలిగితివి అహంకారములేనందున నాదర్శనమబ్బె నని నారాయణుండు జెప్పి నీవు కోరెడు వరమును గోరుము యిచ్చెదననెను. నారదుండు ఓ దేవా మీదర్శనమునకంటె నాకు వేరే కోర్కెలేదనెను. ఆ నారదమహా ముని అభిప్రాయము నెరింగి నారాయణుండు ( ఆత్మ ) ఆకాశాది పంచ భూతములు నశించిననునశించదు. యింద్రియములకగుపడదు. మూడు గుణములలో సాత్వికముతో గూడియుండును. సకలమునకు ఆధారమై నదియగును. మరియు ( ఆత్మ ) సర్వసాక్షిగా పుట్టుకలేనిదిగా నిష్కళంకముగాయుండి క్షేత్రజ్ఞుడనిపించుకొనుటచే ( వాసుదేవుండనంబడు ను ) బుద్ధిప్రతిఫలిత జీవుండు సంకర్షణుండనంబడును. మనస్సు ప్రద్యుమ్నుండనబడును. అహంకారము అనిరుద్ధుండనంబడును. ఈచెప్పం బడు స్వరూపములన్నియు నామయములై యున్నవి. యిరువదినాల్గు తత్త్వములకు అధిపతియగు నిరువదియైదవవాడు క్షేత్రజ్ఞుండు ఆక్షేత్ర జ్ఞుడను నేనేనని తెలిసికొనుము నాకంటెఅన్యమైనది కొంచమైననులేదు. ఏకాంతభక్తిచే నేయాత్మను నెరుగునో నాయాత్మయగు వాసుదేవుడను నేనేయని యెరుగుటచే మేలుగల్గుచుండును. పంచభూతస్వరూప రక్తాది సప్తధాతువులకంటె అన్యముగా దేహములేదు. అట్టి సప్తధాతు మయ మగు దేహమందు జీవుండనియడల యేవిషయములయందు దేహాదు

ప్రవేసించం జాలదు. జీవుడు శరీరమును భిన్నముగా జూడందగు. అట్లు జూచువానికి నా స్వరూపదర్శనమగును. భక్తిచేత నన్నాశ్రయించినవా డు నన్నే పొందంగలడు. అట్టివానికి మోక్షమిచ్చెదను. మఱియు ఓనా రదా? సూర్యుడును వాయువును వసువును రుద్ర బ్రహ్మ మొదలగు దేవతలును నాల్గువేదములును యిత్యాదులన్నియు నాస్వరూపములే యగును ఆయావిభూతిచేత గౌరవములను బొందు చుండెదరు. బ్రహ్మను సృష్టించి సకల వ్యవహారములు ఆధీనపరచి నిర్వికారుడనై యున్నాను. జనులకుమోక్షసిద్ధికిని సాక్షినై ఒక్కొక్క కాలమందు జగత్తుకు మేలు కై జన్మములెత్తి భూభారమును మాన్పుచుందును. నేను పూర్వము నర నారాయణులను రెండురూపములు ఋషిస్వభావములో నున్నా కృష్ణా వతారుడనై కేళివిలాసుండుగాను, కంసుడు కాలయవనుడు నరక భాణుం డు మొదలగు దుర్మార్గులనుంజంపితి. భాణాసురునిరక్షించుటకై శివుండు సేనాసమేతుడై వచ్చిన జయించితి. భాణాసురునవమానించితి యింతకు ముందు మత్స్యకూర్మ వరాహరూపుండనై అన్ని వేదముల దేవతలకై మేలుజేసియున్నాను. నాచరిత్రము వినగోరెదవేని అద్భుతమై యుండు ను. కాబట్టి నీవునాయందు (మానసభక్తిపూర్వకంబుగా) ఏకాంతముస నన్నే ధ్యానించిజూచుచుండిన ప్రత్యక్షమగుచుందునని జెప్పి శ్వేతద్వీపపు రుషులను నారదునకుజూపి ఓనారదా? ఈపురుషులు ఏకాంతికులనబడు ను. వీరునాస్వరూపము (ధ్యానము)జేయుచుందురు యిక్షనునీవిక్కడనుం డరాదు. గనుక నీవు (బదరికాశ్రమమునకు) వెళ్లుమని సెలవిచ్చె నంతట నా నారదమునీంద్రుండు పరమానందభరితుండై బదరికాశ్రమునకువెళ్లి, నరనారాయణ ఋషులనుజూచి నమస్కరించె ఆఋషులను సేవించి నార ద మునీంద్రుండు సకల మునులకు (శ్రీమన్నారాయణమూర్తి) దెలిపిన సాంఖ్యరూపమగువాక్యామృతములంజెప్పి అందరినికృతార్థులుగా జేయు చుండె. కాబట్టి భక్తిపూర్వకముగా శ్రీమన్నారాయణమూర్తిని సదా ధ్యానమం దుంచుకొని విష్ణుసాయుజ్య మందుచుండమని భీష్ములవారు

ధర్మరాజుకు దెలిపిరి.. కాబట్టి యీరహస్యమైన నారాయణోపదేశము
వినినను చదివినను అట్టివారికి దీర్ఘాయుష్షు. లక్ష్మియు సంపదయు
ఆరోగ్యమును గల్గుచుండుటయే గాక సదా మనోస్మయ
బ్రహ్మానంద సుఖ మనుభవించెదరు గావున.



క॥ ఇది మోక్ష పదవిజ్ఞానము ।
చెవిని హితమతినిత్రాయ చేసురుపుణ్యాం ।
వినిన చదివిన వారికి ।
బహుళంబుగ యోగసిద్ధి ఫలమగుచుండున్





ఓం.

శ్రీశారదాంబాయైనమః.

## ౭. జీవేశ్వర సంయోగము.

### సర్వేశ్వర ప్రార్థనము.

క॥ శ్రీకాంతు నిర్గుణాత్మకుమె, శ్రీకరమని వేదశాస్త్ర సిద్ధాంతంబై ।
లోకమున వెలయుగావున, నేకాలతుఁ హృదయమందు నెంచ్యుగ నెంతు ముఁ॥

### సరస్వతిదేవి ప్రార్థనము.

క॥ వాణీఁ వీణాపుస్తకపాణీఁ, బరమేష్ఠిరాణి బాలితభక్తశ్రేణీఁ ।
మాద్యద్భ్రమరీవేణీఁ, వినుతింతుమదిని వితువనిజ్ఞప్తిఁ॥

### గణపతి ప్రార్థనము.

క॥ శ్రీగణనాథ శుభాంగుని, యోగిజనధ్యానగమ్యు నూర్జితకరుణా ।
సాగరు మ్రొక్కెదగావ్యము, బాగుగ నెరవేరియిలను బ్రబలుటకొరకై ॥

క॥ పదివేలవందనంబులు, కుదురుగ నేసలిపిగురున కొసగితికరుణా ।
హృదయముతుగైకొని, యదలించక దెలుపగంటి నచలంబెదలోఁ॥

క॥ జీవసమష్టితనుత్రిత, యూవస్థాత్రితయములకు నఖిలాత్మకమా ।
యావిప్రాణవిరాట్పురు, షావళికిసాక్షియై పరమాత్మంఁడొప్పుఁ॥

తా. ఈశ్వరునియొక్క స్థూల సూక్ష్మకారణ దేహములకును, వ్యష్టిస్థూల దేహాభిమానులయిన యనేక విశ్వులుగూడి (విరాట్టు) వ్యష్టిసూక్ష్మ దేహాభిమానులయిన యనేక తైజసులుగూడి (హిరణ్యగర్భుడు) వ్యష్టికారణ దేహాభిమానులగు ప్రాజ్ఞులు అనేకులుగూడి అవ్యాకృతుడుగాన వీనికిని (పరబ్రహ్మము) సాక్షియై ప్రకాశించుచుండును.

కందార్థము.

జీవుడవిద్యకుతోడ్పడి సేవకులై యింద్రియముల చేష్టలలోనై ।
భావింపక సేవింపక కావరము నకిల్బిషంబు గావించునయ్యా॥ యున్మత్తుడై

జీవించుచునయ్యా॥ భావాభావములందు భావింపరానియా కేవలమూర్తిని గీర్తించక నీవు దేవగురుడని తెలియజాలక దేహీ దేహముశాశ్వతంబను భావపరమగు బ్రహ్మమెఱుగక పామరుండై పుట్టుచావులు గావించు నయ్యా॥ యున్మత్తుడై జీవించునయ్యా॥

తా. జీవుడు కావరమువల్ల నింద్రియములకులోబడి పాపపు కార్యములు చేయుచుండును. దేహము శాశ్వతంబని పరబ్రహ్మమును మదియందుదలచి (పరిపూర్ణమందక) యున్మత్తుడై చెడిపోవుచున్నాడు.

కందార్థము.

నీరక్షీరములై క్యత జేరెడు క్రియనెరిగినీవు జీవేశ్వరులన్ । వేరని యెంచకమదిలో నారాధనజేయవోడరు మవసానమందు॥ చిన్మాత్రుడై శివమూనిపొందు॥ మవిరతజ్ఞప్తిలో నంతరంగముజేరి చవిగొని బయ లందు చలినెలుంగునజేరు పవనరేచక పూరకములను బట్టినొక్కెడు కుం భకంబున గలియుచుండుము హంసమదిలో. కాంతయజ్ఞము బ్రహ్మ మయమగు నవసానమందు॥ చిన్మాత్రుడై శివమూనిపొందు॥

తా. నీరునపాలుగలియురీతిగా జీవేశ్వరులను అంతరంగంబున వేర్వేరంజూచి యేకమగునట్లు ధ్యానించి వాయువు చెదరక యుండునట్లు బంధించిన గలియుచుండును. అట్టినిలకడ అవసానమందు గలసినట్లుచే యుట మనస్సులయించును. అట్టిలయమే శివజీవులకైక్యంబని చెప్పం బడును.

క॥ పరిపూర్ణహంసరూపులు, మరిమరిపరశివునిగూడి మనమునశింపన్।
ధరజనులచెంతజేరక, స్థిరరూపముగలియుచుంద్రు స్వేచ్ఛగనెపుడున్॥

తా. శివునిలో జీవునిజేర్చెడి యోగులు సదామనస్సును శివుని యందుజేర్చి లోకమునుమరుచుట సాధారణముగా అభ్యాసింతురు.

వి. సత్పురుషులైనయోగులు జీవేశ్వరుల స్థూలసూక్ష్మకారణ శరీరములనున్న కారణ కార్యోపాధులగు మాయయను అవిద్యనుప రిత్యజింపగానె జీవుడును ఈశ్వరుడును ప్రకాశింపకపోవుటచేత బ్రహ్మ

చైతన్యము ముఖ్యమైనదిగానున్నూ భాగింపరానిదిగానున్నూ తనకంటె యితరములేనిదై సంయోగము పొందుచుండును.

క॥ భావాభావములోనగు, భావమె హంసత్వమరయ బడయుమువడిని।
భావములో వెలికుంభక, జీవనమగు నిత్యసుఖము జెందగవచ్చున్॥

తా. భావాభావములను హంసధ్యానముచే కుంభించి నిత్యసుఖమును అందవచ్చునని తాత్పర్యము.

వి. పరమశివుడు (పంచభూతములు) జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు మనోహంకారబుద్ధి ప్రకృతులు శబ్దాది పంచకము ఇచ్ఛాద్వేషసుఖదుఃఖములు చేరెడికూటముకు (ద్రష్టయై) నశించనివాడై మాయాజీవులకు అంటక సచ్చిదానందచైతన్య (హంసరూపమై) ప్రకాశించుట కుంభకములోనందనగును. అజ్ఞానులకుఆకాశమునల్లగాను, త్రాడు పాముగాను, దారువుపురుషునుగాను, ఎండమావులుపుదకముగాను, ముత్యపుచిప్పలు వెండిగాను, తోచెడిరీతి చక్కగా పరిశీలించిన భ్రాంతిచేత గల్పింపబడినవి. అబద్ధములై దోచునట్లు (ప్రత్యగాత్మ) పరబ్రహ్మమయ్యును జీవరూపముగా దోచునట్టిది జ్ఞానము తెలిసికొనిన యోగీంద్రులకు జీవరూపమైక్యమై పరిపూర్ణస్వరూప పరబ్రహ్మమై ప్రకాశించుచుండును.

క॥ జీవేశ్వరులొకటేయని, భావించిగురూపదేశ బంధురమగుయా।
నావను వహించినిర్గుణ, భావమున భవాబ్ధిదాట భద్రతగల్గున్॥

తా. గురూపదేశమను నావచే నిర్గుణభావమును పొందిన జననమరణ ప్రవాహమను సముద్రముదాటుటకు భద్రముగా నిర్గుణభావమందుచుండును.

క॥ అంగము జీవునికిరవగు, లింగము జీవాంశమెరుక లెక్కించినచో।
లింగాంగంబులు రెండును, సంగంబగుబయలునందు సమముగనెదలోన్॥

తా. జీవునికీదేహము యిరవుగానున్నది. లింగముపరమాత్మయే జీవాంశమెరుకయై యుండుట ధ్యానమున రెండుచేరిపోయి బయలగుటయే శివజీవులకైక్యంబని మదిలో నెఱుంగనగును.

కందార్థము.

సగుణంబులోన జగములు యగణితముగ బెరుగుచుండు యావరణంబై । సగుణం బమరుటజీవుని దగులును లోకంబులెలమి తలపోయుమయ్య॥ నిర్గుణచర్య నిలద్రొక్కుమయ్య॥ యెలమితోమత నీవు యేకాంతమమరగ తలకొనిపూర్ణ మా తావరమందుము తొలుతనేర్చిన విద్య మర్మముతోంగలించుము నిన్ను మరతువు వలివెలుంగున జేరియుండెడి వర్తమానమగోచరంబని తలపోయుమయ్య॥ నిర్గుణచర్య నిలద్రొక్కుమయ్య॥

తా. సగుణమందు జీవునికి లోకావరణము దగులుచుండును. నిర్గుణధ్యానమందు పరిపూర్ణమై చంద్రకాంతిలో తన్మయమంది సాక్షాట జీవేశ్వరైక్యము అట్టి యనుభవమును అట్టిదిట్టిదని చెప్పరానిదై యుండునని భావము.

శ్రీ మహాభారతంబున శాంతిపర్వంబున
భీష్ముండు ధర్మరాజుకు జెప్పిన కథాసంగ్రహము.
జాజిలి తులాధారుల సంవాదము.

ఓధర్మరాజా! జాజిలియనెడు ముని చలించని తపోనిష్ఠయందు కూర్చొనియుండె అట్లుండగా జాజిలి శిరస్సుమీద పిచ్చికలు గూడుపెట్టుకొని వసించుచుండె. కొన్నాళ్లకు ఆడు పిచ్చుక గ్రుడ్లుపెట్టి పిల్లలు చేసె. కుటుంభము వృద్ధియాయె అవి ఆహారార్థము బయిట సంచరించుచు వచ్చుచుండె. అట్టి పిచ్చికల సంతానమునందు ఆజాజిలి కృపగలవాడై ఆపిచ్చికల వెళ్లగొట్టక తన నెత్తినయుండు గూడును భంగపరచక వర్తించుచుండె. యిట్లుండి తానొకనాడు తనలో తాను యుండునట్టి నియమమును దలంచి తానె మెచ్చుకొనుచు ఆనందంబుగానుండె అట్టి సమయంబున ఆకాశవాణి ఓజాజిలి నీలో నియమమును మెచ్చుకొనుచున్నావుగదా, తులా ధారుడను కోమటివాడు నీయంతటి వాడగును. గనుకనిన్ను నీవే మెచ్చుకొనరాదని ఆకాశవాణి అద్భుతముగబలికె

ఆపలుకు జాజలి విని భయపడి ఆతులాధారుని చూడదలచె ఆతులా ధారుడు కాశీపట్టణమందున్నాడని మునుల ఆకాశవాణిబలికె అంతట జాజలి మునీశ్వరుండు మాహాత్మ్యగుణముగలిగి ఆ కాశీపట్టణముజేరి వ్యాపారముజేయుచుండు కోమటియగు తులాధారుని జూచె, ఆతులాదారుడు జాజలిమునీశ్వరునకు ఎగుమర్యాదచేసి యిట్లనియె. ఓమహాత్మా! నీశిరస్సునందు పిచ్చికలుగూడుబెట్టి నివసించి యుండెగా నీవు మనోవికారములేక యెట్లుతపస్సుచేసితివో బ్రహ్మజ్ఞానమునువర్ణించుటకు సాధ్యముగాదు. అనుచుండెగా నాజాజలిముని ఆశ్చర్యపడి తులాదారునితో నిట్లనియె. ఓతులాదారుడా నీవు వ్యాపారముచేయుచుండి యేధర్మముచేత నీకెట్టి దివ్యబోధగలిగినదో చెప్పుమని యడుగగా తులాధారుం డిట్లనియె. ఓజాజలిమునీంద్రా నేను పదార్థములనుకొనుచు అమ్ముచు వంచనలేక ప్రవర్తించుచున్నాను. మోసముచేయక వచ్చెడి లాభమును అనుభవించుచుందును. నాకు లాభము సిద్ధించినను సిద్ధించకపోయినను మనోవికారములేక ప్రవర్తించెదను. నామనస్సు మట్టియందును బంగారమందును నిందాస్తుతులు కలుగునప్పుడును సమముగా నుంచుదును. ప్రాణులను కష్టపెట్టుటయును నే నన్ను పొగడుకొనుటయును లేదు. సకల భూతములయందును దయగలిగియుందును. పరులకు భయము కలిగించను. నేనుపరులవలన భయపడక సమర్థుడనై యుండెదను. సాత్వికగుణముచేత మనోయజ్ఞము చేయుచుందును. విషయభోగములును కీర్తియు కలుగవలెనని అపేక్షించక యుందును. యెవరికైనను మేలుచేసిన యెడల యింతమేలుచేసితినని బుద్ధితోదలచకయుందును. నాకుచూచెడి వస్తువును కావలెనని కోరను దేహేంద్రియములు నావని అభిమానము పడను. వస్తువులపై కోరికెనుగాని అవివర్థనగాని నా మనస్సున యెప్పటికిని భ్రమయుంచను. యీచెప్పినవిషయములన్నియు నిశ్చయము నేను జగత్తును విచిత్రముగా జూచుచుందును. గనుక మనస్సు యేవిషయములలోచిక్కుపడ్చుటలేదు. అను తులాదారుడుమాటలువిని జాజలిమునీం

ద్రుండిట్లనియె. ఓతులాదారుడా! యజ్ఞతపస్సులు పరమధర్మంబులు అని శాస్త్రాగమములలో చెప్పబడియున్నవి అట్టివినీవువొకటైనను జెప్పలేదు. అవి యేమనియనుగగాముసీంద్రు పకుతులాదారుండిట్లని జెప్పందొడంగె. ఓజాజిలి మునీంద్రా! అహంకారముతో గూడుకొని అపేక్షచేత తపస్సు చేసినయడల నాతపస్సునందు లోభగుణము స్వాభావికమై యుండును. ఫలాపేక్షచేత జేయుచుండెడి యజ్ఞములయందును లోభగుణముకద్దు. అట్టితపోయజ్ఞములు దేవతలుమెచ్చుకొనరు. అట్టితపస్సును యజ్ఞములు చేసినవారలు ఇహాపరలోకములు దిరుగుచుందురు. అట్లు తిరుగుట కీడే యగును మేలులేదు. సర్వదా తృప్తి గలిగియుండెడి జ్ఞానయజ్ఞమువలన దేవతలు తృప్తిజెందుదురు. వారు తృప్తులైన నాశములేదు. ఆనందముగ ల్గును. అని తులాదారుండుచెప్పినవిని జాజిలిమునీంద్రుం డిట్లనియె. ఓతులాదారుడా! నీవు కర్మను విడుచుటకు కారణము చెప్పుమనగా ఓ బ్రాహ్మణమునీంద్రా! జాజిలీ కర్మములయందాశక్తిగలిగి ధర్మమునకు స్నేహితుడై యున్నను ధర్మఫలముయిష్టములేని నిష్టచేత కర్మఫలము బొందక నిర్మలుడై క్రియాశూన్య రూపమగు ( శివజీవైక్య ) బ్రహ్మానంద సిద్ధిపొందవచ్చు ఆత్మయనెడి పుణ్యతీర్థమును యెరిగిన పుణ్యాత్ముడు తీర్థయాత్రలు పుణ్యపర్వతములు పుణ్యనదులు తనయందేగలిగియుండును. అట్టి సుజ్ఞాని ( జీవేశ్వరైక్యముపొంది ) తిరుగా జన్మమునకురాడు. అని చెప్పి నేను పెద్దలవలనవినిన ప్రకారమంతయుజెప్పితి యీమార్గము మంచిదో మంచిదికాదో మనమిద్దరము పెద్దలవల్లతెల్సుకొని అనుమానము పోగొట్టుకొందము అనిచెప్పి తిరుగాతులాధారుండు జాజిలి మునీంద్రునితోనిట్లనియె. ఓ మునీంద్రా నీశిరస్సునందు గూడు పెట్టుకొని నివసించి యుండెడి పిచ్చికలకు నీవుతండ్రివలె కాపాడుచుంటివిగదా అట్టిపిచ్చికలు యిప్పుడునీవెంటవచ్చి ఆకాశమందున్నవి. ఆపిచ్చికలనుజూచి పిలువుమనగాఆపిచ్చికలుదగ్గెరకురాక ఆకాశమందేనిలచియుండి ఆమునీంద్రునితో నిట్లనియె. ఓబ్రాహ్మణుడా! జాజిలీ మేము ధర్మదేవతదెగ్గిరయుండెడి భటు

లము ఆధర్మదేవత పంపించగా నిన్నుపరీక్షించుటకువచ్చి నీమనస్సునందు గూడుపెట్టుకొని నివసించియుంటిమి. మాత్సర్యముగల నీమనస్సునందు విరోధస్వభావము వికారముగల బుద్ధియు పుట్టును. అట్టిదుర్గుణములు హింసించుటకు వారిజూపును. గనుక తపస్సంపన్నులగువారు మాత్సర్య గుణమును విడచినయెడల మేలుగలుగును. మాత్సర్యగుణము ధర్మము నకు హానిదెచ్చును. ధర్మమునశించిన కీడుతోడ్పడును నేర్పరులగువారలు మాత్సర్యమును విడువవలయును. శ్రద్ధతో సాత్వికగుణ మవలంభించిన జ్ఞానముగలిగి శుభము గలిగించును. శ్రద్ధతో చేయని తపోయజ్ఞములు దేవతలు నిరాకరింతురు. శ్రద్ధతోజేసిన నంగీకరింతురు. శ్రద్ధయనెడి ధన సంపద మంచివాక్కుయొక్క మాధుర్యతయు, మంచి మనస్సును కలుగ జేయును. శ్రద్ధ జీవాత్మ పరమాత్మలకు సంయోగమొనరించును. అని పిచ్చికలు చెప్పగా తులాధారుండు జాజిలిమునితో నిట్లనియె.

ఓబ్రాహ్మణుడా! జాజిలిమునీంద్రా? బ్రహ్మగీతలను వాక్యములు గలవు, అవి చెప్పెదవినుము. యజ్ఞము చేయునపుడు శ్రద్ధగలిగియుండి పరిశుద్ధిలేకయున్నను పరిశుద్ధిగలిగి శ్రద్ధలేకయున్నను రెండు సమానమే యగును(శ్రద్ధగలవాడు గొప్పవాండ్రలో శ్రేష్టుడు) అతనియన్నముముఖ్య ముగా భుజించవలెనని సకలదేవతలువినుచుండగా బ్రహ్మజెప్పె మరియు ధనము వడ్డికియిచ్చి ఆధనమును భుజించుచు దానము చేయని లోభియ గువాడుసారహీనుడగును (వేదవేత్తతో) సమానముగాడని దేవతలుజెప్పి రి. అప్పుడు యజ్ఞమందు దానముచేసెడివాడు శ్రేష్టుడనిచెప్పిరి. దానగు ణము శ్రద్ధలేనివానికికలుగదు. యిట్లు బ్రహ్మదేవతలకుజెప్పియున్నాడు. కాబట్టి నీవు శ్రద్ధగలిగి నిర్మలుడగు పుణ్యాత్ముండవుగమ్ము. నే జెప్పిన మాటలునమ్ము పాము తనదేహము కుసుమరూపముచేత విడిపించుటకు నేర్చియున్నట్లు శ్రద్ధగలవాడు తనపాపమును విడుచుటకు సమర్థుడగును. గనుక శ్రద్ధధరించినవాడవుగమ్ము ఓమహాత్మా! జాజిలీ శ్రద్ధయను గుణ ముగల మనస్సునందు మాత్సర్యము కుచ్చితగుణములు బుట్టవు అనగా

జాజిలి తెలివిదెచ్చుకొని తులాధారునితో నిట్లనియె. నేను మునులవల్ల వేదాంతమార్గము వినియుండియు నామనస్సున పూర్వగుణములు శాంతముకలుగకపోయె యిప్పుడు నీవాక్యములవల్ల తెలియవచ్చినది యిఖనుశాంతిమరిగియుండెదననగా తులాదారుండు సంతోషించి యిట్లనియె.

ఓబ్రాహ్మణుడా! జాజిలి (మునీంద్రా) తమతమవర్ణాశ్రమ ధర్మములను తగిన కర్మలు చేయుచుండిన మేలుకలుగును. కర్మసన్యాసయోగముచేయుచు శ్రద్ధగలిగియుండవలెను. అనిచెప్పగా (జాజిలి) విని సంతోషచిత్తుడై వెళ్లెదనని చెప్పి వెళ్లె. తులాధారుడును తన కులధర్మమగు వర్తకము చేసుకొనుచు యిహపరసౌఖ్యములుబొంది అభివృద్ధిగలిగి తన బ్రహ్మజ్ఞాన గురూక్తిగలిగి జీవబ్రహ్మల (ఐక్యము) శ్రద్ధతోజేసి పరమాత్మస్వరూప దర్శనమందు నోలలాడుచుండెనని భీష్ముండుజెప్పిన ధర్మరాజువిని సంతోషించె యీజాజలి తులాధారులకథను వినగోరెడి వారలు సదా బ్రహ్మ విజ్ఞాన చిత్పరసాధను వృత్తిలో శ్రద్ధగలిగి సదానందమందుచుండెదరుగాక.

శ్లో॥ జీవన్ముక్తి స్తుతీ ద్వద్వార్ధ పూర్వోవాధి గుణాం స్త్యజేత్.।
నసచ్చిదాది ధర్మత్వా ధ్యేజే ద్భ్రిమరకీటవత్॥

తా. స్థూల సూక్ష్మాది శరీరములు సత్యాది గుణములును పరిత్యజించిన సుజ్ఞానమే జీవబ్రహ్మలకు ఆనందలీలావిలాసంబగు సంయోగమందించుచుండు.

కందార్థము.

సకల చరాచరమంతయు ప్రకటితముగ మిధ్య జేసి పదపడినీలో। వికటంబు లేక మెలగుము సకలేశుని గాంచుటదియే సాయుజ్యముగురా॥ గజిబిజిలేని ధ్యేయముగదరా॥ మాయకు వెలియైన మహానియ్య తేజము బాయనిచూట్కిలో బయలందుపొందుట। కాయమనియెడుపంజరంబున ఖం బ్రహ్మం పక్షిగన్గొని వాయు వశమగు కుంభకంబున వాలలాడుచు బయలుజేరుట । సాయుజ్యముగురా॥ గజిబిజిలేని ధ్యేయముగదరా॥

తా. చరాచరమంతయు తనలో మఱచి యీశ్వరసంయోగియగుటె సాయుజ్యము, దేహపంజరములోనున్న హంసనుకుంభించి తన్మయమందుటే సాయుజ్యముగా నెఱుంగనగును.

శ్రుతి॥ క్రియా నాశాద్భవేత్ చింతానాశో స్యాద్వాసనా క్షయః వాసనాపః క్షయోమోక్ష స్సజీవన్ముక్తి రిష్యతే॥

తా. సకల వ్యాపారములు నశించిన మెడల చింతలేకుండును. చింత లేకుండుటవలన వాసనాత్రయము నశించును. అట్లునశించుటే జీవన్ముక్తి యనఁబడును.

క॥ ఇది శివజీవులకైక్యం, బిది చిత్సుక సాధనంబు నిహపరమిచ్చున్ ।
గుదురుగ చిక్కాలంటును, పదిలంబుగశివునియందుపనుపడజేసున్॥

గీ॥ సర్వగీతార్ధ తత్త్వ ప్రసంగమిదియు ।
విన్న వ్రాసిన జదివిన విగతపాప ।
కర్తలై నిత్యమగుముక్తి గాంతురెపుడు ।
రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

ఈ జీవేశ్వర సంయోగ రహస్యమును నిమ్మళ్గా మనస్సులో గమనించి సంయోగమంది అఖండానంద సుఖమునను చుండెదరుగాత.

క॥ ఆనందోజ్వలయున్నని, నేనై సంగతులువిడచి నెగడుదునెంతున్ ।
నేనన్నే యెడనెఱుగక, నేనిన్నెఱుగినిదెప్రజ్ఞ సలప్రౌక్కవలెన్॥

క॥ రాదదికలలోగన్నది, లేదది దృశ్యంబుయెఱక లేనిజగంబుల్ ।
కాదది యెఱిగినబయలై, పోదదిప్రజ్ఞానమయము పొందినతోడన్॥

క॥ బయలందేచావుపుట్టుక, బయలందెపెరిగితఱుగు భావములెల్లన్ ।
బయలందెజగజ్జాలము, బయలునగను నిష్కళంకభావంబెపుడున్॥





ఓం.

శ్రీగణేశాయనమః.

౮. అనుభవసాక్షాత్కారము.

## సర్వేశ్వరుని ప్రార్థనము.

క॥ శ్రీకుండాదిగ దేవత, లాకర్ణ వినుతించు శివు విలాసముమదిలో ।
నాశించిసుధాంబుధిసం, కాశుండగునట్టియభవుఁ గాంచెదనెపుడున్ ॥

## శ్రీ వినాయక స్తోత్రము.

క॥ శ్రీకరముగ నిర్విఘ్నము, చేకొనియెద విఘ్నపతిని చింతిలిపిదపన్ ।
ప్రాకటముగ సుజ్ఞానవి, వేకము ప్రచురింపబుద్ధి వితమరినైతిన్ ॥

## శ్రీ సరస్వతి స్తోత్రము.

క॥ శ్రీవాణి నజునిరాణిని, వావిరి వాగ్గుంభణంబు పరకవితోక్తుల్ ।
పావీణ్యమూనిబలికెను, త్రోవను వసిగొనుట కేను తొలుతనుతింతున్ ॥

క॥ శ్రీమద్దిగంబ రేశగురు, స్వామికి వందనముచేసి చర్చితజ్ఞానం ।
బాముష్మిక శివజీవుల, కొమగునైక్యంబుజెప్పి నొలయగజేతున్ ॥

శ్రీ మహాభారతంబునంగల శాంతిపర్వంబున
భీష్ముండు ధర్మరాజునకు
శుకబ్రహ్మ పుట్టుకను తెలియం జేయుట.

ఓధర్మరాజా! మేరుపర్వతమునందు కర్ణికారమనెడి ఒకవనమున పార్వతీ పరమేశ్వరులు కేళీ విలాసంబుగా ప్రథమగణములతో గూడి యున్నప్పుడు వేదవ్యాసమునీంద్రుండు పుత్రసంతానముకై ఆవనమునకు వెళ్లి యోగబలముచే తపస్సుజేసి శివునిమెప్పించి ప్రత్యక్షమైన శివునికి నమస్కరించి ( పృథివి జలమగ్ని వాయురాకాశముల ) తో సమానమగుపుత్రుని నాకివ్వమని యడిగెను. అట్లేయిచ్చినానని శివుడు వాగ్దానమొసఁగి అదృశ్యుండయ్యె. పిమ్మట వ్యాసుండు అగ్నిహోత్రునికొరకు

అడవిలోపుడకలుజేర్చుకొనుచుండగా (ఘృతాచి) అనునొక అప్సరస్త్రీ వ్యాసునకుకనంబడె. దానిజూచినతోడనే (కామముగలిగె) ఆఘృతాచి వ్యాసులవారిఅభిప్రాయమెరింగి కపటముగా (చిలుక)రూపంబై యుండె. ఆస్త్రీ కనుపడక పోయినప్పుడు ధైర్యముగా విరహముతోనుండి పుడక లు జేర్చుకొనుచుండె నావ్యాసుండు కామవిరహాగ్ని బాధితుండై నంతు న ఆమోహపాశంబుచే యింద్రియస్ఖలనమై ఆపుడకలపై జారె అంత టవ్యాసుండు నిర్వికారమగు చిత్తముచే సమిదలుచేర్చి ఆశుకముమీద దృష్టియుంచుటవలన వ్యాసునితో సమానుడగు (శుకుండు) ఆసమిధల లో అగ్ని హోత్రునివలెప్రకాశించుచుండె నంత ఆకాశమున గంగాదే వి స్త్రీరూపధారియైవచ్చి ఆశుకునకు మంగళ స్నానము చేయించినతో డనే ఆకాశమునుండి శుకునిముందర కృష్ణాజినమున్ను కట్టయుక్రిందపడె , దేవతలు వాద్యములు ప్రయోగించిరి. దేవతాస్త్రీలు సంగీతనృత్యములు జేసిరి. హాశ్చర్యముగా పుష్పవర్షములుగురిసె ఇంద్రాది దేవతలు అక్క డికివచ్చిరి పార్వతీ పరమేశ్వరులున్ను వచ్చిరి. శుకునకు ఉపనయనము శివుడు చేయించె దేవేంద్రుండు ప్రకాశమానంబగు కమండలం బొసంగె యెప్పటికి నశింపని వస్త్రములు దేవతులొసంగిరి శుకుడుపుట్టినతోడనే వేదంబులు శుకుని బుద్ధియందు ప్రవేసించియుండె ఆశుకుండు బృహస్ప తిని ఆచార్యునిగాగోరె క్రమేణ బృహస్పతి చదివించగా నకలవేదములు తర్కవ్యాకరణాది వేదాంగములు ధర్మశాస్త్రములు రాజనీతి మొదలగు నవి సకలవిద్యలు అభ్యసింపుచు వ్రతచర్యలు నడుపుకొనుచు స్వర్గమం దుండెడి దేవతలు పూజించువాడై ప్రకాశింపుచు (శుకుడు) బాలులతో నాట్లాడుకొనుచు ఆత్మవిచారణ జేయంబూనక స్నేహితులతో నాడు చుండె అట్టి తన కొమారుని వ్యాసమునీంద్రుండుజూచి సాంఖ్యయోగ శాస్త్రములుపదేశించి అహంకారమమకారములంబోగొట్టె గనుక శుకు నకు జ్ఞానోదయమాయె బ్రహ్మచర్య వానప్రస్థ గృహస్థములనెడి మూడా శ్రమములయందు యిష్టములేనివాడై మోక్షమార్గమును దెలుపుమని

వ్యాసులవారినియడిగెను. వ్యాసులవారు ఓ పుత్రా? మోక్షమునెరిగిన విదేహదేశంబున (జనకమహారాజు) గల డతని వద్దికి సేవతివినయ గౌరవ ములతో వెళ్లి దెల్సుకోవలెననెను. నీవు ఆకాశమార్గమున వెళ్లకూడదు. పాదచారివై మిథిలాపురపట్టణమునకు వెళ్లి మునులచే పొగడబడుచుండు జనకమహారాజును వేడిన నతండు (మోక్షమార్గమును) నీకుమెరింగించగ లడు. (ఆ జనకజమహారాజు) దేవతలచేత పొగడంబడువాడగును అని చెప్పి కొమారుని ప్రయాణముచేసె నాశుకుండు మేరుపర్వతము మొద లగు అనేక నదులు వనములు నానావిధ దేశములు దాటి కష్టముతో మిథిలానగరపు ప్రాకార ద్వారప్రదేశముజేరె అచ్చటి ద్వారపాలకులు లోపలికి వెళ్లుటకు అడ్డగించిరి. అడ్డగించినను శాంతచిత్తముతో మాట లాడక నిలచియుండె ఆ ద్వారపాలకులు మౌనముగానుండు శుకులవారి నిజూచి భయకంపితులై జనకమహారాజునకు జెప్పిరి. వారిమాటలు జనకుండు నమ్మక తనమంత్రినిపంపె ఆమంత్రి (నిశ్చలుడై) యుంటజూచి రాజుగారికి దెలిపిన నతండు భక్తివినయములతో సకలమంత్రి పండితు లతో తానే నెత్తిమీద నీటిపాత్రనుంచుకొని తెచ్చి శుకులవారినిజూచి అతిప్రీతితో పూజించి భక్తితో తనగృహమునకు పిలుచకపోయి బంగా రునవరత్నఖచితమైన పీఠంబున కూర్చుండం బెట్టి తాను మంత్రివర్గ రా లందరును నేలగూర్చుండి అప్సరస్త్రీలవంటివేశ్యలు నాటక పాటక శృం గారములతో నాటలాడుచుంట శుకులవారుజూచి చలించకయుండె పిమ్మ ట అన్నపానములు చక్కగా జరిపించి ఆదినము నాల్గుజాములు శుకుల వారివద్దనేయుండిరి మృదుమధుర రసోక్తులచే మాటలాడుచుండిరి. ఆది నమంతా యిట్లుగడపి మరునాడు వుదయమున స్నానసంధ్యా వందనా దులగు కార్యములు తీర్చుకొని జనకమహారాజు అతివినయంబున శుకు లవారితో ఓమహాత్మా? మీరు యిక్కడికి రాకారణం బేమియని యడి గె. శుకుండు ఓ మహాత్మా? మ తండ్రియగు వ్యాసులవారు మోక్ష మార్గమును మీవద్ద గ్రహించమని, పంపగా వచ్చితిని గాన బ్రాహ్మ

ఘుండు చేయదగిన దెద్దియో దేనివలన మోక్షము పొందవచ్చునో తెలుపవేయనగా నాజనకమహారాజు మిక్కిలిసంతోషచిత్తుండై మోక్ష మార్గముపదేశించ దొడంగె నెట్లన. ఓ మహాత్మా? శుకమునీంద్రా? బ్రాహ్మణుండు ఉపనయనము చేసికొని బ్రహ్మచర్యాశ్రమమందుండి వేదాభ్యాసముజేసి వివాహము జేసికొనందగు పిమ్మటసంతానము గలి గినతోడ యజ్ఞముజేసి దేవపితృ అతిథుల పూజించి అగ్నిహోత్రము తోగూడా వానప్రస్థాశ్రమమును జరిపి సన్యసించి కాషాయము మొద లగు సన్యాస చిహ్నములు ధరించి అగ్నిహోత్రమును ఆత్మయందే గల్పించుకొని సకల కామక్రోధాదులను విడిచి పరమశాంతుడై బ్రహ్మ జ్ఞానమువలన పరబ్రహ్మ ప్రాప్తిని బొందిన సర్వలోక పూజ్యుండగునని చెప్పగా నాశుకమహామునివిని ఓరాజేంద్రా? జ్ఞానముపుట్టినపైన మూ డాశ్రమములు జరుపవలెనా, బ్రహ్మ తత్త్వజ్ఞానముగలిగినను పై ఆశ్ర ములుజరుపవలెనో జరుపకూడదోయనెడు సంగతి వేదములలోవున్నదో లేదో ఆవిషయములజెప్పి మోక్షమార్గమును దెలిపి నాకు గల సంశయ ములను దీర్చుమని యడుగగా నా జనకమహారాజు శుకమునీంద్రునితో జెప్పందొడంగె. ఓ శుకమునీంద్రా? శాస్త్రముయొక్క అర్థము తెలుసు కొనుట. (పరోక్షజ్ఞానము) అట్టి జ్ఞానమువలన విచారణజేసి బ్రహ్మము నేనేయని యెరుగుట (అపరోక్షజ్ఞానము) ఈ యపరోక్షజ్ఞానమే విజ్ఞానమ నంబడును. యీరెండును మోక్షమునకు సాధనములు యివిగురునివలన నంపాదించుకొని మోక్షమార్గమునుజూచిననాడు సాధనముల విడిపించు కొనును. పూర్వము మునులు లోకము చెడుననేతలంపుచే పుణ్యకర్మలు నశించకుండునట్లు నాల్గుఆశ్రమములను దృఢపఱచి యివిచక్కగాపూర్తి ఐతే మోక్షముకు మార్గమని చెప్పియున్నారు. ఒకానొక పుణ్యాత్మునకు అనేక జన్మసంస్కారములలో పరిపక్వమైనట్టి పుణ్యాత్మునకు ప్రారంభా శ్రమందే జ్ఞానోదయమగును. సాత్వికగుణనిష్టచే తమోగుణ రజోగుణ ముల స్వాధీనమును మాన్పుకొనవలయును. అట్టి సాత్విక నిష్ఠగలవాడు

ఆత్మస్వరూపమును చూడంగలడు. అట్టితనఆత్మను తానేచూచుటయే మోక్షముపొందుట. ఓశుకుడా? యయాతి వాక్యములుగలవు చెప్పెద వినుము. ఆత్మయందు ప్రకాశమగు జ్యోతియున్నది. (ఆజ్యోతిని) సమాధినిష్ఠుడగు ముని జూపంగలడు. తన వలన పరులకు భయముగలిగించనియోగి మోక్షమును చూడంగలడు. నిరాపేక్షుడైన యోగియగువాడు పరబ్రహ్మమునుపొందును. మనోవికారములు లేక యుండెడువాడు చూడంగలడు. తాబేలుచందంబున యేసంకటములు వచ్చినను తనలో తానై యుండెడువాడు మోక్షమును బొందం గలడని యయాతి చెప్పియున్నాడు. ఓ శుకమహామునిశ్రేష్టా? ఈ చెప్పబడిన జ్ఞాన వివేకమార్గములన్నియు, నీయందుగలిగియున్నవి మాతండ్రియొక్క కృపవల్ల నాకు సిద్ధించిన జ్ఞానమును నేజెప్పియున్న యీ విషయములకంటె అధికమయిన నివృత్తిపంచక జ్ఞానము నీయందధికముగా వెల్గుచుండుట నేనుగనుచున్నాడను నీకుబాల్యదశయందే సిద్ధించుటచూడగా నీకు జ్ఞానవిజ్ఞానములురెండును, సమగ్రముగా, నుండుటయే మోక్షము నీకుగల దృఢజ్ఞానమువల్ల పరోక్షఅపరోక్షములు యికను అభ్యసింపుము. మరియును నీవు మోక్షమునుపొందుటకు తగినదివ్యజ్ఞానివైయున్నావు. యేవిధమయిన లోపములు నీయందుగానను కాబట్టి సకలసంశయములు, విడిపించుము, నీవుచూచిన స్థానము, శాశ్వతమగు పరమాత్మ పదమగును, ఇట్లు శుకులవారు జనకమహారాజుగారివద్ద మోక్షమార్గమును తెలుసుకొని సంశయములు విడిచి పరమశాంతుడై తనలో తానే చూచుకొనుచు ఆకాశమార్గమందున హిమవత్పర్వతమువద్ద యుండెడి తనతండ్రి వద్దికివెళ్లెను, అక్కడివారందరు సంతోషించిరి. (అట్టి హిమవత్పర్వతమున) శివుండు ఒంటికాలితో అనేక సంవత్సరములు తపస్సుచేసె, పుత్రసంతానముకొరకు శ్రీకృష్ణుండు తపస్సుచేసె, మరియు కుమారస్వామితపస్సుచేసి అధిక తేజస్సుపొందె, అనేక దేవతలు తపోయాగాదిక్రియలుచేసి మెప్పువడిసిరి. ఆహిమవంతునికూతురగు పార్వతీదేవిని, శివుండు

•వివాహము చేసికొనియె, అట్టి మహోద్భుత క్రియలుగల పర్వతమున వ్యాసమునీంద్రుండని ఆశ్రమమున తనరూపము సూర్యునివలె ప్రకాశ మై యుండునప్పుడు, తన శిష్యులు చుట్టూ వేదపారాయణులై యుండు నప్పుడు శుకుల వారు తండ్రిపాదములపై బడి, నమస్కరించినతోడనే వ్యాసమునీంద్రుండు సంతసమంది, దూరదేశముపోయివచ్చిన కొమారుని జూచి, పరమానందంబున జనకమహారాజునకును కొమారునికిని జరిగిన వృత్తాంతంబడిగె. ఆసంగతులు యావత్తును కొడుకువల్ల వినిన పిమ్మట తన శిష్యులతోకూడా వేదములు చదువుచుండునట్లు శుకునకు జెప్పె. అట్లే శుకుండు వేదముచదువుచుండెను. ఒకశిష్యుండు వ్యాసులవారితో ఓదేవా! శుకుడు మొదలగు మా అయిదుగురికంటే నితరులకు మాతో సమానవిద్యను జెప్పకుండవలెనని మాకు వరంబొసంగ మనగా పక్షపా తములేని వ్యాసమునీంద్రుండు ఓశిష్యులారా? భక్తిగల బ్రాహ్మణు లకు వేదము లన్నియు చెప్పిన యడల నట్టి ఉపాధ్యాయునకు బ్రహ్మ లోకము అరిచేత యున్నదనెడి వాక్యము మీరు చదివివినలేదా యన గా వారు నొకరి మొకమొకరు జూచుకొని నవ్వియిట్లనిరి. ఓ దేవా! మాయిష్ట ప్రకారము మీరు ఆవరమివ్వని యెడల యీపర్వతముదిగి మేము వెళ్లము తమ కృపారసమును భూమియందుతిరిగ యజ్ఞములుచే యుంచము అనిరి. అందుకు వ్యాసులవారు మీరు నావద్దకి వచ్చినప్పుడే యీమాట చెప్పకపోతిరి యిప్పుడు మిమ్ములయిక్కడనుంచి పోనవ్వను మీకు అనేకకోరికెలు గలిగియున్నవి. గాన మీఅభిప్రాయముకు తగిన వరమడిగితిరి. యిట్టిపోకలు వదలమనగానే శిష్యులు గురుని పాదము లమీదంబడిరి. వారినిలేవనెత్తి ఓశిష్యులారా? మీయిష్ట [illegible] కార్యముచేసినను పొరబాటులేక చేయుచుండుమనెను. యీనాలుగులో కములయందు మీయిష్టమైన చోటున యుండుడనెను. దేశదేశములు తిరుగుచు యజ్ఞములుచేయించుచు శిష్యులతో తానుఆశ్రమమందుండు నప్పుడు (నారదమహాముని) ఆశ్రమమునకువచ్చి వ్యాసునితో నిట్లనియె.

ఓవ్యాసమునీంద్రా? మీఆశ్రమమునందు (వేదఘోషము) వినబడలేదని యడిగెను. అందుకు శిష్యులు యిక్కడ లేరని చెప్పగా నీకొమారుడున్ను నీవారున్ను వేదము చదువగూడదా యనగా వారిద్దరు వేదములు చదువ నారంభించిరి. ఆఘోషము గొప్ప భయంకరమైదోచె అప్పుడు అధ్యయనము చేయు కాలముకాదని చాలించిరి. అప్పుడు కొట్టుచుండెడు గాలిని శుకుండుజూచి తండ్రితో యీగొప్పగాలి యెక్కడిదని అడుగగా వ్యాసుండు జెప్పందొడంగె. ఓ శుకా? యేడుగురు (అదితిదేవికి) పుట్టినవారు సమాన ప్రపంచ వాయువు దేవులు వారిచేత వర్షము కురియును కురువకుండుటయును గలుగును. లోకానొకనాడు విష్ణుని శ్వాసము వేగముచే ఆయేడు వాయువులు అపరిమితమగు పెనుగాలిపుట్టును అట్టివేగమైనగాలి పర్వశమం దిప్పుడున్నది. యీగాలిలో చదివిన కీడువచ్చును. అని చెప్పుచుండగా గాలి శాంతించె గనుక వేదముచదువుమని వ్యాసుండు కొమారునకు చెప్పి గంగాస్నానమునకు వెళ్లె. అంతట శుకుండు వేదము చదువుచుండగా నారదమహాముని వచ్చి నీకు మేలు చేసెదనని నీ యిష్టమేదియో చెప్పుమనగా నాశుకుండిట్లనియె. ఓమహాత్మా?మనుష్య లోకంబున మేలు గలిగించు విషయమును జెప్పుమనెను అందుకు నారద మునీంద్రుండు పూర్వము (సనత్కుమారుడు) తనకు చెప్పిన వాక్యములు కొన్ని చెప్పెదవినుమని చెప్పందొడంగె. ఓ శుకమునీంద్రా! తపస్సు కంటెను సాత్త్విక గుణముకంటెను (జ్ఞానమే) సుఖము అట్టిజ్ఞానమే మోక్షమునిచ్చును. ఆత్మను ధ్యానించవలెను. మనోవికారములడంచవలెను అనగా ఓ నారదమునీంద్రా? మీరు చెప్పెడి వాక్యామృతమువలన నా మనోవ్యాధి నశించి కృతార్థుడనైతిని అట్టి యోగసిద్ధిని పొంది మీదయవలన అనుగ్రహము పొంది సకల సంకల్పమును దిగ్రమింగెదను. అని నమస్కరించి తండ్రివద్దకి వెళ్లి నమస్కరించి తననిశ్చయ తలంపును జెప్పె. నాశుకుని విజ్ఞానమునకు ఆశ్చర్యపడి పరమానందమును బొంది యుండు తండ్రినిజూచి ప్రదక్షిణము తిరిగి వెళ్లుటకు ఉత్సాహముగలిగి

యుండె. అట్టి శుకుని వ్యాసుడుచూచి ఓ పుత్రా? నీవు నానేత్రములకు సంతోషము కలిగించుచుంటివి. అయ్యో మోహమ్మున నన్ను నిలువుము అనగా తండ్రియందు స్నేహముంచక సంశయము లేనివాడై నిర్మలబుద్ధితో వెళ్లె. సిద్ధులు యోగాభ్యాసముచేయుటకు దగిన కైలాసపర్వత శిఖరమునకువెళ్లి తూర్పుముఖముగా కూర్చుండి పరమయోగముచేత పాదములు మొదలగు శరీరముయొక్క అవయవములను క్రమక్రమముగా ఆత్మధారణముజేసె. అంతట సూర్యుడుదయించగా కాళ్లు చేతులును విడిచిన తపస్సుచేత సూర్యుని ఆశ్రయించి విషయరహితమగు సర్వాత్మస్వరూపమగు పరబ్రహ్మమును స్మరించి శ్రేష్టమగు యోగక్రమమునుబొందె అక్కడికి నారదుండురాగా నీకృపవలన యోగసిద్ధినిపొంది మోక్షమునుజూచితి వెళ్లెదనని చెప్పి నిర్మలమగు యోగమహిమవల్ల గరుత్మంతునివలె ఆకాశమున కెగసిపోయె అట్లు పొయ్యెడి శుకునిజూచి సిద్ధసాధ్యులు మునులును జూచి ఆశ్చర్యమునొందిరి. యింత బాల్యదశలో. యీశుకున కిట్టి యోగసిద్ధి పొందెనుగదా యనిరి. యీసంగతి వ్యాసుండువిని శుకుని వెన్నంటిరాగా శుకుండు యోగబలముచే నదృశ్యుండై ఆయరణ్యమందు కనుపడెడి మృగ పక్షి పర్వతాదులంజూచి మీరునాతండ్రియగు వ్యాసమునీంద్రుడు నాపేరుపెట్టి పిలుచునప్పుడు ఓహోయని పలుకవలయును సుమీ. అనగా, అవి అట్లే పలుకుదమని చెప్పినవి అంతట శుకులవారు సత్వరజస్తమోగుణముల క్రమించి ఉత్తర దిక్కునకువెళ్లుచుండగా నొకమహాపర్వతముయొక్క రెండుశృంగములు శుకునకు అడ్డపడినవి. శుకుండు యోగబలిమిని వెళ్లుచుండగా అతనిదేహము తగిలి తునకలై విరిగిపోయినవి. అది దేవతలుజూచి పుష్పవర్షము గురిపించిరి. అనేకవిధముల ఆశుకమహామునిని దేవతలుస్తుతించిరి. అట్టి సమయమునందు ఆకాశగంగలో స్నానము చేయుచుండు అప్సరస్త్రీలు దిసమొలలతో స్నానముచేయుచుండిరి. శుకునిజూచి సిగ్గుపడక నిర్వికారులై యుండి కొమారుని కొరకు వ్యాసమునీంద్రుండు తనయోగ

ఓవ్యాసమునీంద్రా? మీఆశ్రమమునందు (వేదఘోషము) వినబడలేదని యడిగెను. అందుకు శిష్యులు యిక్కడ లేరని చెప్పగా నీకొమారుడు న్ను మీరున్ను వేదము చదువగూడదా యనగా వారిద్దరు వేదములు చదువ నారంభించిరి. ఆఘోషము గొప్ప భయంకరమైదోచె అప్పుడు అధ్యయనముచేయు కాలముకాదని చాలించిరి. అప్పుడు కొట్టుచుండెడు గాలిని శుకుండుజూచి తండ్రితో యీగొప్పగాలి యెక్కడిదని అనుగగా వ్యాసుండు జెప్పందొడంగె. ఓ శుకా? యేడుగురు (అదితిదేవికి) పుట్టిన వారు సమాన ప్రపంచ వాయువు దేవులు వారిచేత వర్షము కురియును కురువ కుండుటయును గలుగును. వొకానొకనాడు విష్ణుని శ్వాసము వేగ ముచే ఆయేడు వాయువులు అపరిమితమగు చెడుగాలిపుట్టును అట్టివేగ మైనగాలి పర్వతమం దిప్పుడున్నది. యీగాలిలో చదివిన కీడువచ్చును. అని చెప్పుచుండగా గాలి శాంతించె గనుక వేదముచదువుమని వ్యాసుం డు తోమూరామునకు వచ్చి గంగాస్నానమునకు వెళ్లె. అంతట శుకుండు వేదము చదువుచుండగా నారదమహాముని వచ్చి మెచ్చి నీకు మేలు చేసెదనని నీ యిష్టమేమియూ చెప్పుమనగా నా శుకుండిట్లనియె. ఓమహాత్మా? మనుష్య లోకంబున మేలు గలిగించు విషయమును జెప్పుమనెను అందుకు నారద మునిశ్రేష్ఠుండు పూర్వము (సనత్కుమారుడు) తనకు చెప్పిన వాక్యములు కొన్ని చెప్పెదవినుమని చెప్పందొడంగె. ఓ శుకమునీంద్రా! తపస్సు కంటెను సాత్వికగుణముకంటెను (జ్ఞానమే) సుఖము అట్టిజ్ఞానమే మోక్షమునిచ్చును. ఆత్మను ధ్యానించవలెను. మనోవికారములడంచవలెను అనగా ఓ నారదమునీంద్రా ? మీరు చెప్పెడి వాక్యామృతమువలన నా మనోవ్యథ నశించి కృతార్థుడనైతిని అట్టి యోగసిద్ధిని పొంది మీయొక్కని అనుగ్రహము పొంది సకల సంకల్పమును దిగద్రొంగెదను. అని నమస్కరించి తండ్రివద్దకివెళ్లి నమస్కరించి తననిశ్చయ తలంపును జెప్పె. నాశుకుని విజ్ఞానమునకు ఆశ్చర్యపడి పరమానందమును బొంది యుండెడు తండ్రినిజూచి ప్రదక్షిణము తిరిగి వెళ్లుటకు ఉత్సాహముగలిగి

యుండె. అట్టి శుకుని వ్యాసుడుచూచి ఓ పుత్రా? నీవు నానేత్రములకు సంతోషము కలిగించుచుంటివి. అయ్యొ యెచటికెళ్లవద్దు నిలువుము అనగా తండ్రియందు స్నేహముంచక సంశయము లేనివాడై నిర్మలబుద్ధితో వెళ్లె. సిద్ధులు యోగాభ్యాసముచేయుటకు దగిన కైలాసపర్వత శిఖరమునకు వెళ్లి తూర్పుముఖముగా కూర్చుండి పరమయోగముచేత పాదములు మొదలగు శరీరముయొక్క అవయవములను క్రమక్రమముగా ఆత్మధారణముజేసె. అంతట సూర్యుడుదయించగా శాఖ చేతులను విడిచిన తపస్సుచేత సూర్యుని ఆశ్రయించి విషయరహితమగు సర్వాత్మస్వరూపమగు పరబ్రహ్మమును స్మరించి శ్రేష్టమగు యోగక్రమమును బొందె అక్కడికి నారదుండురాగా నీకృపవలన యోగసిద్ధిని పొంది మోక్షమునుజూచితి వెళ్లెదనని చెప్పి నిర్మలమగు యోగమహిమవల్ల గరుత్మంతునివలె ఆకాశమున కెగసిపోయె అట్లు పొయ్యెడి శుకునిజూచి సిద్ధసాధ్యులు మునులు జూచి ఆశ్చర్యమునొందిరి. యింత బాల్యదశలో యీశుకున కిట్టి యోగసిద్ధి పొందెనుగదా యనిరి. యీసంగతి వ్యాసుండువిని శుకుని వెన్నంటిరాగా శుకుండు యోగబలముచే యదృశ్యుండై ఆయరణ్యమందు కనుపడెడి మృగ పక్షి పర్వతాదులంజూచి మీరునాతండ్రియగు వ్యాసమునీంద్రుండు నా పేరుపెట్టి పిలుచుచున్నాడు ఓహోయని పలుకవలయును సుమీ. అనగా, అవి అట్లే పలుకుదమని చెప్పినవి అంతట శుకులవారు సత్వరజస్తమోగుణముల ద్రిమ్మరి వుత్తర దిక్కునకు వెళ్లుచుండగా నొకమహాపర్వతముయొక్క రెండుశృంగములు శుకునకు అడ్డపడినవి. శుకుండు యోగబలిమిని వెళ్లుచుండగా అతని దేహము తగిలి తునకలై విరిగిపోయినవి. అది దేవతలుజూచి పుష్పవర్షము గురిపించిరి. అనేకవిధముల ఆశుకమహామునిని దేవతలుస్తుతించిరి. అట్టి సమయమునందు ఆకాశగంగలో స్నానము జేయుచుండు అప్సర స్త్రీలు దిసమొలలతో స్నానముజేయుచుండిరి. శుకునిజూచి సిగ్గుపడక నిర్వికారులై యుండి కొమారుని కొరకు వ్యాసమునీంద్రుండు తనయోగ

బలంబున కొమారుని వెదుకుచువచ్చె శుకుండు వాయుమార్గమునదాటి పోయె (సర్వాత్మస్వరూపుడాయె) ఆవ్యాసులవారినిచూచి ఆవస్త్రము లులేని అప్సరస్త్రీలు సిగ్గుచేసున్నారని వ్యాసుండు దివ్యదృష్టిచే కను కొని శుకుని ముక్తదశకు తన అభిమానదశకు సంతోషలజ్జగలవాడై యుండె. ఆపర్వతముమీాద నిలిచి ఓశుకుడాయని బిగ్గరఅరచి పిలువగా ఓహోయని వృక్షపర్వతములుబలికె అప్పుడు తనకుమారునిమహి మ తలంచుచు చింతాక్రాంతుడై యుండె. అపుడు దేవతలు మునులు సిద్ధులుమొదలగువారు పరమశివుండు వేదవ్యాసుని చింతపోగొట్టుటకై దగ్గరకు వచ్చి ఈకారణము నెఱిఁగి చెప్పగా నీవు తపస్సువలన నన్నుప్రసన్నపరచు కొని పంచభూతసమాన బలముగల పుత్రునికోరి పుత్రునిబడసి నాప్ర భావము వలనను నీతపోమహిమ వలనను (బ్రహ్మతేజోమయుడై) దేవతలకుసాధ్యముకాని పరమగతినిపొందె. అందుకు నీవుసంతోషించక దుఃఖించుట కారణమేమని యడిగి తిరుగా ఓవ్యాసమునీంద్రా? భూమి యు పర్వతసముద్రములు యెంతకాలమువరకు వుండునో అంతకాలము వరకు శుకునికీర్తియు నీకీర్తియు లోకమందు ప్రకాశించుచుండును. అని నిశ్చయించిచెప్పి నీవుపుత్రుని జూడకోరెదవేని శుకుని సమాన దేహకాం తి నీసమీాప మందెప్పుడునుండును. అట్టి శుకుని దేహచ్ఛాయనుజూచు చుండుము. ఇట్లు నీకువరమిచ్చితినని అనుగ్రహించి ఆవ్యాసమహాముని ని మిక్కిలి సంతోషింపజేసి నేనువెళ్ళెదనని చెప్పి వ్యాసుని తననివాసంబు నకుంబంపి పరమశివుండు కైలాసంబునకు వెళ్ళెనని భీష్ములవారు ధర్మ రాజునకుం దెలిపిరి గాన యిట్టిశుకమహామునీంద్రుని వృత్తాంతము మహా శ్రేష్టమయినది. ఈయితిహాసము నిర్మలమనస్సుతో చదివినను వినినను ఆయుస్సు ఐశ్వర్యము కీర్తి పుణ్యగతి పొందెదరుగాత.

## విదేహ కైవల్యస్థితి.

శివభక్తులకు శివసాలోక్యము, శివసామీాప్యము, శివసారూప్య ము, శివయోగులకు శివసాయుజ్యము, కలుగును. అట్లే విష్ణుభక్తులకు

విష్ణుసాలోక్య సామీప్య సారూప సాయుజ్యములు గలుగుచుండును.

సత్యసిద్ధికి, సన్న్యాసయోగసిద్ధికి, శుద్ధసత్వసిద్ధికి, బ్రహ్మచర్య సిద్ధికి, బ్రహ్మలోకము గల్గుచుండును. అర్చిరాదిమార్గమున ముక్తిజెందు వారికి గలుగునట్టి వైకుంఠకైలాసాది బ్రహ్మలోకములు పునరావృత్తి రహితములై పరమానందంబై యుండుటయే మోక్షమనంబడును. అవి యన్నియు కొంచము కొంచము భేదములుండుటంబట్టి శుద్ధముక్తియనం బడవు. బ్రహ్మలోకమునందు అట్టి ముక్తులైనవారలు (బ్రహ్మణాసహ ముక్తి) బ్రహ్మతోగూడా మోక్షముగలుగుచున్నట్లు, అట్టిలోకాది ప తియగు బ్రహ్మస్వరూపమునకు విదేహకైవల్యము గలిగినప్పుడు నిర్వికల్ప సిద్ధిగలవారై ముక్తాత్ములందరును పరమాత్మ్యతాఖ్య ముక్తి భేదబంధ విముక్తులై శుద్ధాద్వైత కేవల సుఖమగ్నులై యుందురని (సిద్ధాంతము) గనుక భగవద్భక్తి పిపీలికామార్గంబైన సగుణోపాసన (సగుణప్రాప్తి) అనంతరము నిర్గుణోపాసనయందు (నిర్గుణప్రాప్తి) యగుచుండు నిట్లు క్రమముక్తి ఫలము వచ్చుచుండును. ఇది భక్తియోగిసరణి నిర్వికల్పక యోగసిద్ధులైన కేవల జ్ఞానులకు జీవన్ముక్తి విదేహకైవల్యమే మోక్ష మగుచుండును. అజ్ఞానమే బంధము, తన్నివృత్తె మోక్ష మనబడున్ను. అయితే మోక్షము అభావరూపమగునోయని దలచరాదు. మోక్షముజ్ఞా నవిషయ తోప్వలక్షిత బ్రహ్మ స్వరూపంబగును (ఓంకార పాదశోజ్ఞా త్వా నకించిదపి చింతయేత్) ఓంకారావయవములు సృష్టిస్థితిసంహార తదభిమాన్యాది బోధకములు, ఓంకారమునకు సర్వవేద వాచకమయిన సగుణ బ్రహ్మ వాచార్థము నిర్గుణ బ్రహ్మము లక్ష్యార్థము గనుక ఓం కారమొక్కటే (సర్వవేదభూః) అని వేదముల పుట్టుక యనంబడును. (ఓంకారము) మంగళాంతార్థమయినదిగా నెన్నందగును.

శిష్యుని గుణస్థితి.

శ్లో॥ శ్రద్ధావాన్ లభతేజ్ఞానం తత్పరస్సం యతేంద్రియః ।
జ్ఞానలబ్ధ్వా పరాంశాంతి మచిరేణా ధిగచ్ఛతిః॥

అనగా, యథార్థశ్రద్ధ గురువాక్యమునందు నిశ్చలమగు విశ్వాసము గలిగియుండవలెను. జగదీశ్వరునియందు నిశ్చలమగు భక్తిగలిగి యీశ్వరుడే ( పరాగతిః ) అని దృఢముగా నిశ్చయముగలిగి యుండవలెను. ఇంద్రియములను జక్కగా స్వాధీనముచేసికొని యుండవలయును. ఇంద్రియ మనంబులు స్వాధీనముచేసికొని యీశ్వరునియందు సదా భక్తిగలవాడై గురుభక్తి గురువాక్యములయం దత్యంతాస్తిక్యము గలవాడయిన శిష్యునకు ఆత్మయందే మహాత్ములు తత్త్వదర్శులై జ్ఞానమును దృఢపరుచుచుందురు. అట్టిపుణ్యాత్ముండైన శిష్యునకు జిరకాలము మనన నిదిధ్యాసనములవలన నపరోక్షజ్ఞానము తనంతటానే నాత్మయందు బుట్టుచుండును. అట్టిపరమభక్తునకు ఆత్మస్వరూపము పూర్ణముగా హృదయమందు ప్రకాశించును. అప్పుడు ( అహం బ్రహ్మాస్మి ) యను యథార్థజ్ఞానము బుట్టి ( బ్రహ్మవేత్తయై ) ( బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి ) అనునట్లు బ్రహ్మస్వరూపుడే యగుచుండును. అట్టి మహాపురుషుడు శరీరధారిగానుండినను ముక్తుడేయగును ( జీవన్ముక్తుడనదగి యుండును ) మాయను జయించిన వాడగును. అతడు గుణాతీతుడై వర్తించుచుండును. యిట్లు శ్రీకృష్ణుండు గీతాశాస్త్రమందు అర్జునునకు బోధించియున్నాడు.

( సీతారామాంజనేయమునందు. )

పంచచామరము.

మనంబె స్థూల సూక్ష్మము ల్ప్రమాతృమాన మేయముల్ ।
మనంబె కామ రాగ రోష మత్సరాది వృత్తులు ।
మ్మనంబె సర్వ ధర్మము ల్మనంబె బంధమోక్షముల్ ।
మనంబె దృశ్యమంతయుఁ గ్రమంబుచే నెఱింగినన్॥

క॥ మాయా ప్రతిబింబంబును
మాయాధిష్ఠానపరము మాయయుఁగూడన్ ।
మాయావిద్యైన యీశుఁడు
మాయికుడగు నతడు బ్రహ్మ మయుడై యుండున్॥

మత్తకోకిల. భానుతేజము నాశ్రయించి స్వభావకర్మము లందనీ ।
మానవు ల్విహరించుకై వడి మత్ప్రకాశము నంటెధీ ।
మానసేంద్రియముల్స్వకీయ సమస్తకార్యములందొగిన్ ।
మానసకం జరియించు నెందభి మానపూర్వక వృత్తులన్ ॥

పంచచామరము.

అసంగుడైన బ్రహ్మమం దనాది మాయ లేనిదై ।
ముసుంగుగప్పి నట్లు నిండి మూలకారణాంశమై ।
పొసంగి విశ్వమందుజేరి భూతభాతికాదులై ।
మసంగిబుట్టి జచ్చుచుండు మారులేకనంతటన్ ॥

పంచచామరము.

చరాచరంబు లంటిమాయ చౌకళించి ప్రాణులన్ ।
ఝరాఝరిన్ జనన మరణ జాడలంద జూపుచున్ ।
తరాతరంబు సొల్వడంగ తాఁబ్రసంగ దానమై ।
పరాపరాత్మ నంటనీవక బ్రాకుచుండు నంతటన్ ॥

పంచచామరము.

పురాకృతంబు నంటిమాయ పొసగజేయు వృత్తులన్ ।
నిరాపరాధులై మనంబు నిల్చుభక్తి యుక్తిచే ।
గుహాత్తినంటి బుద్ధినొక్కి కుహరమధ్య జేర్చగా ।
గరిష్ఠమైన ప్రత్యగాత్మ గ్రాలుచుండు నెప్పుడున్ ॥

పంచచామరము.

వరించి బ్రహ్మతత్పదంబు వాలుగంటిచూపులో ।
భరించి త్వం పదార్థసాక్ష భావమైక్యసిద్ధిగా ।
స్మరించి ప్రత్యగాత్మనంటి స్వప్రకాశచిత్తుడై ।
చరించు బ్రహ్మవిద్వరుండు జైత్రుడై జగంబులన్ ॥

పంచచామరము.

సుసంగహృదయ మందిపొంద సూక్ష్మతేజ బ్రహ్మమే।
ప్రసంగ మంద రాని జెచ్చ ప్రత్యగాత్మలోనిదై।
యొసంగు సూర్య చంద్రవహ్ను లిచ్చమీరి నప్పుడా।
యసంగునందు మాయమాయ నందిపొంది మించినర్॥

పంచచామరము.

చనుపుమీర డెందమందు చందమామకాంతిలో।
మనోవికారము ల్గ్రసించి మహిత తత్త్వ జ్ఞప్తిచే।
ననర్ఘ శాంశ స్థైర్యమూని నందిపొంది మించగా।
సనాతన స్సమన్వితంబు స్వప్రకాశ సిద్ధగుర్॥

కందార్థము.

శ్రీగురువాక్యవిశేషము। చేగాకపరానుభూతి। జెందరుమను జుల్। యోగములో గురియగుహ్యా। త్యాగమునను కోర్కెమీరి ♦ తమమణచుమయ్యా ♦ నియతాత్ముడై ♦ భ్రమలణచుమయ్యా♦ బోమ ముడిపై జ్ఞప్తి। బూనిగుర్తించెను। విమలనిర్గుణమూని। విజ్ఞాతుడై యుంను। శమదమాదిక గుణకదంబము। శక్యపడగని నిత్యసుఖమున। క్రమముగాతేలాడివలగోని। కౌశలంబగు ధ్యానపరమున ♦ తమమణచు మయ్యా ♦ నియతాత్ముడై ♦ భ్రమలణచుమయ్యా॥

కంధార్థము.

సూటిగను విశ్వరూపము। నాటినమది నెత్తిగిచూట్కి। నామా రుతమున్। మీటుచుకాటుకపక్షుల। మాటుననాశిఖరమెక్కి ♦ మమ తవిడద్రొక్కి ♦ దహరాకాశ ♦ క్రమమెత్తిగినిక్కి ♦ విమలవిలోకివై। వివరించినిన్నుంచి। సమగురిదాటుట। సంకల్పశూన్యము॥ యమనియమ యోగాదివృత్తుల। యందుజేరక పూర్ణమునగురి। యమల మవ్యయ నిర్వికల్పక। మందిమదిలోనింపు ప్రభగని ♦ మమతవిడద్రొక్కి ♦ దహ రాకాశ ♦ క్రమమెత్తిగినిక్కి॥

## ద్విపద.

శ్రీకరనికరమా - చిరజీవముక్తి॥ చేకొనఁగోరుచో - శివపాదభక్తి॥
ప్రాకటంబై యొప్పు - పరమగురూక్తి॥ సోకినావెంకనే - సూక్ష్మానురక్తి॥
పూనినవెంటనే - పురికొనియుక్తి॥ మానకగురుభక్తి - మనగనుశక్తి॥
ధ్యానయోగముబూని - దర్శనమంది॥ స్వానుభవంబాయెను - స్వర్గము
నొంది॥ సాధువృత్తివహిమ్మి - సంధానమూని॥ వేదవేద్యమటంచు - విను
వకపూని॥ తానగుగురునాజ్ఞ - తగిలిపెట్టెదెను॥ జ్ఞానోదయంబుచే- జ్ఞప్తి
కినిరవు॥ సచ్చిత్స్వరూపముఁ - సాధించవలెను॥ మచ్చికబుషులకు -
మానమేయగును॥ సత్యముబయలని - సన్మార్గమునులు॥ నిత్యనిర్గుణ
మూని - నిలతురుఘనులు॥ పుట్టుచావులులేని - పూర్ణమూహించి॥
గుట్టుచెదరనిపట్టు - గుప్పించిపొంచి॥ నియమాత్మలోబుద్ధి - నిలిపిపవిత్ర
తము॥ నయమాత్మబ్రహ్మమై - యందెనుజపము॥ మనసు మారుతదృష్టి-
మహాతత్వజ్ఞప్తి॥ పనువడబ్రహ్మమయి - ప్రబలుటోత్పత్తి॥ గురుపాద
భక్తిచే - గుర్తించవలెను॥ స్థిరమార్గమనిదీని - చింతించవలెను॥ తెలియ
బోధించెద - తేటగురూక్తి॥ అలవిగాదనరాదు - అంజకభక్తి॥ పొందిన
మదిలోన - పూజ్యనిమెంచి॥ దంధనలస్నయు - తాన్కొనమించి॥ మును
కొనిపరమాత్మ - మూలముందలచి॥ కనిగ్రుష్లునిలద్రొక్కి- కాయమున్మ
రచి॥ సత్యసంస్మరణులై - సంభృతియుపము॥ నిత్యనిర్గుణమెన్ని - నిజ
రూపజపము॥ సద్రూపమునజేర్చి - సమదృష్టినంటి॥ చిద్రూపగమ్యులై -
చిత్పరమంటి॥ భద్రమహాషడ్చక్ర - భావముల్ మరిగి॥ ముద్రలుమంత్ర
ముల్ - ముక్కనుమెరిగి॥ బోధించిధీసాక్షి - బామముడిసాజ్ఞ॥ శోధిం
చిలోమించి - సుస్థిరప్రజ్ఞ॥ సహస్రారమునజేర్చి - సమదృష్టిబూని॥ సిహ
పరవాంచలు - నిరతియుమాని॥ పోరుచునాదంబు - పురికొల్పివినుచు॥
పనిబూనినిశ్శబ్ద - ప్రతిజ్ఞేయుడగుచు॥ బారెనుహంసను - బట్టిరేచించి॥
పూరించికుంభించి- పురికొనిమించి॥ దక్కంగబూనతే- తన్మయజపము॥
నిక్కంబుగానాత్మ - నిదిధ్యాసతపము॥ హత్తించి మదిపూర్ణ - హంసై

క్యమూని॥ పొత్తునయెఱుకను - పోకార్చపూని॥ తెలియుతెల్వియె తెల్వి
తేటమౌహంస॥ గలియుటసంయోగ-గమనైక్యమంస॥ నిర్మలనిజరూప-
నిర్గుణమొదవు॥ సన్మిలిపరమాత్మ - మయిక్యమేయిరవు॥ ఏపుమీరిన
తోడ- ఏకాంతమునయె॥ చూపునకందని చూపననదియె॥ పోహణలన్ని
యు- పుణ్యులోనునచట॥ లాహిరిమించిన-లయమందునచట॥ నిండినప
రిపూర్ణ-నిశ్చిద్రమూని॥ పండినండినతోడ-బయలగుదాని॥ యాదిమధ్యాం
తంబు- సందరాదెపుడు॥ ఆదికనాదినై- యనువొందదెపుడు॥ పొందిన
రిచ్ఛలో-పురడించుచుండు॥ సంసారాదేరికి-సచలమై యుండు॥ పాలునీరును
జేరి- పక్వమైనట్లు॥ మేలుకీసునురెండు- మెలగియున్నట్లు॥ పదునాలుగు
లోకముల్- ప్రబలియుంకటను॥ యెనరుగానుండుట-యెరుగరెవ్వరును॥
అజ్ఞానక్రతువుల-కనువొందకుండు॥ సుజ్ఞానబ్రహ్మంబు-సూక్ష్మమైయుండు॥
వాయువశంబున వశముగాదదియె॥ బాయనినిష్టలో బయలగునదియె॥
నేత్రోత్సవంబున-నెలకొనబోదు॥ యాత్రలలోనైన-యనువొందరాదు॥
దేహమున్మరచిన-దేహికెంతెను॥ మోహమునంటక-మురియులేమోక్ష॥పది
లవహాసుజ్ఞాన-పరతత్త్వమంద॥ కుదరికెతోజ్ఞప్తి-కూర్చిపెంపొంది॥ ధ్యాన
సమాధిలో- తన్మయుండగుచు॥ పూనియుండెడిజ్ఞప్తి - పొందికగ్గనుచు॥
చూపులలోనుంచి- చూచుటమరచి॥ దాపైనయెఱుకను.తగిలితన్మరచి॥
నప్పుడైకైవల్య-మచలభావంబు॥ యెప్పునునస్తోక-ముజ్వలాంశంబు॥ ఏదే
దినిజమని- యెరిగించునెఱుక॥ సాధనలోగాని-సమసిపోదెఱుక॥ నాకమ
నాదమై- యన్నిటనిండు॥ జోకతోపరమాత్మ- జ్యోతియైయుండు॥ నా
నావిధంబుల- నడయాడుచుండు॥ పూనిస్మరించుట- పూతమగుచుండు॥
జీవాంశపరమయిన - చిద్బ్రహ్మమగును॥ భావాన్వితంబైన- బయల
దేయగును॥ నిజగింబులుమిథ్య - నిజమచలంబు॥ రాజిల్లుపరమాత్మ-
రక్షితవ్యంబు॥ బట్టబయలయినయా - బ్రహ్మంబు నెంచి॥ గుట్టు చెదర
నిపట్టు - గుప్పించిమించి॥ పట్టుగాద్వాదశి - పలుకులునమ్మి॥ చిట్టాడి
పూర్ణుడై- చింతలుబిమ్మి॥ యుత్తదీబయలనే యుపలంభమంది॥ పొత్తే

మిలేదనే - పొందికన్పొంది॥ యష్టాక్షరంబుల- ననువుగామరిగి॥ నిష్టలో
షోడశి-నిజమూను బెరిగి॥ విదితయోగాతీత- వేదవేద్యంబు॥ సదయతలో
మించ- సత్యాస్పదంబు॥ యవిరళబ్రహ్మంబు- యచలమాజ్ఞప్తి॥ ప్రవరు
లకందును - ప్రావీణ్యముక్తి॥ యిదియెపోగోప్యంబు - నెరుగ రెవ్వరును॥
నీదివ్యబోధచే - నిర్గుణమగును॥ వింతలన్నియుసున్న- విద్యోతకముక్తి॥ పం
తంబుగానెంచి - పాలించముక్తి॥ సందియమేలేను - సాధనయుక్తి॥ అం
దిపొందెనురీతి- యనుభవముక్తి॥ నునుకొనిహర్షించి- మూలమున్గనుచు॥
పనిబూనిబ్రాసితి - పరిత్రాణమనుచు। వినికనియెరుగని- వెడగులకైన॥
కనివినియెరిగిన - గతిముఖ్యమైన॥ శివమొందజేసి- సంసీలులజేయు॥ భవ
హారంబైనట్టి - భవ్యమున్జేయు॥ భావము మించెడి - బ్రహ్మగురూక్తి॥
సేవజేయకగాని - చిక్కదుయుక్తి॥ ధ్యానించువారికే - దప్పణమిదియె॥
జ్ఞానయోగమునంట - గమకించునిదియె॥ ప్రాలుమాలనిబుద్ధి - పట్టిసా
ధించి॥ గ్రాలుచుండెడియాత్మ- గతిపొందమించి॥ మరిగినతోడనే- మైమ
రపుబుట్టు॥ యెరిగమరిగినతోడ - యేకమైనట్టు॥ సత్యములోనెంచి -
సాధించనగును॥ నిత్యమాముక్తికే - నావిదేయగును॥ కల్పనయనిలోన-
గమనించరాదు॥ స్వల్పముగానెంచ- సఖ్యంబుగాదు॥ హరిహరబ్రహ్మల-
కలవిగాదిదియె॥ స్థిరమోక్షసిద్ధికే - శివమొసగునిదియె. పరిపూర్ణమని
దీని - పాలించనగును॥ గురుతరంబుగనాత్మ - గుర్తించవలెను॥ గురుభ
క్తులైముక్తి - గుర్తించపోరి॥ యురకించుతేసాక్షి - యున్మనిదారి॥ కా
యమున్మరచియా - ఖం బ్రహ్మ దగిలి॥ నాయురారోగ్యులై - యచల
మున్ పొంది॥ పరివశ్యులై భువిని - వర్ధిల్లవలెను॥ నిరతిశయానంద - నిజ
తత్త్వమిలను॥ మీరివర్ధిల్లుడు - మినుకుసత్యంబు॥ సతతమున్ జదివిన -
సందర్శనంబు॥ మతిసుఖమోక్షంబు - మననంబుగల్గు॥ నెందాకరవిచెం
ద్రు - లెందాకనుదధి॥ నెందాకతారలు - నెందాకపృథివి॥ నెందాకనా
కాశ - మెందాకనధులు॥ నందాకనీకృతి - యవనియందుండి॥ యను
వొందజేయును - నాత్మానురక్తి॥ సౌష్టవగురుభక్తి - సత్యమాగాత॥

అహం బ్రహ్మాస్మి మంత్రోయం జన్మ పాపం వినాశయేత్ । అహం బ్రహ్మాస్మి మంత్రోయం భేదబుద్ధిం వినాశయేత్ । అహంబ్రహ్మాస్మి మంత్రోయం కోటిదోషం వినాశయేత్ । అహం బ్రహ్మాస్మి మంత్రోయం జ్ఞానానంద ప్రయచ్ఛతి । సర్వమంత్ర సముత్సృజ్యః । ఏతన్మంత్రంసమభ్యసేత్ । సద్యోమోక్షమవాప్నోతి నాస్తి సందేహమన్వపి॥

శ్లో॥ యదానందరూపప్రకాశస్వరూపం,నిరస్తప్రపంచంపరిచ్ఛేదశూన్యం। అహంబ్రహ్మవృత్త్యైకగమ్యం, తురీయంపరబ్రహ్మనిత్యంతదేవాహమస్మి॥

అనగా ఏతత్త్వము సుఖాత్మకజ్యోతియై తానై నదో ప్రపంచరహితమైనదో స్వాతిరిక్త స్వగతభేద రహితమో నేనే పరమాత్మయను మనోవృత్తియొకటిచేతనే దెలియం దగినదో అట్టి తురీయ మందు పరబ్రహ్మమే నేనై తినని భావము.

వి. అహమనుపదము లక్ష్యార్థము ఆత్మకేనని చెప్పంబడును. బ్రహ్మము అనుపదముకు తనకుతానే పరిపూర్ణముగానుండు పరమాత్మ లక్ష్యార్థము అట్లు సర్వత్రపరిపూర్ణమైయుండు (పరమాత్మయే) నా దేహమందు జీవసాక్షిగానుండి అహమనితోచుచున్నది గాన (నేనే బ్రహ్మము బ్రహ్మము నేనే) యని అస్మి యనగా నైక్యమును జూపుచున్నదియని యెంచనగు నిది గాక వేదాంత పంచదశిలో (నిర్వికార బ్రహ్మమునకు) నొకదృష్టాంతముగల దెట్లన ఒకనాటకశాలయందు దీపము ప్రకాశము వల్ల (సభవారు నాటకులు) ఆటలు పాటలు (విచిత్రములు) కానంబడు చుండును. (ఆప్రకాశముమట్టుకు నిలిచి) సభవారు వెళ్లినతర్వాత సాక్షిగా ప్రకాశముమట్టుకు నుండునట్లు (ఆత్మ సాక్షిగా) జాగ్రత్స్వప్నములకు అహంకారాదులకు (ప్రకాశమానంబై) సాక్షిగానుండును కాబట్టి జీవునకు యేవికారంబునుబొందినను సాక్షియగును. పరమాత్మ నిర్వికారుడుగా సాక్షియై యుండునట్లు ఆత్మ దేహమున నిర్వికారము గానే యున్నట్లు గ్రహించనగును.

మత్తకోకిల. ఉత్తమాయులు పోరుజ్ఞానులు సూరికేచరియింతురా।
యెత్తుమీదను భూతగుణములు యేకముగ గావింపుచున్।
సత్తులో సదసత్తుగలియగ సాధనములకు చక్కనై।
పొత్తుబను బ్రహ్మాంబులోపల పూర్ణమై నాయందునే॥

అష్టాక్షరి ఓం నమోనారాయణాయనియును ద్వాదశాక్షరి ఓం నమోభగవతే వాసుదేవాయయనియును సంస్కృతములో నుండెడి (అయం వ్యర్థం బాహ్యోకోపీన భవతి) అనగా (ద్వాదశి మంత్రము) తెనుగున (ఉత్తదీ బట్టబయలు యేమిలేదు) అనిబోధించి స్మరించు చుండమనెదరు. అట్లే పంచదశి సంస్కృతంబుననుండెడి (స్వప్నే ప్రతీయమానాని రూపాణి యథాతథా) అనియును తెనుగున (కలదోచిన శరీరములేలాగో ఆలాగే) యని బోధించి స్మరించు చుండుమనెదరు. అట్లే షోడశాక్షరి సంస్కృతములో (మూలాభావ మిదం జ్ఞాత శరీరం కిమునాస్థిహి) అనగా తెనుగున (మూలములేని గుర్రెరిగే శరీరం యేమి లేదు) అని బోధించి స్మరించుచుండుమనెదరు. వారివారి యిష్టానుసారముగా శిష్యులకుపదేశము చేయుదురు. హంస బీజమంత్రము (ఓం హ్రీం శ్రీం హం సం) అను హంస పంచబీజములను షణ్ముఖముద్రచే ఓంకార ధ్వనివినుచు రేచకపూరక కుంభకములలో నీబీజములను ధ్యానించుట హంసబీజాక్షర యోగముగా దెల్పి ధ్యానించి పరవశులై విదేహముక్తి అనగా పరిపూర్ణానందమును బొందుడని వివిధోపాయంబులచే స్మరింపం జేయుచుందురు. యిందుకు ముఖ్యము మనస్సు బ్రహ్మానందము జెందుటే ముక్తిగా గ్రహించనగును.

౧. ఓం మిత్యేకాక్షరం బ్రహ్మ ౨. సర్వం ఖల్విదం బ్రహ్మ।
౩. ప్రపంచస్వరూపం బ్రహ్మ ౪ సత్యజ్ఞానమనంతం బ్రహ్మ।
౫. ఏకమేవాద్వితీయంబ్రహ్మ ౬. ఏకమేవాతత్పరం బ్రహ్మ।
౭. స్వయంప్రకాశంబ్రహ్మ ౮. అఖండానందాద్వయం బ్రహ్మ।
౯. ఏకోనారాయణః ౧౦. దేవ ఏకోనారాయణః।

౧౧. ప్రజ్ఞానం బ్రహ్మ ౧౨. అహంబ్రహ్మాస్మి ।
౧౩. అయమాత్మా బ్రహ్మ ౧౪. తత్త్వమసి॥

యిట్లుఅనేక ప్రమాణములచే నిరూపించెడి పరబ్రహ్మస్వరూప ధ్యానమును సద్గురూపదేశంబున నెరింగి సుజ్ఞానతత్త్వ పూర్ణోదయ మంది మనస్సును బ్రహ్మమునందు లయింపు జేసుకొనుటయే బ్రహ్మానందము మోక్షము విదేహముక్తియని గ్రహించందగు.

చ॥ అగునపరోక్ష మాత్మగతి నంత మెఱింగి గణించువానికిఁ ।
దిగులెడబాసి ఘనతేజము దెల్విచేగన్న భక్తుసాక్షాత్కారం ।
బొగిగనుతన్నుదానెఱిగి మదియుప్పిన దుఃఖనివృత్తియంతదా ।
మిగులగ సందియంబుడిగి మేలుగనుంగొని యుంటమోక్షమా॥

కందార్థములు.

ఆధారకమలవాసుని । మేధాత్మునివిఘ్నపతిని । మెఱుగువతోడఁ । సాధించితత్పరంబగు । బోధామృతపానమంద ♦ పూజింతు. నిపుడు ♦ నిర్దోషుఁడై ♦ రాజిల్లునెపుడూ ♦ రాజమార్గమూని । రహీనీరకుంభించి । తేజరిల్లగోరి । తెరబయలుజేసుక । భ్రాజితంబగుబ్రహ్మకళలను । పరివృతంబై ముట్టగోరెను । తేజమునుగమకించిమన్మయ । తెట్టతెరవగునిట్టనిలువున ♦ పూజింతునిపుడు ♦ నిర్దోషుఁడై ♦ రాజిల్లునెపుడు॥

శివజీవైక్య రహస్యము । భవహరమై వెలయుచుండు । భద్రదమగుచుఁ । పవనముతోడ్పడిబుద్ధిని । శివపరమగుబయలఁజేర్చి ♦ సేవించుచుందు ♦ హృద్వీధిలో భావించుచుందు॥ జీవరత్నంబైన । చిన్మయమూర్తిని । శైవరత్నమునందు । జేర్చిసంభావించు । దోవలోగురిరేచకంబును । దొడరిపూరకమూనితత్త్వము । భావపరమగు । కుంభకంబున । పట్టువిడకను తన్మయుండై ♦ సేవించుచుందు ♦ హృద్వీధిలో ♦ భావించుచుందు॥

నరజన్మమెత్తినందుకు। గురుశిక్షనుపొందవలెను। కుంభినిలోనరా। గురి గుర్తులేని వారిల । నరయగలేరెందు పరము ♦ నమ్మునామాట ♦ ఇంగితమెరిగి ♦ పొమ్ము యీబాట ♦ రమ్మురమ్మనినేను । రాకపోకలు మాన్ప । సొమ్మునీకిచ్చెద । శుద్ధోహమబ్బును । జిమ్ముగుణములు నెంచక నుమరి । చనకియాత్మను జేరనేర్పుచ । నెమ్మిలోననిదర్శనుండై । నిరుప మానంద మయమందెదు ♦ నమ్మునామాట ♦ ఇంగితమెరిగి ♦ పొమ్ము యీభాట॥

ఏవిద్యలెన్ని నేర్చిన। నీవేదాంతాంతమూల। మెఱుగకయున్నను। కైవల్యమందనేరవు । జీవునకిదెచిత్పరంబు ♦ జెందగనగురా ♦ నిత్యా నంద ♦ మందునువినరా ♦ సందేహములనెల్ల సాధించిశోధించి। పొందు పడగతత్వ । పూరితహృదయుడై । యందు నిందును జూడకనుమరి । యవగతుండై యుండునెమ్మది । నందిచూట్కొని చూపుచెదరక । నంది తంభగు తన్మయంబును ♦ జెందగనగురా ♦ నిత్యానంద ♦ మందును వినరా॥

యోగాభ్యాససమాధిని । బాగుగజపముద్రలంది । భద్రాసనుఁడై । వేగమెగురువరమంత్రము । సాగించుటమనసుకుదిరి ♦ సమకొను నయ్యా ♦ శిక్షితబుద్ధి ♦ తమమణచునయ్యా ♦ నిమిషమాత్రమీాపు । నిర్గుణజ్ఞప్తిలో । మమకారగమునుద్భంచి । మైమరచినంతట । నమలమ వ్యయమప్రమేయము । నాది బ్రహ్మానందతాండవ । విమలగోచరకరము గామది । వెలయుచుండెడి బ్రహ్మభావము ♦ సమకొనునయ్యా ♦ శిక్షిత బుద్ధి ♦ తమమణచునయ్యా॥

దేవుడువేరేగలఁడను । భావముమదినుంచకీవు । ప్రజ్ఞానిధివై । దేవునిగనకుండినయూ । జీవునికీజడమువిడదుచెవియొగ్గివినరా ♦ చిత్పర మందే । రవములోవినరా ♦ భవబంధములనెల్ల । భంగముగావించి । గవిసినిశ్శబ్దుడై । కళలంటిగణుతించు । వ్యవహితుండై నాదుబిందువు వర్జమనికళలంటిదాటగ । శివసోహం హంసధ్యానము । శీఘ్రకరంబగు ప్రణవరవళిని ♦ చెవియొగ్గివినరా ♦ చిత్పరమందె ♦ రవములోవినరా॥

లోపల వెలుపల వెలిగెడు । రూపము నీవనుచు నెఱిఁగి । రూఢిగ గనియూ । దాపున మాయను ద్రొక్కెడు । చూపున పరిపూర్ణమంది ♦ జూచేదేమన్న ♦ లోచూట్కెలో ♦ తోచేదేమన్నా ♦ యోచనకందని యూహానుమది జేర్చి । తోచితోచనియట్టి । తుర్యాతీతమునందు । నీచ [illegible]తులీ నిజమెఱుంగక । నిచ్చమెచ్చుచు వదరుచుందురు । వాచకాదుల వల్లగానిది । వాదులకువర్ణింపరానిది ♦ జూచేదేమన్న ♦ లోచూట్కెలో ♦ తోచేదేమన్న ॥

సర్వము నీవగుజ్ఞప్తిలో । సర్వమునిరసించిపిదప । సర్వజ్ఞుఁడవై సర్వమునీలోమఱచిన । నిర్వాణమె బ్రహ్మపదవి ♦ నెఱయుమోరన్నా ♦ అంకించినీలో ♦ గురిదాటుమన్నా ♦ కరమొప్పు సహస్రార । కమలకందళి తన । చ్చరితుడైనబ్రహ్మ । సౌహ్యాద్యమునుగోరి । యురముననుగురినిలిపి తన్మయ । మూహాలోనేతలపునిలిపిన । పరమనిర్గుణనిర్వికల్పము । ప్రాక టంబగు బట్టబయలగు ♦ నెఱయుమోరన్నా । అంకించినీలో । గురి దాటుమన్నా ॥

కలలోన గనినసంపద । మెఱుకువలోఁ గాంచునటర । మేదిని లోనఁ । గలభోగభాగ్యగణములు । జలబుద్బుదములై చెలంగు ♦ జాలిబొందకురా ♦ నిర్గుణమంద ♦ పాలుమాలకురా ♦ వీలుగత్రిపుటిని । వీక్షించి । దాటిన । వాలాయముగ బ్రహ్మ । వశవర్తుఁడై దోచు । కీలు దెలసియుగోలుపోకను । కిట్టిముట్టుచు బ్రహ్మపదవిని । ఫాలతలమున పొంతుపడగను । ప్రవరుడై పరబయలుజేరెదు ♦ జాలిబొందకురా ♦ నిర్గుణ మంద ♦ పాలుమాలకురా ॥

కనుమూసి దెరచిజూచిన । కనిగానదు యచలమెపుడు । గలరూ పంబై । వినుచుండియువినకుండును । పనుపడపరతత్త్వమదియె । బ్రాఁక యుండుమురా ♦ చిచ్ఛక్తినంటె ♦ సోకియుండుమురా । యేకమౌ తేజము నిరుగొత్తనివ్వక । చేకొనుమూమింట । చిత్రదీపముమాట్కి । నాకమగు పత[illegible]లోపల । నట్టుబడమది గిట్టిబయలగు । దాకు [illegible] తల్ప

యుండై తానే తావగు నిత్యనిలయము ♦ బ్రాకియందుమురా ♦ చిచ్ఛక్తి నంటి ♦ పోకియుండుమురా॥

పవనంబాదిగగలయా । నవరణపంచకమునెఱిగి । సాగించినయా యువుదెలియుటమార్గము । నవరంధ్రములందుశ్వాస ♦ నవలీలగట్టు ♦ కుంభకమూని ♦ గవిజేరముట్టు । రవిచంద్రమార్గముల్ । రాకపోకలనెన్ని యవలీల రేచించి । యావలపూరించు । భవహారంబగు కుంభకంబున । బ్రహ్మరంధ్రము జేర్చిలక్ష్యము । సవినయంబుగ పాంచభౌతిక । సమ హితంబగు బట్టబయలున । నవలీలగట్టు ♦ కుంభకమూని ♦ గవి జేరముట్టు॥

చదివినచిక్క గుహ్యార్థము । ముదమున వదరంగరాదు । ముచ్చిలి యుక్తుల్ పదపడినీలోవెలసెను । సదయుని సేవించు(క్తి?) ♦ సమకొను నయ్యా । శివసోహం హం ♦ సమదేనయ్యా ♦ అమలమైనిత్యమై । యాద్యంతశూన్యమై । శమదమాదిగుణ । సాంతిబొందినచోటు । ప్ర ముదితంబగు బట్టబయలది । ప్రకటితైశ్వర్యమచలము । సముగా నా జ్యోతిలోనగు । శాశ్వతముమది నెన్నుచుండిన ♦ సమకొనునయ్యా ♦ శివసోహం హం ♦ సమదేనయ్యా॥

అనయములోనెయుక్తిగ । గనుగవగీలించిలెస్స । గనవబ్రహ్మం । బనుభవ గమ్యుడవీవై । మనుచుండుము యంతరాత్మ ♦ మన్మయమూని ♦ నిర్విషయమహా ♦ తన్మయమూని । సన్మార్గవృత్తిలో । స్వా రూప్యమగుగురి । యున్మనిలోజూచి । యున్మత్తుడై యుండు । చిన్మయా కృతిలోన బ్రహ్మము । చెలగిమించెడు చిత్పరంబున । జన్మదుఃఖ నివార ణంబగు । జైత్రుడై తులకించిలోనొను ♦ మన్మయమూని ♦ నిర్విషయ మహా । తన్మయమూని॥

రాగద్వేషకదంబము । వేగమెబొలియించిమించి । వెలయుము మది సం । యోగప్రాభవము క్తిని । భోగములందిచ్ఛమాను ♦ పుట్టుట లున్నా ♦ యంతకమున్నె ♦ గిట్టుటలున్నా ♦ దిట్టరివై నీవు । దీక్ష

ప్రపంచంలో । పట్టువిడకనాన్న । ప్రత్యక్షమైనన్నము । పుట్టుగిట్టువు లేనిదిదె ప । పూర్ణతత్త్వ నిరామయంబగు । గుణములేమలక బట్టబయిటను । సేవింపబోడరిన ♦ పుట్టుటలున్నాన్న । యంతకుమున్నె । పుట్టుటలున్నాన్న॥

తత్త్వానుభవయులు తెలిసి గోచరాము । తత్త్వజ్ఞ ... నిర్మలచిత్ । ఘనమాగుపచ్చిన్నవహూప ♦ గమనమ ... ♦ విశ్రాంతి ♦ మనమలమదేరా । గమకించిహృత్పద్మ । గద్దియ ... । సగాలమహిమాత్మలో । నిలంచిమిగమము । క్రమమునప్ప ... । ... కట్టుగుట్టుమ ... కుముదబాంధవుకాంతి ... భాస ... చిత్పరింబగు ♦ గమనమదేరా ♦ చిదానంద ♦ మనమలమదేరా॥

వేశ్వరరూపంబులు । భావములోనలిపెజూవి । పరిచర్యుడవై । సేవించు మేపునెన్నుద ♦ గావించుమనమనుభయులు ♦ గనిమెలగు మయ్యా ♦ సంతోషమున ♦ తెసగిలుగు యయ్యా ♦ కనుపాపలెక్కించి । కాంతిలోగమకంచి । మనమందుమిాను । మాయోకని యెఱుకను । సనాతనమగుబ్రహ్మకలటు । సమరసంబున దాటెయవ్వలి । వనితయగు నామూర్తికాంతిను । వలచియు పరితెజేసిసాక్ష ♦ గనిమెలగుమయ్యా ♦ సంతోషమున ♦ తనగిలుగునయ్యా॥

నూతైన నిజస్వరు పము । పాటించి నిరూఢుడగుచు । భావము నందే । సాటించుచుండు మెప్పుడు । తేటగుపరబయలుజేరి ♦ తెంపుగ నుండూ ♦ నిత్యానంద ♦ మింపొందుచుండూ ♦ బంపుమాయెఱుకను । పరిపూర్ణమంమున । నింపగుమంమును । నీరేసుజగములు । యింపుసొం పుల కియ్యకొనకను । యిష్టసిద్ధిని పొందసిక్కుచు । బెంపుతెండగ పరిధ విల్లుము । ప్రీతితో పరబయలు దాకెదు ♦ తెంపుగనుండూ ♦ నిత్యా నంద ♦ మింపొందుచుండు॥

మొదటనుదోచిన దెఱుకే । తుదజూడగ లేనిదెఱుకె । తూలనిదె

ము కే। పదపడిపూర్ణస  ధిని యిదియదియాభావమనుచు ♦ నెంచిన దెఱు
కే ♦ మోహాటవి ♦ ద్రుంచిన దెఱుకే। సంచితాదికర్మ। సంగతిములనెల్ల।
నంచితముగజూపి। యాడించుచుండును। కొంచమైన నాచాలువిడకను। కు
దురుచుండెడికల్పితంబుల। నెంచకను బయలంటిసర్వము। నెఱయమర
చిన నిత్యసుఖమని। యెంచిన దెఱుకే ♦ మోహాటవి ♦ ద్రుంచిన దెఱుకే॥

ఎఱుకయె। మూడుజగంబులు। యెఱుకయె మరినాదుబిందు।
వెఱుకయెకళలున్। యెఱుకయె జూడంగబ్రహ్మము। నెఱిగిన పరిపూర్ణ
మందు ♦ యెఱిగేదేమన్నా ♦ కుంభకమూని ♦ మఱిగితేసున్నా ♦
తఱిగొనిజ్ఞప్తిలో। తమముత్యక్తముజేసి। గుఱిదాటి వినువీధి। గుర్తించి
మించిన। స్థిరముగా నిస్మరించియుండెను। చిత్సారంబగు పూర్ణమందున
నిరుపమంబగు నిర్వికారము। నిత్యసత్య నిరీక్షణంబుగ ♦ యెఱిగేదేమ
న్నా ♦ కుంభకమూని ♦ మఱిగితేసున్నా॥

కంటికిమింటికిమధ్యను। జంటించియు చూపునిలిపి। జయ ఘు
డవై। యంటుము తన్మయ బ్రహ్మము। వంటరిగా బయలుజేరు ♦
వరుస గన్గొనరా ♦ నిత్యానంద ♦ పరిపూర్ణమదిరా ♦ కరవాలమును
బూని। ఖండించి యెఱుకను పరిపూర్తిజెందుట। ప్రత్యక్ష బ్రహ్మము।
కొలుచుచుండెడి మనమును ఘన। కోటిభాస్కర తేజముగుచు। చిఱు
ముచుండగ మన్మయాకృతి। చిదఖండానందపరమగు ♦ వరుస గన్గొ
నరా ♦ నిత్యానంద ♦ పరిపూర్ణమదిరా॥

బాయకు శివజీవైక్యము। మాయలటను బ్రహ్మముద్ర। మధురమ
మనాదుల్। జేయును మారముజ్ఞప్తిని। మాయలు నియందెబుట్టి ♦
మఱిపించునయ్యా ♦ చిచ్ఛక్తినంటి ♦ గురిగాంచుమయ్యా ♦ యురమున
గురినిల్పు। యుపమునెమ్మనిలిప। పరమపంచాక్షరి। పఠియించుమ
మ్మను। దురిత జాలమునెల్ల ద్రుంచును। దురంతరమగు పదవినిచ్చును।
పరమునీవై యుండగోరెడి। పదకమేరికి దక్కరానిది ♦ మఱపించునయ్యా ♦
చిచ్ఛక్తినంటి ♦ గురిగాంచుమయ్యా॥

షట్చక్రములై దోచెను। షట్చక్రవు పేరేమిటి। స్వరసప్తకుండై షడ్భావములందిపాడగ। షట్చిహ్నములణగునచట ♦ సంతోషముఁగుమన్నా ♦ పొందికమీర ♦ నందుకోరన్నా ♦ సందేహములనెల్ల। సంయోగమున రోసి। బిందుబీజమునందు। బిసివోకయుండుము। యెందుజూచినబ్రహ్మ మయమని। యెన్నుచుండుమఖండతేజము। పొందిపొందకఁ దోచుచుం డును। పూరకములో కుంభకంబున ♦ సంతోషముఁగుమన్నా ♦ పొందిక మీర ♦ నందుకోరన్నా॥

ముడివడనారింటికిపై। నడరెనుచక్రంబు జేరి। నాదామృతముఁ। దడియకచవిగొనియాచి। జ్జడముఁ విడనాడిగోరు ♦ జన్మమేసున్నా ♦ తన్మయమందు ♦ మన్మయుడన్నా ♦ జన్మరహితమగు। చిన్మయజ్యోతిని యున్మనిఁజూచి। యున్మత్తుడై యుండు। మన్మయంబగుమానిని నుతుని। మాంకెప్పుడు మఱిగియుండుట। జన్మదుఃఖనివారణంబది। జగములెల్లను ఖేరివేయుము ♦ జన్మమేసున్నా ♦ తన్మయమందు ♦ ఘన్మయుడన్నా॥

ప్రజ్ఞానమనెనుజ్ఞప్తిని। సుజ్ఞానతపంబుబూని। సూక్ష్మములోనె। యజ్ఞానమడచివిడుఁను। జిజ్ఞాససమాధియదియె ♦ జితమతివగురా ♦ చిత్పరమందే ♦ గతిబ్రహ్మమగురా ♦ ఖ్యాతిమీరుయెఱుకను। మించనివ్వకనీవు। మతిలోఁ బ్రాప్తిగ। మహాతత్త్వమందుము। యుతముగా నాయునికినీవగు। యుక్తలస్పృగి యూనిపిమ్మట। పతితపావనబ్రహ్మబయలున। ప్రతిహతుండై ప్రబలుచుండెను ♦ జితమతివగురా ♦ చిత్పరమందే ♦ గతిబ్రహ్మమగురా॥

బ్రహ్మైవాహంబనుచును। బ్రహ్మంబే ననుచు భేద। భావవిగతమౌ। బ్రహ్మధ్యానము జేయగ। బ్రహ్మాండము మిథ్యయగును ♦ పాటించిగనరా ♦ నిర్గుణమంది ♦ సాటించవలెరా ♦ బూటకములఁ గ్రొగ్గి। బూనివగన లేవు। సూటిదప్పనిచూట్కి। సూక్ష్మములోనుంచు। నాటినిష్ఠదివటనయుండుచు। నానుకాదనిమిన్నకుండెను। కోటిభాస్కర కళల

మించిన । గుట్టుదీవై వెలుగుతత్త్వము ♦ పాటించిగనరా ♦ నిర్గుణ మంది ♦ పాటించవలెరా॥

చింతలు లేకను బయలున । సుంతై నను చూట్కి నిలిపి । మాత్మాత్ము డవై । కొంతతడవెంచి జూచిన । వింతలు చేకొందు బయులే ♦ విలశితాకాశం ♦ అహమస్మీతి । నిలయప్రకాశం ♦ పలుమారు జ్ఞప్తిలో । ప్రత్య క్షమందెను । తలపు మన్మయమూని । దనరార జేయుము । విలయమగు నజ్ఞానబంధుర । వీక్షకలయిక పూర్ణతత్త్వము । నెల వెలుంగున నివ్వటిల్లెను । నిర్మలంబగు బట్టబయలే ♦ విలశితాకాశం ♦ అహమస్మీతి ♦ నిలయప్రకాశం॥

అయమాత్మా బ్రహ్మంబను । నియమములో చూపుసంటి । నిర్గుణివై నర్ । భయమొందదు గురురాయుని । దయకును పాత్రుండవీవె ♦ తత్తిగొనుమయ్యా ♦ నిర్గుణమూని ♦ గురిగనుమయ్యా ♦ సరిలేక వెలుగొందు । సమదృష్టి బూనుక విరమించక నుజ్ఞప్తి । వెన్నంటి జూనుము । తరముగానిది తత్త్వగోప్యము । తన్మయంబగు బ్రహ్మభావము । పరిణమించెను బయలు లోపల । ప్రబోధికమగు నిర్గుణతత్త్వము ♦ తత్తిగొనుమయ్యా ♦ నిర్గుణమూని ♦ గురిగనుమయ్యా॥

• అయమాత్మ బ్రహ్మమైనది । నయముగ మదినిలిపిలోన । ననువై యుండర్ । భయమెల్ల దీరునున్మని । దయగల గురుశక్తిగూడి ♦ దాకు చుంసుమురా ♦ హృత్పద్మము ♦ సోకియుంసుమురా ♦ రాకపోకలు లేక । రంజిల్లు పరమాత్మ । నేకీభావుండవై । యుంపొందుచుంసుము । నీకు నీవై నిత్యసుఖమున । నిస్తరంగాం బోధికై వడి । సోకిమించెను బయలునంటుము । సారది బ్రహ్మానందపూర్ణము ♦ దాకుచుంసుమురా ♦ హృత్పద్మము ♦ సోకియుంసుమురా॥

లోపల వెలుపల బయలై । యాపదలను లేక వెలుగు । నచలంబదియై । జూపించి చెప్పరానిది । తాపసగుణ నిత్యసుఖంబు ♦ తలపోయుమయ్యా ♦ హృద్యము సంక్షి ♦ కలకొలగుమయ్యా ♦ యిలజన్మబాధల।

జపముగలపరబయలుదాకిన ♦ మాయలేదన్నా ♦ గుణములడించి ♦ పోయె గదన్నా॥

తనరూపుదోచనప్పుడు । తనకన్యంబైనజగము । తరుచుగదోచుగ । తనరూపుజూచినంతట । తనలోసంరావమణగె ♦ తావే బ్రహ్మమురా ♦ నిర్గుణివైతే ♦ నీవేనిత్యమురా ♦ జీవభావమందు । చిన్మయజ్యోతిని । సేవించి మించిన । చిన్మాత్రమైదోచు । కేవలంబగు చిత్తశూన్యము । కీలుకొనమది ముట్టినంతట । పావక జ్వాలాంశ కళలటు । ప్రబలి మహదాకాశ మమరెడి ♦ తావే బ్రహ్మమురా ♦ నిర్గుణివైతే ♦ నీవేనిత్యమురా॥

అంతర్లక్ష్యవిధంబున । సంతతమును మనసునిలిపి । సాధించిన చోట । వింతలడంగును మానస । మింతింతని జెప్పరాదు ♦ యెంచి చూడుమురా ♦ సమదృష్టిలో ♦ పొంచి గూడుమురా ♦ అంచితముగ నీలో । నంకించి పరజ్ఞప్తి । పొంచినిన్గని నీవె । పొంగారుచుండిన । సంచితంబులులేని బయలది । స్వాత్మతన్మయ కలయికంబున । కొంచమైనను కుస్తరింపక । కుంభకములో మననమమరగ ♦ నెంచిచూడుమురా ♦ సమదృష్టిలో ♦ పొంచిగూడుమురా॥

సూటియగు దారిదెలియక । సాటింపను దరముగాదు । సత్యముమదిలో । చోటెరిగి నిలిపినంతట । కోటీశ్వర తేజమదియె ♦ కూటమంచనరా ♦ నిర్గుణమూని ♦ వాటమంచనరా ♦ నాటిన చోటెఱిగి । యూనుకాదనకీవు । కోటికిపడిగెత్తి । కుంభించి యుండుము । ధాటిగను పరబయలుచేరెడి । ధైర్యమును విడనాడకెప్పుడు । వాటమగు నామగ్నచిత్తము । వాఙ్మనస గోచరంబదె ♦ కూటమంచనరా ♦ నిర్గుణమూని ♦ వాటమంచనరా॥

అచలంబనగా బ్రహ్మము । యచలంబున మనసులేదు । యమలం బదియే । సుచరిత్రం బగుయుక్తిని । ప్రచురించెను యంతరాత్మ ♦ ఖాటగన్గొనరా ♦ నిర్భయులమయ్యే ♦ చోటబ్రహ్మమురా ♦ బూటకము

లక్ష్యు । బొరయకుమెప్పను । పాటించి నిర్మించి । పరతత్త్వమందును । కోటిసూర్యులు కోటిచంద్రులు । కూడివెలిగెడు చిత్సరంబది । మీాటి యాపోజ్యోతినంటుక । మిన్నకుండెను నిన్నుదెలసె ♦ భాటగన్గొనరా ♦ నిర్భయులయ్యె ♦ చోటే బ్రహ్మమురా॥

నిద్రను భద్రమ తీర్గన । తద్రూపము పరిణమించు । తాలిమి తోనా । చిద్రూపము తలపోయగ మాద్రూపము నిర్గుణంబు ♦ నాని తగుణము ♦ చిన్మయమంద ♦ బూనితెలిసెను ♦ నేనునీవనకను । నిర్గుణజ్ఞప్తిని । బూని నిస్తనిసీలో । పొంగారు చుండుము । తానునేనను మము రోయుచు । తత్త్వదర్శన మందిపొందుట । మానసాని మహాధ సంబది । మానజప జీవేశ్వరైక్యము ♦ మానిత గుణము ♦ చిన్మయ మంద బూనితేపరము॥

ఉన్న నిరామయతత్త్వము । తిన్న నిహ్లాదయాంతరంగ । తెలివి కిప్పెగా । విన్నది ప్రణవముజ్ఞప్తిని । గన్నది పరిపూర్ణమనెను ♦ ఘనతేజమయ్యా ♦ నిశ్శబ్దము ♦ గనిమెలగుమయ్యా ♦ కనిగానని చోటు । గాంచినతోడ్తోడ । విని కనుటలునున్న । విన్నంది మించిన । మనమును మున గలియనొక్కడు । మార్గమందే మరికనిజగురు । మనసమంటుట చిత్ప్రకాశము । మహితమగు నాస్వప్రకాశము ♦ ఘనతేజమయ్యా ♦ నిశ్శబ్దము ♦ గనిమెలగుమయ్యా॥

ఇది మోక్షమార్గసాధన । విదితంబుగ జెప్పనాడ । వీనులచవి గాణ । జదివిన వ్రాశిన విన్నను । ముదమొప్పను మనమందు ♦ ముక్తి జూపించుణ ♦ సద్గురుపూజ ♦ భక్తిమెప్పించుణ ♦ యుక్తిగ మదిలోని । యూహానురెట్టించె । శక్తినిబుట్టించి సంతుష్టినొందించు । వ్యక్తముమరిగ యుక్తులెల్లను । తత్పరంబగుర క్తిలోగురి । ముక్తి తెలివ నియూని జెప్పను । మోక్షమార్గ దురధిగ మంబగు ♦ ముక్తిజూపించుణ ♦ సద్గురుపూజ ♦ భక్తిమెప్పించుణ॥

కాశియందు శ్రీశంకరాచార్యులవారికిని శివునికినిజరిగిన సంవాదము.

శ్లో॥ కదాచి చ్ఛంకరాచార్యః కాశీం ప్రతి పురీం యయౌ
చండాల రూపిణం దృష్ట్వా గచ్ఛగచ్ఛేతి చాబ్రవీత్॥

తాత్పర్యము॥ పరమ కరుణానిధియు భగవంతుండును అయిన

పరమ శివుడు చండాల వేషధారియై ఒకానొకప్పుడు కాశీపట్టణము వీధి యందు పోవుచుండెడు శంకరాచార్యుల సమీపమునకు రాగా, శంకరాచార్యులవారు ఆచండాల వేషధారియగు పరమశివునింజూచి ఓరీ చండాలుడా దూరముగా అవల తొలగిపొమ్మని చెప్పగా వారితో ఆభగవంతుండు ఇట్లనియె.

శ్లో॥ అన్నమయా దన్నమయ మథవాచైతన్యమేవ చైతన్యాత్ ।
యతివర దూరీకర్తుం వాంఛసి కిం బ్రూహి గచ్ఛగచ్ఛేతి॥

తా॥ ఓయి సన్యాసీ! [ శ్రుతి॥ సవా - ఏష - పురుషోన్న - రసమయ - ఇతి॥ ] అనెడు శ్రుతివాక్యరీతిగా ఈభూలోకమున అన్ని శరీరములున్ను అన్నవికారములని చెప్పబడుచున్నవి. నీ శరీరమెట్లు అన్నవికారమైనదో, అట్లు నాశరీరమున్ను అన్నవికారమైనది, కాబట్టి మన ఇద్దరి శరీరములున్ను ఒకటే విధమైనది. ఇట్లుండగా నీదేహముమాత్రము శుచియైనది, నాదేహము అశుచియైనదా? లేక మన యిద్దరి శరీరములున్ను శుచియైనవని నీవు ఒప్పితివేని నన్ను తొలగిపొమ్మని ఏట్లు తిరస్కరించుచున్నావు? లేదా నాశరీరము అశుచియంటివా, నీశరీరము కూడా అశుచియై దికదా? కాబట్టి శరీరమునుబట్టి నన్ను తొలగిపొమ్మని చెప్పుట నీకు ధర్మముకాదు. మనయిద్దరి శరీరములు అశుద్ధములే సుమా! మఱియు [ శ్రుతి॥ ఏకో - దేవః - సర్వభూతేషు - గూఢః। సర్వవ్యాపీ - సర్వ - భూతాంతరాత్మా॥ ] అనెడు శ్రుతివాక్యరీతిగా చైతన్యస్వరూపుడైన ప్రత్యగాత్మ అనెడి పరబ్రహ్మము పిపీలికాది బ్రహ్మదేవునివరకుగల సకల శరీరములందును ఒక్కటే విధముగా సర్వసాక్షిగా వ్యాపించియున్నది. అట్లు సర్వ పరిపూర్ణముగానుండు ఆ పరబ్రహ్మము (అచలమైనది) అగా ఒకచోటునుండి మఱియొకచోటునకు తొలగిపోజాలదు. ఓయి సన్యాసీ! అన్నవికారమైన నాశరీరమును తొలగించుటకు గోరుచున్నావా, లేక నాయాత్మ స్వరూపమగు చైతన్యమును తొలగించుటకు గోరుచున్నావా? ఈప్రశ్నలకు తగిన ఉత్తరమును చెప్పుమని యడిగెను. అట్లనగా మనయిద్దరి శరీరములున్ను ఒక్కటే గాన, నా శరీరమును బట్టి నన్ను తొలగిపొమ్మనుట నీకు యుక్తము కాదు, మఱియు చైతన్యమో అంతట ఏకరూపమైనదిగాన, నాయా

త్మనుబట్టియైనను నన్ను నీవు తొలగిపొమ్మనుటయు నీకు ధర్మముకాదు అనిచెప్పెను.

శ్లో॥ ప్రత్యగ్వస్తుని నిస్తరంగ సహజా నందావ బోధాం బుధౌ।
విప్రోయం శ్వపచోయమిత్యపి మహాన్కోయంవిభేదభ్రమః॥
కింగంగాంబుని బింబితేంబరమణౌ చండాల వీధీపయః పూరే।
వాంతరమస్తి కాంచనఘటీ మృత్కుంభయో ర్వాంబరే॥

తా॥ ఓయి సన్యాసీ! [ శ్రుతి॥ సత్యంజ్ఞాన- మనంతం - బ్రహ్మ॥ ఆనందో - బ్రహ్మేతి - వ్యజానాత్॥ ] అనెడి శ్రుతివాక్యరీతిని ప్రత్యగాత్మ అనెడి పరబ్రహ్మము (సత్యం) అనగా సదా - నాశరహితమైనది,— ( జ్ఞానం ) అనగా ప్రజ్ఞాన స్వరూపమైనది,— ( అనంతం ) అనగా దేశకాల వస్తు పరిచ్ఛేదములు లేనిది,— ( ఆనందం ) అనగా నిరతిశయ నిర్విషయ సుఖస్వరూపమైనది, సకల బాధారహితమైనది. అలలులేని మహాసముద్రమువలె నిర్వికల్పమై అఖండసంపూర్ణమైనది అట్టి పరబ్రహ్మమునందు వీడు బ్రాహ్మణుడు వీడు చండాలుడు అనునివి మొదలుగాగల భేదములు ఎక్కడివి. ఏమియు లేవుగదా? మఱియు [ శ్రుతి॥ మృత్యోస్స - మృత్యు - మాప్నోతి॥,—॥ యదా హ్యేవైష ఏతస్మిన్నుదర - మంతరం - కురుతే । అథ - తస్య - భయం-భవతి॥ ] ఇత్యాది శ్రుతివాక్యరీతిగా అట్టి అఖండ పరిపూర్ణ పరబ్రహ్మము నందు ఎవడు భేదమును భావించుచున్నాడో వాడు మృత్యురూపమగు జనన మరణ దుఃఖ సంసార సాగరంబున మునిగి దుఃఖించుచుండును. ఎన్నటికిని ముక్తిజెందడుసుమా! మరియు [ శ్రుతి॥ ఏకఏవహి - భూతాత్మా - భూతేభూతేవ్యవస్థితః। ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్॥] అనెడి శ్రుతివాక్యరీతిగా సర్వభూతములయందు వ్యాపించియుండు పరబ్రహ్మమగు ఆత్మయేకమైనను, ఒక్కచంద్రుడే నీళ్ళకుండలందు ప్రతిఫలించి అనేక జీవములుగా తోచుచున్నాడుసుమీ! మరియు గంగానదీ జలమునందు ప్రతిబింబించిన సూర్యునకున్ను చండాలునియింటి నీళ్ళ

కుండలో ప్రతిఫలించిన సూర్యునికిన్ని ఈ రెంటికిన్ని భేదములేనట్లు, నీ యంతఃకరణము నందలి ప్రతిబింబమగు జీవునికిన్ని కొంచెమైనను భేదము లేదు సుమా! ఒకవేళ నీయంతఃకరణము శుద్ధమైనది, నాయంతఃకరణము అశుద్ధమైనదిగాన, నీవు శ్రేష్ఠుడవనియును నేను అధముడననియును తలంచితివేని, జలముయొక్క శుద్ధాశుద్ధములు అందు ప్రతిఫలించిన సూర్యునికి లేనట్లు, అంతఃకరణ ధర్మములగు శుద్ధాశుద్ధములు ఆయంతఃకరణమునందలి ప్రతిబింబములగు నీజీవునికిని నాజీవునికిని లేదుగాన, మనయిద్దఱి జీవులకును భేదములేదు సుమా! మఱియు శుద్ధమగు గోమయమును అశుద్ధమగు మార్జాల మలమును, ఈ రెండును మలము వినా వేరుగానట్లు, శుద్ధాంతఃకరణమున్ను అశుద్ధాంతఃకరణమున్ను ఈ రెండును హేయమగు ఒక్క మాయా కార్యములేగాని, వేరుగాదు సుమా! కాబట్టి మనయిద్దఱి అంతఃకరణములకును భేదములేదు సుమా! మఱియు [ శ్రుతి॥ ఘనధూమో - ఘటయోగేన - సురాగంధేన - లిప్యతే । తథాత్మోపాధి యోగేన - తద్ధర్మైర్నైవ - లిప్యతే॥ ] అనెడి శ్రుతివాక్యరీతిగా పన్నీరుపోసియుండు వెండిచెంబులోను, కల్లుపోసియుండు మట్టికుండలోను వ్యాపించియుండు ఆకాశమునకు ఆ రెండు కుండలయొక్క సుగంధ దుర్గంధములు అంటక ఆయాకాశము అసంగముగా నుండునట్లు నీశరీరమునందును నాశరీరమునందును వ్యాపించియుండు ఆత్మ— [ శ్రుతి॥ ఆకాశవత్సర్వ - గతశ్చ - నిత్యః॥ ] అను శ్రుతిరీతిగా ఆకాశమురీతిగా అసంగుడుగాన, మనయిద్దఱి శరీర సంబంధములగు గుణదోషములు ఆయాత్మను కొంచమైనను అంటజాలవు. కాబట్టి మనయిద్దఱియొక్క ఆత్మస్వరూపములకు కొంచెమైనను భేదములేదు సుమా! మఱియు వెండికుండయు మట్టికుండయు ఈ రెండున్ను ఒక్క పృథివీభూతమేగాని వేరుగానట్లు, మనయిరువురి దేహములున్ను పంచభూతమయములైనదియు అన్నవికార మైనదియుగాని, వేరుగాదు సుమా! [ శ్రుతి॥ జాతం - వ్యాధి - మిదం దేహం - మాతాపిత్రు - మలాత్మకం। సుఖదుః

ఖాల - యామేధ్యం - స్పృష్ట్వా - స్నానం - విధీయతే॥ ధాతుబద్ధం - మహారోగం పాపమందిర - మధృవం । వికారాకార- విస్తీర్ణం- స్పృష్ట్వా స్నానం - విధీయతే॥ నవద్వార - మలస్రావం- సదాకాలే- స్వభావజం। దుర్గంధం - దుర్మలోపేతం - స్పృష్ట్వా - స్నానం - విధీయతే॥ ] అనెడి మైత్రేయోపనిషత్తురీతిగా ఓయి సన్యాసీ! మనయిద్దఱి దేహములున్ను జననమరణాది షడ్భావవికారములుగలవి, తల్లిదండ్రులశుక్లశోణితముల నెడు మలములవలన గలిగినది, సుఖదుఃఖములకు ఆలయమైనది, అశుద్ధమైనది,— సప్తధాతుమయమైనది, - మహారోగములకు ఉనికిపట్టుగానున్నది, పాపములకు పుట్టినిల్లుగానున్నది, అశాశ్వతమైనది, వికార రూపమునుగలది, సదా నవరంధ్రములయందును మలము కాఱుచుండు స్వభావముగలది, సదా దుర్గంధమైనది, దుర్మలముతో గూడియుండు నట్టిది, ఇట్టి దేహమే చండాల స్వరూపమైనది, దీనిని అంటరాదు, అంటినయెడల స్నానము చేయవలయునుగాన, మనయిరువురి దేహములున్ను చండాలస్వరూపమే గుటవలన నీకును నాకును ఎంతమాత్రమున్ను భేదములేదు. మఱియు [ శ్రుతి॥ నచర్మణో - నరక్తస్య - నమాంసస్య- నచాస్థినః । నజాతి - రాత్మనో - జాతిర్వ్యవహార - ప్రకల్పితా॥ ] అనెడు నిరాలంబోపనిషత్తురీతిని చర్మము రక్తము మాంసము ఎముకలు మొదలగువానికిన్ని జాతియనునది లేదు, పరబ్రహ్మమగు ఆత్మకున్ను జాతిలేదు, మఱియు పరబ్రహ్మప్రతిబింబమగు జీవునికిన్ని జాతిలేదు, జాతియనునది వ్యవహార కల్పితమేగాని, వాస్తవముగాదు, సుమా! నన్ను ఓరీ చండాలుడా దూరముగా తొలగిపొమ్ము అనిమెట్లు చెప్పితివి, అయ్యో! నీవు వేదవేదాంతములు తెలిసిన బ్రహ్మజ్ఞానివిగా నుండియు నీకు ఈభ్రాంతి గలుగవచ్చునా? నిప్పునకు చెదుళ్లు అంటనట్లు బ్రహ్మజ్ఞానియగు నీకు ఇట్టి భేదభ్రాంతి గలుగరాదు సుమా! అనియిట్లు చండాల వేషధారియగు పరమశివుడు అభేదజ్ఞానమార్గము బోధించి అదృశ్యుండాయెను. తదనంతరము శ్రీశంకరాచార్యస్వాములవారు అట్లుచండాలవేషముతో

వచ్చినది భగవంతుడని తెలిసి అతనింగాంచక దుఃఖించి అయ్యో నేను సన్యాసిని నేను బ్రాహ్మణుడను అనెడి వర్ణాశ్రమాభిమానమున్ను భేదజ్ఞానమున్ను నాకుగలిగియున్నందు వలనగదా భగవంతుడు ఇట్లు చండాల వేషముతో వచ్చి నాకుబుద్ధిచెప్పి భేదజ్ఞానమునున్ను అభిమానమునున్ను తొలగించి పోయెను, అనియిట్లు భగవంతుండగు పరమ శివుని పలుదెఱంగుల స్తోత్రముచేసి అదిమొదలు తాను వర్ణాశ్రమాది అభిమానములు లేనివారై ( సర్వం - ఖల్విదం - బ్రహ్మ॥ ) అను శ్రుతిరీతిగా సర్వమును బ్రహ్మముగాభావించుచు ముముక్షువులకు యోగాది సాధనములు లేకనే వర్ణాశ్రమాది అభిమానములు లేనివారగుచు బ్రహ్మైక్యభావము గలిగి సదాఆత్మానుసంధానమునుచేసి ముక్తిపొందుటకుగాను, ఇకమీద చెప్పబోవు అయిదుశ్లోకములచేత తమస్వానుభవమును అందఱకిని బయలుపఱచుచున్నారు. ఎట్లనగా.

శ్లో॥ జాగ్రత్స్వప్న సుషుప్తిషు స్ఫుటతరా యా సంవిదుజ్జృంభతే।
యాబ్రహ్మాది పిపీలికాంత తనుషు ప్రోతా జగత్సాక్షిణీ ।
సైవాహం నచదృశ్య వస్త్వితిదృఢప్రజ్ఞాపి యస్యాస్తిచేత్ ।
చండాలోస్తు సతు ద్విజోస్తు గురురిత్యేషా మనీషామమ॥

తా॥ జాగ్రత్స్వప్న సుషుప్తులందు ఏ జ్ఞానస్వరూపమగు ఆత్మ స్ఫష్టముగా ప్రకాశించుచున్నదో, పిపీలికాది బ్రహ్మపర్యంతము సకల చరాచర శరీరములందు ఎదవ్యాపించి సర్వజగత్తునకు సాక్షిగానున్నదో, అట్టి జ్ఞానస్వరూపమైన ఆత్మయే నేనుగాని, దేహేంద్రియాది దృశ్యములు నేనుగానను దృఢజ్ఞానము ఎవనకి గలదో, వాడు మాలవాడైనను లేక బ్రాహ్మణుడైనను అతడే నాకు సద్గురుండు!

శ్లో॥ బ్రహ్మైవాహ మిదం జగచ్చ సకల చిన్మాత్ర విస్తారితం ।
సర్వం చైత దవిద్యయా త్రిగుణయా సేశమ్మయా కల్పితం ।
ఇత్థం యస్య దృఢామతి స్సుఖతరే నిత్యేపరే నిర్మలే ।
చండాలోస్తు సతు ద్విజోస్తు గురురిత్యేషా మనీషామమ॥

తా॥ ఎవడైతే సచ్చిదానంద నిత్యనిర్మల పరబ్రహ్మమగు ఆత్మయే నేనని భావించి, దృశ్యమైన ఈజీవేశ్వరాది భేద ప్రపంచమును మాయాకల్పిత మనియు మిథ్యాస్వరూపమనియు తలంచు చున్నాడో వాడు మాలవాడైనను, బ్రాహ్మణుడైనను అతడే నాకుసద్గురుండు.

శ్లో॥ శశ్వన్నశ్వర మేవ విశ్వ మఖిలం నిశ్చిత్య వాచాగురో ।
నిత్యం బ్రహ్మనిరంతరం విమృశతా నిర్వ్యాజ శాంతాత్మనా।
భూతం భావిచ దుష్కృతం ప్రదహతా సం విన్మయే పావకే।
ప్రారబ్ధాయ సమర్పితం స్వవపు రిత్యేషా మనీషామమ॥

తా॥ ఈ సకల ప్రపంచము మాటిమాటికి అనిత్యమైనదని గురు వాక్యముచేత నిశ్చయించుకొని, సదా బ్రహ్మవిచారణ చేయుటచేత శుద్ధశాంత మనస్సుగల బ్రహ్మజ్ఞానియొక్క ఆగామిసంచిత కర్మలు జ్ఞానాగ్నిచే నశించును, ప్రారబ్ధకర్మమాత్రము బ్రహ్మజ్ఞాని తానుఅనుభవించుటవల్లనే నశించును.

శ్లో॥ యాతిర్యఙ్నర దేవతాభి రహమిత్యంత స్ఫుటాగృహ్యతే ।
యద్భానా హృదయాక్ష దేహవిషయా భాంతిస్వతోఽచేతనాః ।
తాంభాస్యైః పిహితార్కమండలనిభాంస్ఫూర్తింసదాభావయన్।
యోగీ నిర్వృతిమానసోహి గురురిత్యేషా మనీషామమ॥

తా॥ సకలజంతువుల అంతఃకరణ అధిష్ఠానముగానుండుచు నేను నేను అని తోచుచుండునట్టియు, సకలేంద్రియములను దానిదాని వ్యాపారములు చేయించునట్టియు జ్ఞానస్వరూపమగుఆత్మను ఎవడు స్వయం ప్రకాశమాన పరంజ్యోతి స్వరూపముగా భావించి తదేక ధ్యానముగా నుండుచు అందువలనగలిగిన బ్రహ్మానందసుఖమును పొందియున్నాడో, అట్టివాడే నాగురువు.

శ్లో॥ యత్సౌఖ్యాంబుధి లేశలేశత ఇమే శక్రాదయో నిర్వృతా ।
యచ్చిత్తే నితరాం ప్రశాంత కలనే లబ్ధ్వా మునిర్నిర్వృతః ।
యస్మిన్ నిత్యసుఖాంబుధౌ గళితధీర్ బ్రహ్మైవ నబ్రహ్మవిత్ ।
యఃకశ్చిత్ససురేంద్ర వందితపదో నూనం మనీషామమ॥

తా॥ ఇంద్రాది దేవతలు పరబ్రహ్మముయొక్క సుఖలేశమును పొందుచు తృప్తులగుచున్నారు. అయితే సంకల్పరహితమైన శుద్ధమనస్సునందు బ్రహ్మసుఖమును బొందిన (ముని) అనగా మననశీలుఁడు అగు జ్ఞాని నిరతిశయ నిర్విషయ నిత్యసుఖ సముద్రమునందు మునిగిన మనస్సుగలవాడై ఇంద్రాది దేవతలచేత నమస్కరింపదగిన పాదములుగల వాడగుచున్నాడు. ఇదే నానిశ్చయమైన అభిప్రాయము.

—— వే దాం త కృ తు లు. ——

పంచరత్నములు.

మధ్యమావతి రాగం - ఆదితాళం.

౧. జన్మాకర్మము । దొలగుచున్నా । ఈనిర్గుణబోధ । జంఝూట । ములను । దృంచునన్నా । జన్మరహితమగు । జాడగనుంగొని । చిన్మయజ్ఞప్తిలో । చిత్కళలంటిన. జన్మా.

౨. గురుమూల । ధనముగనుమో యన్న । గుర్తించి । మదిలో । గుణరహిత । సిద్ధి । బొందు । మన్న । గురు । డతివేగమె । గొనబగుయుక్తిచె । పరమిదొ । స్థిరమని । పట్టి । జూపినను. జన్మా.

౩. తనరేడి । తెల్వి । గనుమో । యన్న । గుర్తించి । లోనె । దనరుట । ముక్తితెరవగు । నన్న । తనలో । తానగు । తత్పద । మానుచు । తన్మయబ్రహ్మము । దాకెను । ఆచ్ఛలో. జన్మా.

౪. కానానిబయలు । గనుమో । యన్న । కంథనముపాచ్చి । కనుబాటు । నిల్పి । గనపలె । నన్నా । కానరానిదది । కంటికిమింటికి । బూనెనుజ్ఞప్తిని । పురికొనుచుండిన. జన్మా.

౫. ప్రాగ్భారమైన । తపమగుచున్నా । ప్రాదుర్భవించి । ప్రతిజ్ఞేయ । మంద । జేయుచున్న । ప్రాగ్భరితంబుగ । బయలును । లోనై । దిగ్భ్రమలెల్లను । దిటవుగమించిన. జన్మా.

౬. చిరజీవ । ముక్తిగనుమో । యన్న । చిచ్ఛక్తినంటి । చిన్మయ । తేజఘంటు । మన్న । చిరమతిహంసను । చిత్ప్రకాశమున । నరసింహార్చితు । నయించి । పొందిన. జన్మా.

భేహాగ్ రాగం - ఆదితాళం.

౧. మాయ । మాయమహా । మార్గము । దెలిపెద । నిజ । మార్గము । దెలిపెద । మాయకు । వెలియై మనుమన్నా. మాయ.

౨. దేహా । మనిత్యము । దేహికి । బంధము। నిజ । దేహికి । బంధము । సోహంబగుగురి । సారుమన్నా. మాయ.

౩. భాగ్య । చింతలు । భార్యా । భర్తలు । నిజ । భార్యా । భర్తల । యోగ్యభ్రమలని । యెఱుగన్నా. మాయ.

౪. చూపగు । వెలిలో । చూపును । చెదరక । నిజ । చూపును । చెదరక । చూచుట । భద్రము । చూడన్నా. మాయ.

౫. నిత్య । నిరామయ । నిర్భయ । లగుమది । నిజ । నిర్భయ । లగుమది । నిత్యవినోదము । నీవన్న. మాయ.

౬. అకార । మనలము । ఉకార । ప్రాణము । నిజ । ఉకార । ప్రాణము । మకార । మోక్షము । మనుమన్నా. మాయ.

౭. గురిలో । గురిగని । గుణముల । నెంచక । నిజ । గుణముల । నెంచక। మెఱయుట । బ్రహ్మము ।మేలన్న. మాయ.

౮. నరసింహార్చితు । నైష్టిక । యోగము । నిజ । నైష్టిక । యోగము । పరమసువేద్యము । బాగన్నా. మాయ.

పున్నాగవరాళి - రాగం - అటతాళం.

౧. ప్రజ్ఞానము । బ్రహ్మము । ప్రకాశమా । సుజ్ఞానము । బ్రహ్మము । అజ్ఞానాంధకా । రాంభోనిధి । దాటెడు । సౌజ్ఞ దెల్పు । గురుడే । సంకీర్ణ । బ్రహ్మము. ప్రజ్ఞా.

౨. ఆత్మ । తేజము । బ్రహ్మము । ఆత్మాకాశ । మంటియుండును। బ్రహ్మము । ఆత్మ । తన్మయమందు । అనురక్తి । మీఱ । చిదాత్మైక్య । మొనరించు । నద్వైత । బ్రహ్మము. ప్రజ్ఞా.

౩. నిరామయ। బ్రహ్మము । నితాంతమా।నిశ్శ్రేయ। మగుబ్రహ్మము। నిర్వాణ । జ్ఞప్తిలో । నిల్చెంచి । తన్మరచి । నిశ్శబ్దమైయుండు । నిష్కళ బ్రహ్మము. ప్రజ్ఞా.

౪. సోహంభావ । బ్రహ్మము । శుద్ధాత్మలో । సోమించు । కళబ్రహ్మ
ము । సోహం । సత్యజ్ఞాన । సుషిర । మధ్యమునందు । నూహతత్ప
రమంటు । సోహణ । బ్రహ్మము. ప్రజ్ఞా.

౫. నీనామది । బ్రహ్మము । నికాశమా । నిర్వికల్ప । బ్రహ్మము ।
నీనాయను । జ్ఞప్తి । నిర్జించిలోమించి । ధ్యానసనిర్గుణ । నిధి । ధ్యాన ।
చిద్బ్రహ్మము. ప్రజ్ఞా.

౬. నాదాతీత । బ్రహ్మము । నైసర్గిక । నాక పరబ్రహ్మము । నాదాంత
గ్గత । మందు । నరసింహామూర్తిక । నాద్యవిద్యాదిపర । మానం
దబ్రహ్మము. ప్రజ్ఞా.

ఝంఝూటి రాగం - ఝల్పతాళం.

౧. మానసమున । మాటుమణిగె । మానము నిజమాయరా । పూనిగ
నుట । పూర్ణపదవి । పునర్భవ । వినాశమదియె. మా.

౨. తారకమును । సాంఖ్యమెఱిగి । దారిలో । నిజుజూడరా । తారోలని
మద । తావరము । దాటగినుట । తత్త్వమదియె. మా.

౩. దేహమునను । దిటవృత్తాను దేహిలి । గనుచుండరా । సోహమనుచు ।
సారగినపుడె । సామ్మసిల్లు । పూర్ణమదియె. మా.

౪. మాయవగిలి । మాయవదలి । మననమందె । జూడరా । మాయజగ
ము । మఱచినపుడె । మానరాని । మాన మదియె. మా.

౫. సూటెగగురు । సూక్ష్మమెఱిగి । సుషిరమధ్య । జూడరా । సూటెవ
దలి । చూచునదియు । చూడరాని । చోద్యమదియె. మా.

౬. వేమకల । వేద్యమగును । వినుమక । నిజుజూడరా । వేడిమిగను ।
విబుధులెంచు । విధ్రమైన । విభవ । మదియె. మా.

౭. భావమునను । బాసటగును । పాటవముగ । జూడరా । భావమము
రు । బట్టబయలు । భవవినాశ । బ్రహ్మమదియె. మా.

౮. సేవ్యనిచర । సింహ్మాదా । నీనునిశివు । జూడరా । సేవితమది ।
చెలగినంత । చిత్ప్రకాశ । లింగమదియె. మానస.

బిలహరిరాగం - అటతాళం.

౧. అంతర్యామిని । గూడర ॥ అంతేవాసి ॥ చింతలన్నియు । వీడరా । అంతరాళము । లోనుగా । నాదిదైవము । తానుగా । సంతరీతు ము । నిండివెలయును । నాదిజ్యోతిర । జ్ఞప్తిలో ం.ది. అంతర్యామి.

౨. నిత్యనిర్గుణ । భావము ॥ అంతేవాసి । నిగమార్థ । పరిపూర్ణము । నిత్య నిర్మల । ధ్యానము । నిన్నుమరచెను । జ్ఞానము । సన్న్యాసేద । సమీక్షణంబున । సదయహృదయ । సమాగితుండై . యంతర్యామి.

3. గురుడే । పరబ్రహ్మము ॥ అంతేవాసి ॥ గుర్తించి । మదివేసుము । గురిగనుంగొను । యుక్తిగో । గుణములడిగి । భక్తిగో । పరమ జ్యోతిని ॥ జె గుచుండెడి । ప్రత్యగాత్మను । నెంచిగురిగా. నం౩.

౪. ఎటు కెజ్ఞప్తికి । మూలము ।అంతేవాసి ॥ మఱు పనూయకు । జాలము । జాగిమత్తిగెను । శక్తిగో । నేకమమరెసు శక్తిగో । నెఱుగుకళలను । తత్వదర్శన । నేకమగు । సశిపదము । నం౩. అంతర్యామి.

౫. బోధమించెను । జ్ఞానము ॥ అంతేవాసి । సాధుసజ్జన జ్ఞేయము । బోధనీయుని యుక్తిగా । బొందిలో । ననుర క్తిగా । వాదభేదము । లుడచితకొని । వాంఛదీరెను । తత్పరంబున. అంతర్యామి.

౬. వసింహ్మర్చితు నెంచర । అంతేవాసి । యుగముగ । గురిమించర । నారసింహ్మ । మహేశుని । నందివాహన । శంభుని । నర్తనం బున । నిండిపంమను । నాతరంబగు । బ్రహ్మమయుడై . అంతర్యా.

శ్లో॥ మంగళం గురుదేవాయ । మహనీయ గుణాత్మనే ।
సర్వలోక శరణ్యాయ । సాధురూపాయ మంగళమ్॥

శందార్థము.

మంగళము నిర్వికారికి । మంగళ మపరోక్షవిహిత మహితాత్ము నకున్ । మంగళము సచ్చిదాత్మకు । మంగళం మన వద్య చిద్బ్రి ॥ హ్మాది దేవునకు॥ పరాత్పరమా వేదవేద్యునకు॥ ఆదియంత్యములేక । నమరిచిన్మంటను।నాదాంతరంగుడై।నటనసంపూర్తికి । భేదబుద్ధి విరహి।

తరేచక। భిన్న పూరక కుంభ కాఖ్య। వివాదజాంత ర్లక్ష్యహిమకరవహ్ని, సూర్య సురూపచిద్బ్రి॥ హ్మాది దేవునకు॥ పరాత్పరమా వేదవేద్యునకు॥

మంగళహారతి - సౌరాష్ట్రిరాగం.

౧. పార్వతీరమణునకు । పరదేవ । దేవునకు । పరమచిత్కళరూప । పరి త్రాణకు । పరగచిదాకాశ । ప్రత్యక్షపదవిలో । ప్రఖ్యాతుడై యున్న యా । పరమేశునకు । జయమంగళం । నిత్యశుభమంగళం । జయా। జయమంగళం । మనోన్మయమండలం. పార్వతీ.

౨. రవిచంద్రనేత్రునకు । రజితాద్రివాసునకు । భువనమోహనరుద్ర । పురహారునకూ । భవబంధములనెల్ల । భారకుండై ద్రుంచి । భవుక రక్షక । మోక్ష భవునకిపుడు। జయమంగళం । నిత్యశుభమంగళం । జయా । జయమంగళం । మనోన్మయమండలం. పార్వతీ.

3. హిరణ్యముగాదృక్ దృశ్య । మతముతాగానట్టి। పతితపావనరుద్ర పరి హారుకు। నతతమిూపిండాండ । సరణిలో బ్రహ్మాండ । వితతికెవ్వరి వెలు గు । విషధరునకు । జయమంగళం । నిత్యశుభమంగళం । జయా । జయమంగళం । మనోన్మయమండలం. పార్వతీ.

౪. అకలంకభావునకు । నాదిపరంజ్యోతికిని । నికరమై వెలైను నిర్మలునకు! ప్రకటితంబై నట్టి । ప్రజ్ఞాన బ్రహ్మకళ । పరబయలుతానగు. । పాలా క్షునకు । జయమంగళం । నిత్యశుభమంగళం । జయా । జయమం గళం । మనోన్మయమండలం. పార్వతీ.

౫. ఏకాక్షరేశునకు । మెఱుకప్రతాపునకు । నాకాద్యనాదియా । నందీ శునకు । ఏకమానట్టియా । ఏకాంతమందిరము । జాజ్వల్యాకనియట్టి । ధవళాంగునకు । జయమంగళం । నిత్యశుభమంగళం । జయా । జయ మంగళం । మనోన్మయమండలం. పార్వతీ.

౬. మంగళం గురుశిష్య । మార్గబోధాఖ్యునకు । మంగళం నరసింహ్మా । మన్మయునకు । మంగళం గిరిపైని । మహాలింగతేజునకు । మంగళం పరశివా । మననమునకు । జయమంగళం । నిత్యశుభమంగళం । జయా । జయమంగళం । మనోన్మయమండలం. పార్వతీ.

గీ॥ వసుధ ముత్యాల వంశ వినర్ధినుండ । రామస్వామి యనందగు రాజ యోగి । వర్యునకు కుప్పమాంబకు ననుతుండ । రమ్యగుణభోగి నరసింహ రాజయోగి॥

క॥ పరశివధ్యానత బిందుమన । పరుసడి యోగులనుసు ...సద్ధతి తెలియుగా । గురురాయునిదయ చేసెను । అనయగనిదని ... నాయ ... గు ... సరముల్॥

గద్య॥ ఇతి శ్రీమద్గారీపుత్ర వంశ ... సుధాకర ... శ్రీవిష్ణుగోత్రసంభూత ముత్యాల రామస్వామియోగిపుత్రుం డును ... కుప్పమాంబా గర్భ శుక్తిముక్తా ... ప్రాయుండును, శ్రీలక్ష్మీ నృసింహస్వామి వరప్రసాద లబ్ధుండును, శ్రీమద్దేవాంగసార సచ్చిదా నంద నాదబిందు కళాతీత అచల పరిపూర్ణుండును, ... వశిఖామణి దిగంబరేశ గురు ప్రియశిష్యుండును నగు ముత్యాల - నారసిహ్మ నాగేంద్రునిచే రచియింపంబడిన, వివేక సందర్భ రత్నావళి యను, జీవే శ్వర సంయోగ రహస్యము సర్వంబును సంపూర్ణము.

---

## ౯. శ్రీ రం గ నా థా ష్ట క ము.

శ్లో॥ ఆనందరూపే నిజభోగిరూపే బ్రహ్మస్వరూపే శ్రుతిమూర్తిరూపే, శశాంకరూపే రమణీయరూపే శ్రీరంగరూపే రమతాం మనోమే.

తా. అపరిచ్ఛిన్న సుఖస్వరూపుండును, నిజరూపమందే భోగిం చువాఁడును, పరబ్రహ్మ రూపుఁడును, ఉపనిషత్ప్రతిపాద్య స్వరూపముగల వాఁడును, చంద్రస్వరూపమునఁబలె శాంతుఁడును, మనోహరమైన రూపము గలవాఁడు నగు, శ్రీరంగనాథుని స్వరూపమునం దెల్లప్పుడు నామాన సంబు క్రీడించుఁగాక.

శ్లో॥ కావేరితీరే కరుణావిలోకే మందారమూలే ధృతిచారుమాలే, సత్యం విలోలే శుభరమ్యశీలే శ్రీరంగదేవే రమతాంమనోమే.

తా. కావేరితీర నివాసుఁడును, కారుణ్యకటాక్షము గలిగినవాఁ డును, పారిజాత వృక్షమూలమున నుండువాఁడును, మనోహరముల గున హారములు గలవాఁడును, సత్య స్వరూపుఁడును, చాంచల్యము

లేని వాఁడును, మంగళ కరమైన రమణీయ స్వభావము గలవాఁడునగు శ్రీరంగదేవునియం దెల్లప్పుడు నామానసంబు క్రీడించుగాక.

శ్లో. లక్ష్మీవిలాసే జగతాం నివాసే హృత్పద్మవాసే అరవిందవాసే,
త్రైలోక్యవాసే ఖిలలోకవాసే శ్రీరంగవాసే రమతాంమనోమే.

తా. లక్ష్మీ విలాసము గలిగినట్టియు, లోకముల కాధారమైనట్టియు, యోగిహృత్కమల నివాసుఁడైనట్టియు, కమలమునకు నివాసమైనట్టియు, స్వర్గాదిలోకత్రయమున కాధారమయినట్టియు, సర్వలోకాధార మయినట్టియు, శ్రీరంగవాసునియందు నామనస్సు క్రీడించుగాక.

శ్లో. బ్రహ్మాదివంద్యే జగదేకవంద్యే వంద్యేముకుందే వదనారవిందే,
వ్యాసాదివంద్యే సనకాదివంద్యే శ్రీరంగవంద్యే రమతాంమనోమే.

తా. బ్రహ్మాది దేవతల చేతనుఁ వ్యాసాది మహార్షుల చేతను సనకాది యోగులచేతను, వంద్యుఁడయి నట్టియు, జగద్వంద్యుఁడయినట్టియు, అరవిందము వంటి ముఖము గల్గినట్టియు రంగ దేవుని యందు నామనంబు క్రీడించుగాక.

శ్లో. అమోఘముద్రే పరిపూర్ణనిద్రే శ్రీయోగనిద్రేచ సముద్రనిద్రే,
శ్రీరంగనిద్రే జగదేకభద్రే శ్రీరంగనిద్రే రమతాం మనోమే.

తా. అమోఘ యోగనిద్రగలిగినట్టియు పరిపూర్ణనిద్ర గలిగినట్టియు, యోగనిద్రా సమేతుఁడయినట్టియు, సముద్ర మధ్యమునందు నిద్రించి నట్టియు, లక్ష్మీదేవియొక్క యంకమునందు నిద్రించునట్టియు, శ్రీరంగక్షేత్రమందు నిద్రించు నట్టియు రంగదేవుని యందు నా మనంబు క్రీడించుగాక.

శ్లో. పద్మాదిరాజే గరుడాధిరాజే విరించిరాజే సురరాజరాజే,
త్రైలోక్యరాజే ఖిలలోకరాజే శ్రీరంగరాజే రమతాం మనోమే.

తా. నవనిధులకు రాజును, గరుడునికి రాజును, బ్రహ్మకు రాజును ఇంద్రునికి రాజును, లోకత్రయమునకు రాజును, నిఖిలలోకములకు రాజునునయిన రంగరాజునందు నామనంబు క్రీడించుగాక.

శ్లో. సచ్చిత్తశాయీ భుజగేన్ద్రశాయీ నిద్రాంకశాయీ కమలాంకశాయీ,
క్షీరాబ్ధిశాయీ వటపత్త్రశాయీ శ్రీరంగశాయీ రమతాం మనో మే.

తా. సాధుచిత్తమునందు శయనించువాఁడును, భుజగేంద్రశాయి, నిద్రా సమేతుఁడును లక్ష్మీదేవియంకమునందు నిద్రించు, పాలసముద్రమందును, వటపత్త్రమందును, శ్రీరంగక్షేత్ర శయనించునట్టి వాఁడును, అగు రంగదేవునియందు, నామనస్సు రమించుగాక.

శ్లో. ఇందం హిరంగం త్యజతామిహాంగం పునర్నచాంగం యది చాంగమేతి, పాణౌరథాంగం శయనేభుజంగం యానేవిహంగం చరణే సుగాంగమ్.

తా. ఈ శ్రీరంగ క్షేత్రమందు దేహమును వదలినవారికి విదేహ ముక్తియే గలుగును, ఒకవేళ దేహము గలిగి నప్పటికిని, చేతియందు చక్రము, శయనమందు శేషుఁడు, గమనమందు గరుడుఁడు, పాదమందు గంగయుగల నారాయణుఁడే యగుచున్నాఁడు. అనిఫలశ్రుతి.

నిర్వాణషట్కము.

శ్లో. మనోబుద్ధ్యహంకార చిత్తాదినాహం నచశ్రోత్ర జిహ్వే నచ ఘ్రాణనేత్రే, నచవ్యోమభూమి ర్నతేజోనవాయుః చిదానందరూప శ్శివోహం శివోహమ్.

తా. మనోబుద్ధ్యహంకార చిత్తములు నేను కాను. అనఁగా, అంతఃకరణ చతుష్టయము ఆత్మకానేరదని యర్థము. శ్రోత్రము మొదలగు జ్ఞానేంద్రియములు నేను కాను. పృథివ్యాది పంచ భూతములు నేను కాను. చిదానంద స్వరూపుఁడైన శివుఁడనేను. శివుఁడనేనుఅని రెండుమారులు చెప్పుట దార్ఢ్యముకొఱకని భావము.

శ్లో. నహిపంచవాయుర్న హిసప్తధాతుర్న హిపంచకోశాః నవాక్పాణిపాదౌ నచోపస్థపాయూ చిదానందరూపశ్శివోహంశివోహమ్.

తా. ప్రాణాదివర్గము; పంచవాయువులు, సప్తధాతువులు, పంచకోశములు, వాక్పాణిపాదపాయూపస్థలనెడి కర్మేంద్రియములు, ఈ సమస్తమును నేనుకాను. సచ్చిదానందరూపుండైన శివుఁడనేను.

శ్లో. నపాపం నసౌఖ్యం నదుఃఖం నమంత్రం నతీర్థం

